ఎస్. అలెక్సీయెవిచ్

# యుద్ధం స్త్రీ ప్రకృతికి విరుద్ధం



"ప్రగతి" ప్రచురణాలయం

ఎస్. అలెక్సీయెవిచ్

# యుద్ధం స్త్రీ ప్రకృతికి విరుద్ధం



"ప్రగతి" ప్రచురణాలయం

# విషయసూచిక

# ముందుమాట

అలెక్సీయెవిచ్ స్వెత్లానా రచించిన యీ పుస్తకంలో 1941–1945 నాటి దేశభక్తియుత మహా యుద్ధంలో యుద్ధ రంగంలో, అండర్‌గ్రౌండులో, గెరిల్లా దళాల్లో చేరి పోరాడిన సోవియట్ స్త్రీల అనుభవ గాథలూ, స్మృతులూ వున్నాయి.

ఈ వివిధానేక స్వరాలు – చరిత్ర, జీవితాల సజీవ స్వరాలు – విభిన్న దృక్కోణాలనుంచే అయినప్పటికీ, అత్యంత భావావేశభరితమైన ఈ యథార్థ జీవిత కథనాలన్నీ ఒకేఒక్క విషయం చెప్తాయి. అత్యంత ప్రగాఢమైన అసాధారణ మానవానుభవాల యీ కథనాలు పాఠకుల హృదయాలను కదిలించివేస్తాయి.

డాక్యుమెంటరీ వచనం అన్ని రకాల సమాచారంనుంచీ, అన్ని రకాల కవిలి కట్టలనుంచీ ఉత్పన్నం కాదు. అసలు సంగతి రచనకు వినియోగించుకోబడిన సమాచారపు పరిమాణం కాక నాణ్యత; లక్షలాది ప్రజల జీవితాలను సమూలంగా మార్చివేసి, మొత్తంగా జాతి అంతటి ''జీవ నాడి''నీ, భవితవ్యాన్నీ ప్రభావితం చేసిన, ఎన్నడో గడిచిపోయిన ఘటనల సవివర వర్ణనను సమకూర్చడం.

అలెక్సీయెవిచ్ స్వెత్లానా రచించిన యీ పుస్తకాన్ని వెనక పత్రికలో చదివినప్పుడు, డాక్యుమెంటరీ వచనం ప్రధానంగా యువ రచయితల ప్రత్యేక గుత్త హక్కు అని నేను గ్రహించాను. వాళ్లకి వున్నంత శక్తి మరెవరికి వుంటుంది? వాళ్లు తిరిగినంత మరెవరు తిరగగలరు? అవగాహనలో తాజాతనం, విషయాలను ఆశ్చర్య చకిత విస్ఫారిత నయనాలతో వీక్షించి కనిపెట్టే సామర్థ్యాల విషయంలో వాళ్లతో సరితూగేవాళ్లు ఎవరు?

అంతే కాదు, రచయితలుగా తమ జీవిత మార్గాన్ని తీర్చిదిద్దుకోవడంలో యువ రచయితలకు యీమాదిరి వ్యాసంగం ప్రత్యేకించి ఫలవంతమైనది. అలెక్సీయెవిచ్ స్వెత్లానా మాదిరిగా ఒక టేప్ రికార్డరు సమకూర్చుకోవడం, సుదీర్ఘ జీవితాలు గడిపినవాళ్లు ఏమి ఆలోచిస్తున్నారో, వాళ్లు ఏమి అవగాహన చేసుకున్నారో తెలుసుకునేందుకుగాను జీవితం మధ్యకి అడుగుపెట్టడం – చెయ్యవలసిందంతా యింత మాత్రమే. అలా చెయ్యడం ద్వారా తన తరంవాళ్లు ఎలా వున్నారో, వాళ్లనుంచి ఆశించగలిగిందేమిటో కూడా యువ రచయిత తెలుసుకోగలుగుతాడు.

అయితే అలాంటి కవిలికట్టలు తన చేతిలో వున్నప్పటికీ, అంతిమ ఫలితం — అసలంటూ అది వుంటే — విషయంలో యువ రచయితకి హామీ అంటూ ఏదీ వుండజాలదు. సరైన కృషి మార్గాన్ని ఎంచుకోవడం, అన్నింటికంటె ముఖ్యంగా లక్ష్యశుద్ధి, ఓర్పు, ఏళ్ల తరబడి యితరుల బతుకులే తన బతుకుగా జీవించగలగడం, తద్వారా వాళ్ల జీవితాలను తన సొంత జీవితపు కొనసాగింపుగా చేసుకోవడం — ఇదీ అసలు విషయం.

అలెక్సీయెవిచ్ స్వెత్లానా వీటన్నింటిలోనూ సఫలీకృతురాలైంది. ఇందుకు అవసరమైన యోగ్యతలన్నీ ఆమెలో వుండటమే యిందుకు కారణం. పాఠకులు యీ విషయాన్ని స్వయంగా గ్రహిస్తారని నా నమ్మకం.

ఎ. అదమోవిచ్

స్త్రీని గురించి మనకి తెలిసిందంతా ఒక్క మాటలో చెప్పుకోవాలంటే, "కరుణ" అన్నదే అందుకు మిక్కిలి సరిపోయే పదం. స్త్రీకి సోదరి, భార్య, స్నేహితురాలు, అన్నింట్లోకీ అత్యున్నతమైన మాత అన్న పదాలు కూడా ఉన్నాయనుకోండి. అయితే కరుణ అన్నది యీ మాటల్లో యిమిడి లేదూ? వాటి సారాంశం, వాటి కర్తవ్యం, వాటి పరమార్థం యిదే కాదూ? స్త్రీ ప్రాణ దాత, స్త్రీ ప్రాణ పరిరక్షకురాలు, అందుకే "స్త్రీ," "ప్రాణం" అన్నవి పర్యాయ పదాలు. కాని 20వ శతాబ్దపు అత్యంత భయానకమైన యుద్ధ కాలంలో స్త్రీ సైనికురాలు కావలసి వచ్చింది. క్షతగాత్రుల్ని కాపాడి, వాళ్ల గాయాలకి కట్లు కట్టడం మాత్రమే కాదు, ఆమె పొంచివుండి శత్రువుమీద కాల్పులు జరిపింది, విమానంనుంచి బాంబులు విడిచింది, వంతెనలు పేల్చింది, శత్రువుల స్థావరాలూ, బలాబలాలూ కనిపెట్టేందుకు వేగుపని చేసింది, సమాచారం పొందేందుకుగాను యుద్ధ ఖైదీలను పట్టుకుంది. స్త్రీ శత్రువుల ప్రాణాలు తీసింది. ఆమె తన మాతృభూమిమీద, తన యింటిమీద, తన బిడ్డలమీద అపూర్వ క్రౌర్యంతో దాడిచేస్తున్న శత్రువుల ప్రాణాలు తీసింది. ఈ పుస్తకంలోని వీరవనితల్లో ఒకరు యుద్ధ బీభత్సాన్నీ, సంభవించినదానంతటి క్రూరమైన ఆవశ్యకతనీ వర్ణించ ప్రయత్నిస్తూ "చంపడం స్త్రీ పని ఎన్నడూ కాదు" అని చెప్తుంది. మరో స్త్రీ రైహ్‌స్టాగ్* గోడమీద యిలా రాసింది: "కున్‌త్సేవిచ్ సోఫియా అనబడే నేను బెర్లిన్‌కి యుద్ధాన్ని చంపేందుకు వచ్చాను."

ఈవిధంగా స్త్రీలు విజయ సాధనకోసం మహత్తరమైన త్యాగాలు చేశారు. అదే సమయంలో వాళ్లు అజరామరమైన ఒక సాహసకార్యం సాధించారు. ఆ సాహస కార్యపు బృహత్ ప్రమాణాన్ని శాంతియుత కాలక్రమంలో మాత్రమే మనం గ్రహించగలుగుతాం.

...ఇతరుల దగ్ధ స్మృతి, వేదనా మార్గాల వెంట నేనిప్పటికి నాలుగేళ్లుగా

---

* బెర్లిన్‌లోని జర్మనీ పార్లమెంటు భవనం. — సం.

పయనిస్తున్నాను. యుద్ధ రంగంలో వైద్య కార్యకర్తలుగా, సిగ్నలర్లుగా, మిలిటరీ ఇంజనీర్లుగా, పైలట్లుగా, స్నైపర్లుగా, ఫిరంగి కాల్పుదార్లుగా, విమాన విధ్వంసక శతఘ్ని దళ సభ్యురాండ్రుగా, రాజకీయ ప్రచార కార్యకర్తలుగా, అశ్వికురాండ్రుగా, టాంక్ సైనికురాండ్రుగా, పారచూట్ దళ సభ్యురాండ్రుగా, నావికురాండ్రుగా, ట్రాఫిక్ కంట్రోలర్లుగా, డ్రైవర్లుగా, స్నాన గృహాల్లో, లాండ్రీల్లో పనికత్తెలుగా, వంట కత్తెలుగా, బ్రెడ్డు బేకర్లుగా, అంతే కాకుండా రహస్య, గెరిల్లా దళాల్లో సభ్యురాండ్రుగా పాల్గొన్న వందలాది స్త్రీల కథనాలు నమోదుచేశాను. "మన సాహసిక స్త్రీలు తమ సోదరులతో, భర్తలతో, తండ్రులతో సరిసమానంగా కూలంకషంగా అలవరచుకోజాలని కళ అంటూ దాదాపు ఏ ఒక్కటీ లేదు" అని రాశాడు మార్షల్ ఎ. ఐ. ఎరేమెంకొ. "టాంకు సైనికుడు," "పదాతి సైనికుడు," "సబ్ మెషీన్ గన్నర్" వంటి పదాలకి మన రష్యన్ పదజాలంలో స్త్రీలింగ రూపాలు లేకపోయినప్పటికీ—ఇంతకు ముందెన్నడూ యీ కార్యకలాపాల్లో స్త్రీలు నిమగ్నం కాలేదు గనుక—టాంకు దళాల మహిళా కమ్సొమోల్* దళ నాయకులు, భారీ టాంకుల డ్రైవర్లు, మర తుపాకి దళాల కమాండర్లు ఈ యుద్ధంలో వున్నారు.

ఒక్క లెనినిస్టు కమ్సొమోలే 2 లక్షల మంది కమ్సొమోల్ సభ్యురాండ్రతో బాటు 5 లక్షల మంది అమ్మాయిలని సైన్యంలోకి సమీకరించింది. ఈ అమ్మాయిల్లో 70 శాతం మంది యుద్ధ రంగ సైన్యంలో పనిచేశారు. యుద్ధంలో మొత్తం 8 లక్షలకి పైగా అమ్మాయిలు యుద్ధ రంగ సైన్యాలకు చెందిన వివిధ శాఖల్లో పనిచేశారు.

సోవియట్ దేశంలో, ప్రత్యేకించి నాజీలు ఆక్రమించిన ప్రాంతాల్లో దాదాపు ప్రజలందరూ గెరిల్లా ఉద్యమంలో పాల్గొన్నారు. ఒక్క బైలోరష్యాలోనే 60 వేల మంది సాహసిక సోవియట్ స్త్రీలు గెరిల్లా దళాల్లో చేరి పోరాడారు. ప్రతి నలుగురు బైలోరష్యన్లలో ఒకరిని నాజీ నరహంతకులు సజీవంగా దహించారు లేక మరో విధంగా చంపారు.

మనకి గణాంక లెక్కలు తెలుసు. కాని వాటి వెనక మానవ జీవితాలు, యుద్ధం చేత చిదిపివేయబడిన మానవ జీవితాలు వున్నాయి. వీళ్ల సన్నిహితులను, ఆప్తులను కోల్పోవడం గురించి, ఆరోగ్యం దెబ్బతిన్నవాళ్లని గురించి, స్త్రీల ఒంటరిపాటు దైన్యం గురించి, యుద్ధ కాలపు దుస్సహ స్మృతులను గురించి మనకి తెలియదు.

---

* కమ్సొమోల్ — సోవియట్ యూనియన్‌లో అఖిల యూనియన్ కమ్యూనిస్టు యువజన సంఘం. దానికి లెనిన్ పేరు పెట్టారు. — సం.

1941 నాటి యువతులను గురించి మీకు నేను చెప్తాను, మరింత కచ్చితంగా చెప్పాలంటే, వాళ్ళే తమ సొంత యుద్ధ కథలు చెప్తారు.

నేను యుద్ధానంతరం జన్మించిన మాట నిజమే, కాని యుద్ధపు మరణాంతకమైన ఊర్పులు నా జీవితాన్ని కూడా దెబ్బతీశాయి. మేము యుద్ధంమీద పగ తీర్చుకోవలసిన తరాలకి చెందినవాళ్ళం. యుద్ధం మా కుటుంబంలో 11 మందిని పొట్టన పెట్టుకుంది. నా తాత పెత్రో, ఉక్రేనియన్. బుడాపెష్ట్ దగ్గర నేలకొరిగాడు. నా బామ్మ ఎవ్డొకీయా ఆకలితో, టైఫస్ వ్యాధితో మరణించింది. నా దూరబంధువుల రెండు కుటుంబాలను పిల్లలతో సహా నా స్వగ్రామంలో ఫాసిస్టులు సజీవంగా దగ్ధంచేశారు. 1941లో ఐచ్ఛికంగా యుద్ధంలో చేరిన నా పినతండ్రి ఇవాన్ ఐపూ జాడా తెలియలేదు.

నా ''స్వీయ'' యుద్ధం కూడా నాలుగేళ్ళు సాగింది. నేను విన్న సమాచారం మూలంగా అనేక పర్యాయాలు నా మనస్సు వికలమైపోయింది. కొన్ని సందర్భాల్లో నేనింక ఎంత మాత్రం ఓర్చుకోలేనని కూడా అనిపించింది... ఈ కాలమంతట్లోనూ నేను డైరీ రాస్తూవచ్చాను. దాన్ని కూడా నా యీ పుస్తకంలో చేర్చేందుకు నేను సాహసిస్తున్నాను. ఆ డైరీలో నా సంవేదనలు వున్నాయి, నా అనుభవాలు వున్నాయి. దేశపు వివిధ ప్రాంతాల్లోని నూటికి పైగా పట్టణాల్లో, నగరాల్లో, జనావాసాల్లో, గ్రామాల్లో నేను సాగించిన గాలింపు భౌగోళిక వివరం కూడా వుంది. ''నేను అనుకుంటున్నాను,'' ''నేను ఆదుర్దాపడుతున్నాను,'' ''నేను సందేహిస్తున్నాను'' అన్న మాటలను నా పుస్తకంలో వాడే హక్కు నాకు వుందా అని చాలా కాలంపాటు నేను సంకోచించాను. వాళ్ల సంవేదనలతో, వేదనలతో పోలిస్తే నా సంవేదనలూ, వేదనలూ యేపాటివి? నా భావోద్వేగాలతో నిండిన నా డైరీలో ఎవరికైనా ఆసక్తి వుంటుందా అని అనుమానిస్తూవచ్చాను. కానైతే నా ఫైళ్లలో సమాచారం పోగయ్యేకొద్దీ, భావోద్విగ్నత లేని స్మృతులంటూ ఏవీ వుండవన్న విషయంలో నా నమ్మకం పెరగ సాగింది.

సామాన్యంగా యుద్ధ స్మృతులూ, తత్సంబంధిత అభిప్రాయాలూ ''పురుష'' స్వభావం కలిగినవి. యుద్ధ రంగంలో పోరాడినది అత్యధిక భాగం పురుషులే కనుక యిది సహజమే. కాని యిది మన జ్ఞాన లోపానికి ఒప్పుకోలు కూడా. దేశభక్తియుత మహా యుద్ధంలో పాల్గొన్న స్త్రీలను గురించి వందలాది పుస్తకాలు రచింపబడిన మాటా, కొన్ని స్మృతి గ్రంథాలు ప్రచురింపబడిన మాటా, మనం యీ విషయంలో ముందెన్నడూ కనివిని యెరుగని చారిత్రక విషయాన్ని పేర్కొంటున్నట్లు అవి చూపిన మాటా నిజమే అనుకోండి. ఇంతకు ముందెన్నడూ యింతమంది స్త్రీలు యుద్ధంలో పోరాడలేదు. 19వ శతాబ్ది యుద్ధాల కాలంలో ఆశ్విక సైనికురాలు

దూరోవా నదేజ్దా, గెరిల్లా యోధురాలు కోర్జునా వసిలీసా వంటి ఐతిహాసిక నామాలు కొన్ని మనకి తెలుసు. 1918–1921 నాటి అంతర్యుద్ధంలో స్త్రీలు ఎర్ర సైన్యంలో పనిచేశారు. కానైతే వాళ్ల అత్యధిక భాగం నర్సులుగా, డాక్టర్లుగా పనిచేశారు. దేశభక్తియుత మహా యుద్ధం స్త్రీలు తమ మాతృదేశ రక్షణలో మూకుమ్మడిగా పాల్గొన్న ఉదాహరణను చేకూర్చింది.

"స్రావెమేన్నిక్"* పత్రికలో దూరోవా నదేజ్దా నోట్సులో కొంత భాగం ప్రచురింపబడింది. దానికి ముందుమాట రాస్తూ పుష్కిన్ యిలా అన్నాడు: "ఒక ప్రభు కుటుంబానికి చెందిన అమ్మాయి తన యిల్లు వదిలి ఎందుకు వెళ్లిపోవలసివచ్చింది, మగ వేషం ఎందుకు వేసుకోవలసివచ్చింది? పురుషులను సైతం భయభీతుల్ని చేసే విధులనూ, బాధ్యతలనూ ఎందుకు వహించవలసివచ్చింది, యుద్ధ రంగాల్లో – ఎలాంటి యుద్ధ రంగాలు! – నెపోలియన్ పోరాడిన యుద్ధ రంగాల్లో నడయాడేలా చేసింది యేమిటి! ఆమెని అందుకు ప్రేరేపించిన భావాలేమిటి? వ్యక్తిగతమైన కుటుంబ యిబ్బందులా? మనోగతమైన ప్రేరణా? లేక ప్రేమా?.." పుష్కిన్ ఒక్క స్త్రీ ఊహాతీత జీవితం గురించి ప్రస్తావించాడు. పుష్కిన్ ఎన్నెన్నో ఊహలు చేశాడు. కాని యిక్కడ చూస్తున్నది అందుకు పూర్తిగా భిన్నమైనది. 8 లక్షల మంది స్త్రీలు సైన్యంలో పనిచేశారు. ఇంకెందరో యుద్ధ రంగంలో చేరుతామని దరఖాస్తులు పెట్టారు.

విమాన విధ్వంసక శతఘ్ని దళ సభ్యురాలైన కె. ఎస్. తిఖొనోవిచ్ చెప్పినట్లు, "మేము, మాతృభూమి అన్నవి మన దృష్టిలో పర్యాయపదాలు," అందుకే స్త్రీలు యుద్ధంలో చేరారు. వాళ్ల ప్రజల ముందూ, దేశం ముందూ "ఉండటమా, ఊడటమా" అన్న ప్రత్యామ్నాయం చరిత్ర త్రాసులో తూచబడుతున్నప్పుడు యుద్ధంలో క్రియాశీల పాత్ర వహించేందుకు స్త్రీలు అనుమతింపబడ్డారు. అప్పట్లో ప్రమాదంలో వున్నది దేశపు మనుగడ.

పోతే యీ పుస్తకంలో చేర్చబడిన సమాచారం గురించీ, అందుకు అనుసరింపబడిన సూత్రం గురించీ చెప్పుకున్నప్పుడు, ప్రసిద్ధురాండ్రైన స్నైపర్ల గురించీ, లేక ప్రసిద్ధురాండ్రైన పైలట్ల గురించీ, లేక గెరిల్లాల గురించీ నేను బుద్ధిపూర్వకంగా వదిలేశాను. వాళ్లని గురించి యింతకు ముందు చాలా రాయబడటమే యిందుకు కారణం. "యుద్ధంలో పాల్గొన్న మేము, యితరులు చాలామందిలాగే, సామాన్యమైన అమ్మాయిలం" అన్న మాటలు నేను అనేక పర్యాయాలు విన్నాను.

---

* 1836–1846 మధ్య సెంట్ పీటర్స్‌బుర్గ్‌నుంచి ప్రచురింపబడిన త్రైమాసిక పత్రిక. – సం.

మరి నేను చూస్తున్నది సరిగ్గా అలాంటి వ్యక్తులకోసమే. ఎందుకంటే, మనం జన స్మృతుల భాండారమంటామే, ఆ భాండారం నిండివుండేది అలాంటి వాళ్ల స్మృతులతోనే. ''యుద్ధాన్ని మీరు మా కళ్లతో, అంటే స్త్రీల కళ్లతో చూసినట్లయితే, అది ఊహకి అందేవాటిలో కెల్లా అత్యంత భయానకమైనదిగా కనిపిస్తుంది'' అని చెప్పింది అప్పట్లో మెడికల్ ఆర్డర్లీ మిషూతినా అలెక్సాంద్రా. ఇవి, మొదటినుంచి చివరిదాకా యుద్ధంలో పాల్గొన్న, దరిమిలా వివాహమై ముగ్గురు బిడ్డలు కలిగిన, యిప్పుడు మనవళ్ళీ మనవరాండ్రనీ పెంచుతున్న ఒక సాధారణ స్త్రీ చెప్పిన యీ మాటలు యీ పుస్తకంలోని మూల భావాన్ని వ్యక్తపరుస్తాయి.

తను పట్టిన ప్రతిబింబాన్ని స్థిరీకరించడంలో కటకానికి వున్న సామర్థ్యాన్ని కాపాడే విషయంలో, దృశా శాస్త్రం ప్రదీపన భావాన్ని వినియోగించుకొంటుంది. అదే మాదిరిగా, స్త్రీల భావోద్వేగపూరిత అనుభవం, బాధల తీవ్రతల మూలంగా యుద్ధాన్ని గురించిన స్త్రీల స్మృతులు అన్నింట్లోకీ అత్యంత ''ప్రదీప్తమైనవి.'' ఆ స్మృతులు భావోద్విగ్న భరితమైనవి, భావావేశపూరితమైనవి. ఎన్నెన్నో వివరాలను సమకూర్చి, పత్రాలకు అవి విశేషమైన ప్రామాణికతను కల్పిస్తాయి.

అప్పట్లో సిగ్నలర్ వలెగ్ఝానినొవా అంతొనీనా స్టాలిన్‌గ్రాడ్ యుద్ధంలో పాల్గొంది. ఆ పోరాటంలో ఎదుర్కొన్న కష్టాలను గురించి చెప్పేటప్పుడు, తన భావాలను కచ్చితంగా వర్ణించేందుకు ఆమె చాలాసేపు మాటలకోసం తడుముకొంది. తర్వాత అకస్మాత్తుగా ఆమె యీకింది పద చిత్రాన్ని యిచ్చింది: ''నా స్మృతిలో ఒక పోరాటం గాఢంగా నాటుకుపోయింది. అక్కడ డజన్ల కొద్దీ మృతులు పడి వున్నారు... వాళ్లంతా విశాలమైన ఒక పొలంలో, నాగలిచేత పెళ్లగింపబడిన బంగాళ దుంపల మాదిరిగా, చెల్లాచెదరుగా పడివున్నారు. దాడిచేస్తూ ముందుకు సాగుతూ వున్నవాళ్లల్లా ఎక్కడివాళ్లు అక్కడ నేలకొరిగారు. బంగాళ దుంపల్ని పోగుచేసినట్లే వాళ్లని పోగుచేశారు. మనిషిని ఎక్కడ మట్టవలసివస్తుందో అన్న భయంతో నడిచే బుద్ధిసూక్ష్మత కలిగిన గుర్రాలు సైతం మృతులను చూసి యికనెంత మాత్రం భయపడటం మానుకున్నాయి...''

ఆనాటి గెరిల్లా దళ సభ్యురాలు కొరొఝ్మ్యాకినా వలెంతీనా యీకింది ఘటనని తన స్మృతి పథంలో నిలుపుకొంది: ''యుద్ధపు తొలి రోజులు. మా దళాలు భయంకరమైన పోరాటాలు జరుపుతూనే తిరోగమిస్తున్నాయి. గ్రామస్థులందరూ వాళ్లకి వీడ్కోలు చెప్పేందుకు రోడ్డు పక్కనే నిలబడ్డారు. మా అమ్మా, నేనూ కూడా అక్కడ వున్నాం. వయస్సు ముదిరిన ఒక సైనికుడు దారిన పోతున్నవాడల్లా మా యింటి దగ్గర ఆగి, నేలకి వంగి మా అమ్మ కాళ్లకి నమస్కరించాడు... 'అమ్మా, మమ్మల్ని క్షమించండి... ఈ అమ్మాయిని కాపాడండి. ఎలాగైనా సరే యీమెని

కాపాడండి' అన్నాడు. అప్పటికి నా వయస్సు పదహారేళ్ళు. నాకు పెద్ద జడ వుండేది...''
ఆమెకి మరో ఘటన కూడా జ్ఞాపకం వుంది: ''నా తొలి క్షతగాత్ర సైనికుణ్ణి చూసి నేను కన్నీరు పెట్టుకున్నాను... చచ్చిపోయేముందు అతను నాతో యిలా అన్నాడు: 'అమ్మాయ్, నిన్ను నువ్వు జాగ్రత్తగా కాపాడుకో. నువ్వింకా బిడ్డల్ని కనాలి... చూడు ఎంత మంది మగాళ్లు చచ్చిపోయారో...' ''

స్త్రీల స్మృతిలో మామూలుగా పురుషుల దృష్టిని ఆకర్షించని మానవ భావోద్వేగాలు నిలిచివుంటాయి. పురుషుల శ్రద్ధ అంతా ఒక కార్యాచరణగా యుద్ధం మీద కేంద్రీకరింపబడి వుండగా, యుద్ధంపట్ల స్త్రీల దృష్టి అందుకు భిన్నంగా వుంటుంది. బాంబింగు, మరణం, బాధ – యివన్నీ వాళ్ల దృష్టిలో యుద్ధంలో ఒక భాగం మాత్రమే. వాళ్ల మనోదృష్టి భేదం ఒక్కటే కారణం కావచ్చు. స్త్రీ – ఆమె భిన్న మనస్తాత్విక, శారీరక స్వరూప స్వభావాల కారణంగా యుద్ధపు శారీరక, నైతిక కష్టాలు రెండింటినీ మరింత నిశితంగా అనుభూతి చెందుతుంది. కాగా యుద్ధ కాలపు ''పురుష'' అవగాహనను అవలంబించడం ఆమెకు మరింత కష్టం. మృత్యు నరకంలో వాళ్లు పొందిన అసాధారణమైన, అంతులేని మానవ సంభావ్యతలకు సాక్షీభూతమైన బౌద్ధిక అనుభవం యీనాడు మరింత విలువైనది. మరి దాన్ని విస్మృతి గర్భంలో పాతిపెట్టేసే హక్కు మనకి లేదు.

యుద్ధంలో పాల్గొన్నవారిలో చాలామంది యీనాడింకా బతికివున్నారు. కానైతే మానవ జీవితం అనంతమైనది కాదు. కాలపు ఆఘాతానికి గురిచెయ్యబడని మానవ జీవితం స్మృతి ద్వారా మాత్రమే పొడిగించబడగలదు. యుద్ధంలో పాల్గొని, విజయం సాధించిన మనుషులకి తాము చేసినదాని, తాము అనుభవించినదాని ప్రాముఖ్యం యేమిటో తెలుసు. తమ యీ స్మృతి కోశాన్ని భావి తరాలకోసం పదిలపరచ ప్రయత్నించేవారెవరికైనా సాయపడేందుకు వాళ్లు ఆత్రంగా వున్నారు. ఆయా కుటుంబాలను దర్శించినప్పుడు నేను పదే పదే ఒక విషయం గుర్తించాను. పిల్లలకోసం, మనవలకోసం మందపు నోట్‌బుక్కులలోనూ, సన్నని కాపీ పుస్తకాల్లోనూ స్మృతులు పదిలపరచబడివుండటం నేను చూశాను. ఈ వారసత్వం అపరిచితురాలికి అయిష్టంగా అందజెయ్యబడింది. సాకులు సాధారణంగా యెప్పుడూ ఒకే మాదిరిగా వుండేవి: ''వీటిని మా జ్ఞాపకార్థం మా పిల్లలకి యివ్వాలని అనుకున్నాం'' లేక ''మూలాన్ని మా అబ్బాయికి యివ్వాలనుకున్నాను. అందుకని దీనికి మరో కాపీ రాసి మీకిస్తాను...''

అయితే, ప్రతి ఒకరూ యిలా నోట్సు రాసుకోరు. అనేక విషయాలు నమోదు చెయ్యబడకుండానే వుండిపోతాయి. అలాంటి విషయాలను శాశ్వతంగా కోల్పోతాం, అవి విస్మరింపబడిపోతాయి. యుద్ధాన్ని విస్మరించకపోతే ఎంతో ద్వేషం పేరుకు

పోతుంది, కాని అది విస్మరింపబడితే ఓ కొత్త యుద్ధం మొదలవుతుంది – అంటూండే వాళ్ల పూర్వులు.

స్త్రీల కథనాలన్నింటినీ ఒక చోట గుదికూర్చినప్పుడు, అవి యుద్ధాన్ని స్త్రీ దృష్ట్యా మన ముందు పెడతాయి. అవి నిన్నటి, నేటి, రేపటి ఫాసిజంమీద ఆరోపణలు చేసే సాక్షుల కథనాల్లా కనిపిస్తాయి. ఫాసిజంమీద తల్లులు, సోదరులు, భార్యలు ఆరోపణలు చేశారు. స్త్రీలు దాన్ని బహిర్గతంచేసి ఖండించారు.

అలాంటి స్త్రీలలో ఒకరు నా ముందుంది. యుద్ధానికి సరిగా ముందు తనకి తోడుంటే గాని అమ్మమ్మని చూసేందుకైనా తన తల్లి పంపేది కాదట. తను చాలా చిన్న పిల్లనని అంటూండేదట. తర్వాత రెండు నెలలకి తను యుద్ధ రంగానికి వెళ్లి, మెడికల్ ఆర్డర్లీగా చేరి, స్మొలేన్స్క్‌నుంచి ప్రాగ్‌దాకా యుద్ధంలో పోరాడుతూ వెళ్లిందట. యుద్ధంనుంచి తిరిగి వచ్చేసరికి ఆమె వయస్సు 22 ఏళ్లు. ఆమె సమవయస్కులు యింకా చిన్న పిల్లలే, కాని ఆమె అనుభవం విస్తృతమూ, బాధాకరమూ అయినది. ఆమె ముమ్మారు గాయపడింది. వాటిలో ఒక గాయం – రొమ్ముకి తగిలినది – చాలా తీవ్రమైనది. ఆమెకు రెండు సార్లు బాంబు ప్రేలుళ్ల షాక్ తగిలింది. రెండో సారి బాంబు ప్రేలుడుకి పూడిపోయిన కందకాన్ని తవ్వి ఆమెని బయటకి తీసేసరికి ఆమె జుట్టు తెల్లబడిపోయింది. ఆమె స్త్రీగా తిరిగి కొత్తగా జీవితం మొదలెట్టాల్సివచ్చింది. తేలిక దుస్తులూ, పాదరక్షలూ వేసుకోవడం సరికొత్తగా అలవాటుచేసుకోవలసివచ్చింది, పెళ్లిచేసుకొని, తల్లి కావలసి వచ్చింది. యుద్ధంనుంచి తిరిగివచ్చిన పురుషులందరూ, వాళ్లు అంగవికలురైనా కూడా, కుటుంబ జీవితంలో స్థిరపడ్డారు. కాగా స్త్రీల యుద్ధానంతర జీవితం మగవారి జీవితంకంటె ఎంతో కష్టమైనది. యుద్ధం స్త్రీలకి వాళ్ల యౌవనంతో, వాళ్ల భర్తలతో ఎడబాటు తెచ్చింది. వాళ్ల సమవయస్కులైన యువకుల్లో అతి కొద్దిమంది మాత్రమే యుద్ధ రంగంనుంచి తిరిగివచ్చారు. ఏ గణాంక లెక్కల సాయమూ లేకుండానే వాళ్లకి పరిస్థితి బాగా తెలుసు. ఎందుకంటే, కసపిస తొక్కబడిన నేలమీద బరువైన గడ్డి బొద్దుల్లాగా మగాళ్లు ఎలా పడివున్నదీ వాళ్లకి గుర్తుంది. నావికుల జాకెట్లు ధరించిన ఆ పొడవాటి యువకుల్ని తండ్రులు, భర్తలు, సోదరులు, ప్రియులని పునర్జీవితుల్ని చేసేది యీ ప్రపంచంలో యేమీ లేదన్న, వాళ్లు ఉమ్మడి సమాధుల్లో పూడ్చబడి వుండిపోతారన్న విషయం నమ్మడం, ఆ భావంతో సరిపెట్టుకోవడం వాళ్లకి ఎంత అసాధ్యం. "ఎంతమంది క్షతగాత్రులంటే, మొత్తం ప్రపంచమే క్షతగాత్రమైందనిపించేది..." అంది ఆనాటి సీనియర్ సార్జెంటూ, నర్సూ దేమ్చెంకొ అనస్తాసియా.

1941 నాటి యీ చిన్నమ్మాయిలు ఎలాంటి వాళ్ళు? వాళ్ళు ఐచ్ఛికంగా యుద్ధ రంగానికి ఎలా వెళ్ళారు? నేనీ అంశంతో ప్రారంభించి, వాళ్ల సుదీర్ఘ జీవయాత్రలను వాళ్లతోబాటు అనుసరించేందుకు ప్రయత్నిస్తాను.

## "అమ్మాయిలూ, మీరు మరీ చిన్నవాళ్లు... మీరింకొంచెం పెరిగి పెద్దవాళ్లవాలి..."

టేప్ రికార్డులు విని రాసిన పేజీలు తిరగేస్తూ, ఉత్తరాలు చదవుతూ, తిరోగమిస్తున్న సైనిక దళాలతో కలిసివెళ్తున్న ఈ చిన్నమ్మాయిలను, యుద్ధ రంగానికి వెళ్లాలన్న తపనతో, సగం బాల్య చాపల్యంతో తమ వయస్సుకి ఒకటి రెండేళ్లను కలిపి, మిలిటరీ రిజిస్ట్రేషన్, సైనిక సమీకరణ కార్యాలయాల చుట్టూ తిరిగినవాళ్లను నా మనఃపటలంమీద చిత్రించుకునేందుకు ప్రయత్నిస్తున్నాను.

వాళ్లకి సంబంధించినంతవరకు ప్రపంచం రాత్రికి రాత్రి చివరి స్కూలు గంట, పదవ తరగతి పూర్తిచేసిన సందర్భంగా వీడ్కోలు పార్టీకోసం కొత్త దుస్తులు, వేసవి సెలవలు, గ్రామీణ ఆస్పత్రిలో లేక పాఠశాలలో విద్యార్థినులుగా తరిఫీదు, తొలి ప్రేమ, భవిష్యత్తును గురించిన స్వర్ణ స్వప్నాలతో కూడిన వాళ్ల గతానికీ, యుద్ధానికీ మధ్య చీలిపోయినప్పుడు, ఆ స్త్రీలు తమని తాము స్కూళ్లకు హాజరయ్యే అమ్మాయిలుగా లేక విద్యార్థినులుగా గుర్తుచేసుకున్నారు. యుద్ధం అంటే వాళ్ల దృష్టిలో అన్నింటికంటె ముఖ్యంగా జీవితానికీ, మరణానికీ మధ్య అసందిగ్ధమైన ఎంపిక.

అలాంటి ఎంపిక సమస్య నాకే ఎదురైనట్లు ఊహించుకొని నా గదిని – నాకు అభిమానపాత్రమైన పుస్తకాలు, రికార్డులు, వెలుగు విరజిమ్ముతున్న టేబిల్ లైటు, పక్క గదిలో అమ్మ పరిచిత ఉఛ్వాస నిశ్వాసాలు – కొత్త దృష్టితో చూసేందుకు ప్రయత్నిస్తున్నాను... వీటన్నింటినీ నేను కోల్పోయివుండేదాన్ని... ఆ ఎంపిక ''ఊపిరి పీల్చుకోవడమంత సామాన్యమైనది'' అని రెట్టించేందుకు నేనింక ఎంత మాత్రం అనుకూలంగా లేను. కాని అప్పట్లో ఆ అమ్మాయిలకి మాత్రం అది ఊపిరి తీసుకోవడమంత సామాన్యమైనదిగా వుంది. మరి నేను ఆ చిన్నమ్మాయిల కంటె చాలా పెద్దదాన్ని.

ఒక మాస్కో వాసి పార్షినా జినయాదా రాసిన ఒక ఉత్తరం చదివాను. ఆమె ప్రైవేట్, సిగ్నలర్‌గా యుద్ధంలో పాల్గొంది. ''నేను యుద్ధ రంగానికి

ఐచ్ఛికంగా వెళ్లాను. అయినా, వెళ్లకుండా ఎలా వుండగలను? ప్రతి ఒకరూ వెళ్లారు... ఎవరి ఆలోచనలోనూ ప్రత్యామ్నాయమే లేదు...''

నేను సెలవలు గడుపుతున్న జెలెజ్నొవోద్స్క్‌లో (యీ పుస్తక రచనా కృషిలో నిరంతరాయంగా నిమగ్నమై వున్నప్పుడు) యాదృచ్ఛికంగా అప్పట్లో మెడికల్ ఆర్డర్లీ, ప్రైవేట్ సెర్గేయెవా నతాల్యాని నేను కలుసుకోవడం తటస్థించింది. విశిష్ట మైన తన కుటుంబం గురించి ఆమె చెప్పిన కథ యిదీ:

''మా కుటుంబంలో 8 మందిమి వుండేవాళ్లం. మొదటి నలుగురు పిల్లలం అమ్మాయిలం. ఆ నలుగురిలో నేను పెద్దదాన్ని. అవి యుద్ధపు రోజులు. నాజీలు మాస్కో పొలిమేరకి వచ్చారు. ఒక రోజున మా నాన్న పనినుంచి తిరిగివచ్చి ఏడుస్తూ యిలా అన్నాడు: 'నా మొదటి బిడ్డలు అమ్మాయిలు కదా అని సంతోషిస్తూండే వాణ్ణి... కాని యిప్పుడు ప్రతి కుటుంబం ఎవరో ఒకర్ని యుద్ధ రంగానికి పంపు తోంది. పంపేందుకు మనకి ఎవళ్లూ లేరు... నేను మరీ పెద్దవాణ్ణి, నన్ను వాళ్లు సైన్యంలోకి తీసుకోరు. మీరేమో ఆడపిల్లలు, కుర్రాళ్లింకా మరీ చిన్నవాళ్లు...' నాన్న అన్న యీ మాటలు కుటుంబంలో అందరికీ బాధ కలిగించాయి.

''నర్సుల శిక్షణ తరగతులు మొదలైనప్పుడు మా నాన్న నన్నూ, నా చెల్లెల్నీ అక్కడకి తీసుకెళ్లి యిలా చెప్పాడు: 'ఇదిగో, విజయంకోసం నేనివ్వగలిందల్లా నా యీ కూతుళ్లని మాత్రమే...' ''

ఇలాంటి సందర్భాలు అనేకం వున్నాయి. సివాష్స్కీయెకి చెందిన ఆనాటి సిగ్నలర్, జూనియర్ సార్జెంట్ క్ల్యాజెవా అంతొనీనా చెప్పిన మాటల్ని యీకింద ఉద హరిస్తున్నాను: ''అమ్మకి కొడుకులు లేరు. కుటుంబంలో ఐదుగురు కూతుళ్లు వున్నారు. అమ్మతోబాటు మమ్మల్ని స్టాలిన్‌గ్రాడ్‌కి తరలించారు. స్టాలిన్‌గ్రాడ్ ముట్టడింప బడినప్పుడు మేమందరం ఐచ్ఛికంగా యుద్ధ రంగానికి పంపమని దరఖాస్తులు పెట్టాం. తల్లి, ఐదుగురు కూతుళ్లు... మొత్తం కుటుంబమంతా... నాన్న అప్పటికే యుద్ధ రంగంలో వున్నాడు...''

అలాంటి తల్లి త్యాగంకంటె ఉదాత్తమైనది ప్రపంచంలో మరేదీ లేదు. కాని ఆమె హృదయగత భావాలేమిటో ఎవరికి తెలుసు, ఆమె మనస్సులోకి ఎవరు తొంగిచూడగలరు?

''మా అందరికీ వున్నది ఒకే ఒక్క కోర్కె – మిలిటరీ రిజిస్ట్రేషన్, సైనిక సమీకరణ కార్యాలయానికి యుద్ధ రంగానికి పంపమని దరఖాస్తు పెట్టడం'' అంటూ మీన్స్క్‌కి చెందిన అప్పటి సార్జెంటు, ట్రాఫిక్ కంట్రోలర్ సెమ్యోనొవా తత్యానా జ్ఞాపకం చేసుకుంది. ''మేము సైనిక సమీకరణ కార్యాలయానికి వెళ్లినప్పుడు మాకి చ్చిన జవాబు 'అమ్మాయిలూ మీరు మరీ చిన్నవాళ్లు... మీరింకొంచెం పెరిగి పెద్ద

వాళ్లవాలి...' అప్పటికి మా వయస్సు 17 నిండ లేదు. కాని నేను నా లక్ష్యం సాధించాను. మమ్మల్ని వాళ్లు చేర్చుకున్నారు. నా స్నేహితురాలూ, నేనూ స్నైపర్ల శిక్షణ తరగతుల్లో చేరదామనుకున్నాం. కాని 'మీరు ట్రాఫిక్ కంట్రోలర్ల శిక్షణ పొందాలి. మరే శిక్షణకీ వ్యవధి లేదు' అన్నారు అధికారులు. మేము వెళ్లిపోయే ముందు వీడ్కోలు చెప్పేందుకు కొద్ది రోజుల ముందు మా అమ్మ రైల్వే స్టేషన్లో వేచి వుంది. మేము రైల్వే స్టేషను దగ్గరకి రావడం మాత్రమే ఆమె చూసింది, నాకొక కేకూ, కొన్ని గుడ్లూ యిచ్చింది, అంతే... స్పృహ తప్పిపోయింది.''

ఆనాటి డాక్టర్, కెప్టెన్ బ్రేవున్ ఎఫ్రొసీన్యా స్మృతులు యిలా సాగాయి:

''కుటుంబంలో మేము నలుగురం ఆడపిల్లలం వుండేవాళ్లం. నేనొక్కత్తెను మాత్రమే యుద్ధ రంగానికి వెళ్లాను. తన కూతుళ్లలో ఒకతె యుద్ధ రంగంలో వున్నందుకూ, మాతృదేశ రక్షణలో ఆమె తోడ్పడుతున్నందుకూ నాన్న గర్వంతో పొంగిపోతూండేవాడు. తన కూతురు యుద్ధ రంగంలో ఉన్న విషయాన్ని గ్రామస్థులందరూ తెలుసుకోగలిగేందుకుగాను నాన్న నా పే ఆర్డర్లకోసం పొద్దున్నే కార్యాలయానికి గ్రామం గుండా వెళ్లేవాడు.''

అప్పటి గార్డ్స్ సార్జెంటు, విమానాల మెకానిక్ సప్రోనొవా ఎవ్‌గేనియా తన సొంత పట్టణమైన యెలేత్స్‌నుంచి యుద్ధ రంగానికి వెళ్లిన రోజును జన్మలో మరచిపోలేనంటూ, యిలా చెప్పింది:

''నేను మా అమ్మని ప్రాధేయపడ్డాను: 'అమ్మా దయచేసి ఏడవకు, ఏం?' అప్పటికింకా రాత్రి కాదు, కాని చీకటిగా వుంది. ఎడతెగని రోదన ధ్వని వినవచ్చింది. వాళ్లు ఏడవలేదు, మా అమ్మలు తమ కూతుళ్లని సాగనంపేటప్పుడు సన్నగా రోదించారు. మా అమ్మ ఏడవలేదు. బ్రమాన్పడిపోయింది. ఆమె నాపట్ల జాలి పడుతోంది, కాని తను ఏడిస్తే నేను కూడా ఎక్కడ ఏడుస్తానో అన్న భయంకొద్దీ ఆమె ఉగ్గబట్టి ఓర్చుకుంది. నేను యింటి దగ్గర అమ్మకి గారాల కూచిని, ముద్దు బిడ్డని. మరి నేనప్పుడు అబ్బాయిల్లా పొట్టి క్రాపుతో వున్నాను. కొద్దిపాటి ముందరి జుట్టు మాత్రమే మిగిలివుంది. నేను వెళ్లేందుకు అమ్మా, నాన్నా ఒప్పుకోలేదు. అయితే నాకు మాత్రం యుద్ధ రంగానికి వెళ్లాలని ఒకటే రంధి. ఇప్పుడు మ్యూజియంలలో వున్న 'దేశమాత పిలుస్తోంది,' 'యుద్ధ రంగానికి నువ్వేం దోహదం చేశావ్?' అన్న పోస్టర్లు నన్ను విశేషంగా ప్రభావితంచేశాయి. వయస్సు రీత్యా నాకంటె పెద్దవాళ్లైన స్త్రీలు యుద్ధ రంగానికి వెనుకతట్టున ఉండిపోవాలనీ, కాని నేను యుద్ధ రంగానికి వెళ్లాలనీ నాకు అనిపించింది.

''యుద్ధాంతం నాటికి మా కుటుంబ సభ్యులందరూ యుద్ధంలో చేరారు.

మా నాన్నా, అమ్మా, చెల్లెలూ రైల్వే కార్మికులుగా చేరి, పురోగమిస్తున్న మా సేనల వెనకే వస్తూ, రైలు మార్గాలను మరమ్మతుచేశారు. మా నలుగురికీ — అమ్మకి, నాన్నకి, చెల్లికి, నాకు — 'విజయ' చిహ్నితమైన పతకం యిచ్చారు..."

స్త్రవోపోల్ ప్రాంతానికి చెందిన రుర్నీత్‌స్కయా ఓల్గా, అప్పుడు నర్సూ, సార్జెంటూ. ఆమె తన ఉత్తరంలో యిలా రాసింది: "నేను యుద్ధ రంగానికి బయల్దేరిన రోజు చక్కటి రోజు. వాతావరణం ఉజ్వలంగా వుంది. ఎండలో వెండిజలతారు పోగుల్లా పడుతున్న వర్షం. ఎంత అద్భుతంగా వుందో! నేను యింట్లోంచి బయటకి వెళ్లి, నిలబడిపోయాను. నేనింక యిక్కడికి తిరిగి ఎన్నడూ రాకపోవడం సంభవమేనా అనుకున్నాను. అమ్మ ఏడుస్తోంది. నన్ను కౌగలించుకొని వదల్లేదు. నేను బయల్దేరి కొద్ది అడుగులు ముందుకి సాగగానే ఆమె పరుగున వచ్చి, నన్ను వాటేసుకుని ఆపేసేది... కాని నేను చచ్చిపోననీ, నేను తిరిగి వస్తాననే గాఢమైన నమ్మకం వుండేది నాకు. నేనేమిటి, చచ్చిపోవడమేమిటి? అసంభవం అనుకునే దాన్ని."

వాళ్లలో ప్రతి ఒక్కరూ యుద్ధ రంగాన్ని విభిన్న మార్గాల్లో చేరుకున్నారు. అయితే అందుకు ప్రేరణ ఒక్కటే — మాతృదేశం. ఆకాంక్ష ఒక్కటే — మాతృదేశాన్ని కాపాడటం.

వాళ్లు ఆ పని ఎలా, ఎందుకు చేశారో ఊహించనక్కర్లేదు. వాళ్లనే స్వయంగా చెప్పనీయండి.

యుద్ధం ప్రజ్వరిల్లినప్పుడు జపోల్‌స్కయా గలీనా సైన్యంలో టెలిఫోన్ ఆపరేటరుగా పనిచేస్తూండేది. ఆమె దళ స్థావరం బొరీసొవ్. యుద్ధపు మొదటి కొద్ది వారాల్లో యుద్ధ రంగం అక్కడికి మారింది. ఆమె తల్లితండ్రులు బొరీసొవ్‌కి సమీపంలో నివసిస్తూండేవారు. ఆమె కావాలనుకుంటే తన తలిదండ్రుల దగ్గరకి వెళ్లిపోయి, యుద్ధ ప్రాంతానికి దూరంగా తరలింపబడవచ్చు. కాని తన యితర స్నేహితురాండ్ర మాదిరిగానే ఆమె మరో మార్గం ఎంచుకుంది.

"మా దళంతోబాటు నన్ను మొగిలేవ్‌కి తరలించారు" అంటూ గలీనా చెప్ప సాగింది. "నాజీలు మొగిలేవ్‌మీద, ముఖ్యంగా సిగ్నల్ సర్వీసు నెలకొల్పబడిన విమానాశ్రయ ప్రాంతంమీద బాంబులు వేశారు. మామీద రాత్రింబగళ్లు బాంబులు కురిసేవి. మన సేనలు తిరోగమిస్తున్నాయి... సిగ్నల్సు దళ కమాండరు మమ్మల్నందర్నీ బారు తీర్చాడు. మేము పౌరులం, సైనికులం కాము. ఆయన యిలా అన్నాడు: 'క్రూరమైన యుద్ధం మొదలైంది, అమ్మాయిలూ. మీలాంటి చిన్న పిల్లలకి యిదంతా భరించడం చాలా కష్టం. ఇంటికి తిరిగి వెళ్లిపోవాలనుకునేవాళ్లు సమ

యం మించిపోకముందే వెళ్లిపోవచ్చు. యుద్ధ రంగంలోనే ఉండిపోవాలని కోరుకునే వాళ్లు అడుగు ముందుకెయ్యండి!''

''అందరు అమ్మాయిలూ ఒక్కుమ్మడిగా అడుగు ముందుకేశారు. మేము యిరవై మందిమి వున్నాం. మాలో ప్రతి ఒక్కరూ మాతృదేశ రక్షణకి సంసిద్ధంగా వున్నారు.

''మేము రాత్రింబగళ్లు డ్యూటీలో వుండేవాళ్లం. మేము పనిలో వున్నప్పుడు సైనికులు మా భోజనాల డబ్బీలు తెచ్చిపెట్టేవాళ్లు. మేము అక్కడికక్కడే తిండి తిని, తిరిగి పని మొదలుపెట్టేవాళ్లం. నాకు తలంటుకునేందుకు వ్యవధి చిక్కేది కాదు. అందుకని అమ్మాయిలచేత నా జడలు కత్తెర వేయించుకున్నాను...''

యాకొవ్లెవా లేనొచ్కా* తనని యుద్ధ రంగానికి పంపమని అర్థించిన నాటికి యుద్ధమింకా ఓరెంబుర్గ్ ప్రాంతంలోని బుజులూక్‌కి చేరుకోలేదు. పొరుగింటి స్త్రీలు ఆమెకి నచ్చచెప్పేందుకు ప్రయత్నించారు: ''నిన్నింకా ఎలేనా అనైనా అనడం లేదు, లేనొచ్కా అనే అంటున్నారు. ముక్కుపచ్చలారని యీ వయస్సులో నువ్వప్పుడే యుద్ధ రంగానికి పోతానంటున్నావ్... కనీసం మీ అమ్మమీదనైనా జాలి చూపించు!''

కాని యీ అమ్మాయిల్ని దిగదియ్యడం సాధ్యమైందనే మీరు అనుకుంటున్నారా?..

యాకొవ్లెవా ఎలేనా యుద్ధంలో నర్సు, సార్జెంట్ మేజరు. ఆమె కథనం యిది:

''మేము మళ్లీ రిక్రూట్‌మెంటు కార్యాలయానికి వెళ్లినప్పుడు (మేము అప్పటికే అక్కడికి ఎన్ని సార్లు వెళ్లామో నాకు గుర్తు లేదు), మిలిటరీ కమిస్సారు మమ్మల్ని దాదాపు తరిమేసినంత పనిచేశాడు: 'మీకే కనుక ఏదో ఒక రకం పనిలో ప్రత్యేక శిక్షణ వుంటే — మీరొక నర్సో లేక డ్రైవరో అయితే మిమ్మల్ని చేర్చుకుందుం... మీరే పనీ చెయ్యలేరు, ఔనా? యుద్ధ రంగానికి పంపాలట, ఏం చేస్తారు మీరక్కడ?' మాకు సంబంధించినంతవరకు, మేమేం పనిచేస్తామన్న ప్రశ్నే ఉదయించలేదు. మేము యుద్ధంలో చేరి పోరాడాలనుకున్నాం, అంతే. పోరాడటమంటే, ఏదో ఒక నిర్దిష్టమైన, అవసరమైన పని చెయ్యడమన్న విషయం మేము అర్థంచేసుకోలేకపోయాం. మేమా ప్రశ్నకి నిర్ఘాంతపోయాం.

''చాలామంది యితర అమ్మాయిలూ, నేనూ నర్సుల శిక్షణ తరగతుల్లో చేరాం. ఆ తరగతులు ఆరు నెలలు జరుగుతాయని చెప్పారు. అది మరీ సుదీర్ఘమైనదని అనుకున్నాం. మూణ్ణెల్ల యితర శిక్షణ తరగతులు వున్నాయి గాని, అవి

---

* ఎలేనాకి లేనొచ్కా ముద్దుపేరు. — సం.

అప్పుడే ముగింపు దశలో వున్నాయి. మేము పరీక్షల్లో కూర్చునేందుకు మమ్మల్ని అనుమతించమని మేము అర్థించాం. ఆ తరగతులు మరో మాసంపాటు జరిగాయి. పగటి పూట మాకు పాఠాలు జరుగుతూండగా రాత్రి పూట మాకు ఒక ఆస్పత్రిలో ప్రాక్టికల్ క్లాసులు జరుగుతూండేవి. మేమూ పరీక్షలు పాస్ కాగానే, మమ్మల్ని రిజిస్ట్రేషన్, సైనిక సమీకరణ కార్యాలయానికి పంపారు. అంటే, మా శిక్షణకి కేవలం ఒక్క నెల రోజులకి కొంచెం పైగా పట్టిందంతే....

''కానైతే మమ్మల్ని యుద్ధ రంగానికి కాక, ఒక ఆస్పత్రికి పంపారు. అది 1941 ఆగస్టు మాసాంతం. ఫిబ్రవరిలో నేను ఆస్పత్రిని విడిచి (సైనిక పరి భాషలో బాధ్యతను పరిత్యజించి పారిపోయానన్న మాట) ఏ పత్రాలూ ఏమీ లేకుండా ఒక ఆస్పత్రి రైల్లో చేరేందుకు పారిపోయాను. 'నేను డ్యూటీలో వుండను. యుద్ధ రంగానికి పోతున్నాను' అంటూ ఒక చీటీ మాత్రం పెట్టి వెళ్ళిపోయాను.''

ఇలాంటిదానికి పేరేం పెట్టగలం? టాల్‌స్టాయ్ దీన్ని గర్భితంగా వున్న దేశ భక్తియుత ఉత్సాహాతిరేకం అన్నాడు. స్త్రీలు స్వయంగా దీన్ని మాటల్లో వర్ణిం చారు: ''అయినా మేమీ విషయాన్ని ఎందుకు వివరించాలి? మేం ఎలా వున్నామో అలా వున్నామంతే. 'మాతృదేశం,' 'మేమూ' ఒక్కటేనని విశ్వసించేలా మమ్మల్ని పెంచారు.'' కాని, మనం దీన్ని అర్థంచేసుకుని, వివరించాలి. ఎందుకంటే, మనం వాళ్ల బిడ్డలం, మనుమరాండ్రం, మనుమలం.

వాళ్ల మాటలు వింటూ నేను నా ఊహ సారించేందుకు ప్రయత్నిస్తాను... వాళ్ల స్థానంలో నన్ను పెట్టుకొని కాదు. ఇక్కడ నన్ను గురించి మాట్లాడే హక్కు నాకేమి వుంది? నేను వాళ్ల కథనాలను రికార్డుచేసేందుకే కాక, వాళ్లు ఏమి అను కుంటున్నారో దాన్ని అనుభూతిచెందేందుకుగాను వాళ్ల ఎత్తుకి ఎదిగేందుకు ప్రయ త్నిస్తున్నాను. సైనికుల ఎడతెగని పొగాకు పొగతో నిండి, ఉక్కిరిబిక్కిరిగా వున్న గుడ్సు రైలు బళ్లలో వాళ్లెలా పయనించారో నా మనో ఫలకంమీద చిత్రించుకొం టున్నాను... అబ్బాయిల్లా పొట్టి క్రాప్ చేయించుకొని, వాళ్ల మాదిరి దుస్తులే ధరించిన అమ్మాయిలు తమకి మరీ పొడుగైన బొంతల్లాంటి లాంగ్‌కోట్లలో ఎంత అవకతవకగా అస్తవ్యస్తంగా వున్నారో. తమ కన్నీళ్ల విషయంలోనూ, తమ తల్లుల సుదీర్ఘ కౌగిలింతల విషయంలోనూ తమ క్రామేడ్సు ముందు వాళ్లెంత సిగ్గుపడి పోయారో: ఇంతకీ వాళ్లు వెళ్తున్నది యుద్ధ రంగానికా, అత్తారిళ్లకా?

తమ వయస్కులైన సహయాత్రికులు మౌనంగా, గంభీరంగా ఉండగా, యువ సహయాత్రికులు నవ్వుతూ, తుళ్లుతూ, పాటలు పాడుతూ వుండేవారని వాళ్లీ రోజున గుర్తుచేసుకొని చెప్తున్నారు. ఆశ్చర్యకర విషయమేమిటంటే, వాళ్లు

యుద్ధ రంగానికి వెళ్ళిననాటి స్మృతుల్లోకెల్ల అత్యుత్తమమైన దేమిటన్న నా ప్రశ్నకి వాళ్ళందరి ఏకగ్రీవ సమాధానం ఏమిటో తెలుసాండీ, వాళ్ళు తమకి యిష్ట మైన పాటలు పాడుకోవడం! యుద్ధం గురించి వాళ్ళకేం తెలుసు? 17 లేక 18 ఏళ్ల వయస్సప్పుడు ఎవరైనా ఏం తెలుసుకోగలరు?

తిహోమీరొవా మరీయా అప్పట్లో డాక్టరు అసిస్టెంటు. ఆమె యిలా చెప్పింది: యుద్ధం ప్రారంభమయ్యేందుకు ఒక నెల ముందు వైద్య శాస్త్ర పాఠశాలనుంచి పట్టా తీసుకుంది. ఆమెను లెనిన్‌గ్రాడ్ ప్రాంతంలోని ఒక గ్రామీణ ఆస్పత్రికి పంపారు. ఆమె అక్కడికి చేరుకుని స్థిరపడిందో లేదో యింతలోనే మిలిటరీ రిజి స్ట్రేషన్, సైనిక సమీకరణ కార్యాలయంనుంచి పిలుపు వచ్చింది. '''సామాను సర్దు కునేందుకు మీకు రెండు గంటల వ్యవధి వుంది. మీరు యుద్ధ రంగానికి వెళ్తు న్నారు' అని చెప్పారు. నేను నా వస్తువులన్నీ ఓ చిన్న సూట్‌కేసులో సర్దుకుని తయారయ్యాను.

''యుద్ధ రంగానికి వెళ్లేటప్పుడు మీరు మీతో యేం తీసుకెళ్లారు?''

''స్వీట్సు.''

''ఏమిటి మీరనేది, 'స్వీట్సా'?!''

''సూట్‌కేసులో పట్టినన్ని స్వీట్సు. నన్ను పంపిన గ్రామంలో నాకు ట్రావె లింగ్ అలవెన్సు యిచ్చారు. ఆ డబ్బుంతటితో నేను సూట్‌కేసులో పట్టినన్ని చాక్లెట్లు కొన్నాను. వాటిపైన నాతోబాటు మెడికల్ కోర్సులో చదివిన అమ్మాయి లందరి గ్రూప్ ఫొటో పెట్టాను.

''నేను మిలిటరీ రిజిస్ట్రేషన్, సైనిక రిక్రూట్‌మెంటు కార్యాలయానికి చేరు కోగానే మిలిటరీ కమిస్సార్ 'మిమ్మల్ని ఎక్కడికి పంపమంటారు?' అని అడిగాడు. 'నా స్నేహితురాలు ఎక్కడికైతే నేనూ అక్కడికే' అని నేను బదులుచెప్పాను. మమ్మల్నిద్దరినీ లెనిన్‌గ్రాడ్ ప్రాంతానికే పంపారు. నేను పనిచేసే గ్రామానికి 15 కిలోమీటర్ల దూరంలో వున్న గ్రామానికి ఆమెను పంపారు. ఆ మిలిటరీ కమిస్సార్ నవ్వి, 'ఆమె కూడా సరిగా యిదే ప్రశ్న అడిగింది!' అన్నాడు.''

మీన్‌స్క్ ప్రాంతంలోని జిల్లా కేంద్రమైన బెరెజినోకి చెందిన దవిదోవిచ్ తమారా సీనియర్ సార్జెంటు, డ్రైవరు. ఆమె తన స్మృతిలో నాటుకున్న యీకింది ఘట్టం చెప్పింది:

''నేను ఆర్నెల్ల డ్రైవరు కోర్సు పూర్తిచేశాను. నేను టీచరునన్న విషయం ఎవరూ పేర్కోలేదు (యుద్ధానికి ముందు నేను టీచర్స్ ట్రెయినింగ్ కాలేజిలో చదివాను). యుద్ధ కాలంలో టీచర్లు యెవరిక్కావాలి? కావలసింది సైనికులు. డ్రైవర్ల దళంలో వున్నవాళ్లం అందరం అమ్మాయిలమే.

''ఒకసారి, శిక్షణ సమయంలో... నాకీ విషయం జ్ఞాపకం వచ్చినప్పుడు నాకు కన్నీళ్లు గిర్రున తిరుగుతూవుంటాయి. అది వసంత కాలం. మేము ఫైరింగ్ ప్రాక్టీసు పూర్తిచేసుకుని వెనక్కి తిరిగివస్తున్నాం. దారిలో ఒక వయొలెట్ పూల గుత్తి పుణికి నా రైఫిల్ బయనెట్‌కి తగిలించి, నేను అలాగే నడుచుకుంటూ వస్తున్నాను. మేము శిబిరం చేరుకున్నాం. మా కమాండరు మమ్మల్నందర్నీ బారుతీరమని ఆజ్ఞాపించి నన్ను ముందుకు రమ్మన్నాడు. నేను వయొలెట్ పూల సంగతి మరచిపోయి, ముందుకి అడుగేశాను. ఆయన నామీద రుసరుసలాడుతూ 'సైనికుడంటే సైనికుడే, పూలుకోసేవాడు కాదు...' అన్నాడు. అలాంటి పరిస్థితిలో ఎవరైనా పూలని గురించి ఆలోచించగలగడం అతనికి విడ్డూరంగా కనిపించింది.

''అయితేనేం, నేను మాత్రం ఆ పువ్వులు పారెయ్యలేదు. నేను మెల్లగా వాటిని రైఫిలునుంచి తీసి, నా జేబులో పెట్టుకున్నాను. ఇందుకు నాకు శిక్ష విధింపబడింది, నా వరుస కానప్పుడు ముమ్మారు నేను డ్యూటీకి వెళ్లవలసివచ్చింది.

''మరోసారి, నేను నా స్థానంలో వున్నాను. తెల్లవారకట్ల రెండు గంటలైంది, నన్ను డ్యూటీనుంచి విడుదలచేసేందుకు మరొకరు వచ్చారు. కాని నేను డ్యూటీనుంచి తప్పుకోలేదు. 'నేను డ్యూటీ కొనసాగిస్తాను. నన్ను పగటి పూట విడుదల చేద్దువు గానిలే' అని చెప్పాను. నేను రాత్రంతా, తెల్లారేదాకా కేవలం పక్షుల కలకూజితాలు వినగలిగేందుకు అక్కడే వుండాలని కోరుకున్నాను.

''మేము యుద్ధ రంగానికి బయల్దేరినప్పుడు వీధికి రెండు పక్కలా జనం – స్త్రీలు, వృద్ధులు, బాలబాలికలు – గుంపులుగా నిలబడ్డారు. వాళ్లంతా రోదిస్తున్నారు: 'అమ్మాయిలు యుద్ధ రంగానికి వెళ్తున్నారు...' మాది అమ్మాయిల దండు... తర్వాత మేము రైలెక్కాం. ఒక విధంగా మేము అప్పటికింకా చిన్నపిల్లల్లా వున్నాం. నాకు జ్ఞాపకం వస్తోంది, మరో అమ్మాయితోబాటు నేను రైల్వే కారేజి కారిడర్ చివర నిలబడివున్నాను. కొందరు అబ్బాయిలు మాతో 'అమ్మాయిలూ, మీకు ఆకలిగా వుండివుంటుంది. మా దగ్గర కొన్ని రస్కులున్నాయి...' అన్నారు. కాని మేము 'థాంక్స్, అక్కర్లేదు' అని బదులుచెప్పి, రస్కులు తీసుకునేందుకు నిరాకరించాం. మేము స్వతంత్రులంగా ఉండవలసివచ్చింది...''

తదితర విషయాలెన్నో వుండగా, నేనీ రెండు విషయాలనే – సూట్‌కేసునిండా పట్టినన్ని చాక్లెట్లు, బయనెట్‌కి తగిల్చిన వయొలెట్ పూలు – ఎందుకు ఎంచుకున్నాను? బహుశా, నేను అర్థంచేసుకోవాలనుకుంటున్న అమ్మాయిలు, నాకు పరిచితమైన వస్తువులను చుట్టూ కలిగివున్నప్పుడు, వాళ్లు నాకు మరెంతో వాస్తవికమైనవాళ్లూ, ప్రీతిపాత్రులూ అవడమే అందుకు కారణమేమో. ఏదేమైతేనేం,

ఆషామాషీ విషయాలైన సూట్‌కేసునిండా చాక్లెట్లు, బయనెట్‌కి తగిల్చిన పూల గుత్తికోసం వరుసతప్పించిన మూడు డ్యూటీలు యీనాడు నా ఊహల్ని రేకెత్తించి నంతగా పేల్చివేసిన రైలుబళ్ల సంఖ్యా, కూల్చివేసిన విమానాల సంఖ్యా, నాశనంచెయ్య బడిన ఆయుధ, పరికరాల సంఖ్యా, శత్రువునుంచి వశంచేసుకున్న యుద్ధ చిహ్నాల సంఖ్యా నా ఊహల్ని రేకెత్తించవు. విజయ సాధనకి అవసరమైన సంఖ్యలో, రాసిలో మనం వాటిని నాశనంచేశామన్న సంగతి మనకీనాడు తెలుసు. ఈనాడు మనల్ని అత్యంత ప్రగాఢంగా కదిల్చివేసేవి యుద్ధ కాలంలో మానవ జీవితాల వివరాలే గాని, సైనిక చర్యల వర్ణనలు కావు. యుద్ధ కాలంలో మానవ అస్తిత్వానికి సంకేతమయ్యే రోజువారీ జీవితపు ప్రతి విషయానికీ, ప్రతి చిన్న వివరానికీ యుద్ధం గణనీయమైన ప్రాముఖ్యం కల్పిస్తుంది.

సామాన్యమైన యీ అమ్మాయిలు అసామాన్యమైన సైనికులెలా అయారు? సాహస కృత్యాలు చేసేందుకు వాళ్లు సన్నద్ధులయ్యారు, కాని వాళ్లు సైన్యపు జీవితానికి సిద్ధంగా లేరు, సైన్యం వాళ్లని స్వీకరించేందుకూ సిద్ధంగా లేదు. అందుకనే అమ్మాయిల్లో అత్యధిక భాగం వలంటీర్లు. వాళ్లు సైన్యంలో చేరుతారని లెక్కా వేసుకోలేదు, కనీసం అనుకోనైనా లేదు. ఒస్మోలోవ్‌స్కయా ల్యుబోవ్ స్కాటు, ప్రైవేట్. ఆమె తన స్మృతుల్ని యిలా పేర్కొంది: ''అవి యుద్ధపు తొలి రోజులు. నేనొక మిలిటరీ కమిస్సార్ ఎదుట నిలబడ్డాను. 'చిన్నమ్మాయిల్ని కూడా రిక్రూట్ చేసుకుంటామని నీకెవళ్లు చెప్పారు?' అంటాడాయన. ఓ ఏడాది గడిచింది. ఏటి పొడుగునా నేనెలా సాయంచెయ్యగలనా అని ఆలోచిస్తూనే వున్నాను. చేతులకు తొడుక్కునే ఓ జత మిట్టెన్లు తప్ప నేను యుద్ధ రంగానికి పంపగలిగినవి మరేమీ లేక పోయాయి. నేను నా ఫెల్టుబూట్లు సంతోషంగా పంపగలిగివుండేదాన్ని, కాని అవి మరీ చిన్న సైజువి. సైనిక రిజిస్ట్రేషన్, రిక్రూట్‌మెంటు కార్యాలయానికి నేను మళ్లీ వెళ్లాను...''

సైనిక జీవితం యీ అమ్మాయిలకి తేలిగ్గా రాలేదు. వాళ్లు పెద్ద సైజు తార్పాలిన్ బూట్లు, లేకపోతే పొడవాటి కాలిపట్టీలతోబాటు అమెరికన్ తయారీ బూట్లు (ఈ బూట్లని ''గొంగళి పురుగులు'' అంటూండేవాళ్లు), భారీ ఓవర్ కోట్లు వేసుకోవలసివచ్చేది. అమ్మాయిలు తమ జడలను కత్తిరించేసుకోవలసివచ్చేది (అమ్మాయిలందరూ దీన్నొక నష్టంగానే కాక పెద్ద నష్టంగా వర్ణించి చెప్పేవాళ్లు. వాళ్లకి సంబంధించినంతవరకు యిది తమ కౌమార గతానికీ, సైనిక వర్తమానానికీ మధ్య ఒక విభజన రేఖ). వాళ్లు యూనిఫార్మ్‌కి అలవాటు పడాలి. సైనిక హోదా గుర్తులు తెలుసుకోవాలి, గురిచూసి కాల్చగలగాలి, బోర్లా పడుకుని పాకాలి, కాలి పట్టీలు చుట్టుకోవాలి, రోజుల తరబడి నిద్రకాయాలి, చటుక్కున

గ్యాస్ మాస్కులు తగిలించుకోవాలి, కందకాలు తవ్వాలి... వాళ్ళు సైన్యంలో చేరడానికి దరఖాస్తులు పెట్టినప్పుడు యుద్ధ రంగంలో రోజువారీ జీవితానికి సంబంధించిన యీ పార్శ్వం ఒకటి వుంటుందని వాళ్ళు ఊహించనైనా లేదు...

వాళ్ళు తమ యౌవనాన్ని, తమ స్వేచ్ఛా జీవితాన్ని వెనక దిగవిడిచేశారు. సైన్యంలో చేరాక, సైనిక క్రమశిక్షణని లెక్కచెయ్యకుండా తరచు చిన్న పిల్లల్లా వ్యవహరించారు.

మాస్కోకి చెందిన బోందరెవా అంతొనీనా అప్పట్లో పైలట్, గార్డ్సు లెఫ్టినెంట్. ఆమె యిలా రాసింది:

''మేము మీలాగే చిన్న అమ్మాయిలం, మేమేదో భిన్నమైన వాళ్ళమని మీరు అనుకోకూడదు. క్రమశిక్షణ, నిబంధనలు, సైనిక హోదా గుర్తులు యీ మిలిటరీ పరిజ్ఞానం మాకు తేలిగ్గా రాలేదు. ఒరోజున మేము విమానాలను కావలి కాసే డ్యూటీలో వున్నాం. నిబంధనల్లో ఒకటి విమానాల దగ్గరకు వస్తున్న ఏ వ్యక్తినైనా సరే ఆపి, 'ఆగు, ఎవరక్కడ?' అని నిలదియ్యాలి. నా స్నేహితురాలు రెజిమెంటు కమాండరు సమీపించడం చూసి, 'ఆగండి! ఎవరక్కడ? క్షమించండి, కాలుస్తాను!' అని అరిచింది. 'క్షమించండి, కాలుస్తాను!' అని ఆమె అరవడాన్ని ఊహించుకోండి ఎంత సొడిబ్బెంగా వుందో.

మాస్కోకి చెందిన మరో పైలట్, కెప్టెన్ తేరెహొవా క్లావ్‌దియా కథనం యిది:

''అమ్మాయిలు సైనిక స్కూలుకి వచ్చారు. వాళ్ళలో ప్రతి ఒక్కరి కేశాలంకరణా భిన్నంగా వుంది. నేను నా జడల్ని నా తల చుట్టూ చుట్టుకున్నాను. కాని మా జుట్టును రుద్దుకోవడం యెక్కడ, సరిగా ఆరబెట్టుకోవడం యెలా? మేము జుట్టు రుద్దుకోవడం పూర్తిచేశామో లేదో యీలోగా అలారం మోగడం తరుచు తటస్థిస్తూ వుండేది, దానితో మేము పరుగెత్తాల్సివచ్చేది. మా కమాండరు రస్కోవా మరీనా మమ్మల్నందర్నీ జుట్లు కత్తిరించుకోమని ఆజ్ఞాపించింది. అమ్మాయిలు అలా కత్తిరించుకున్నప్పుడు ఒకటే యేడ్పు. దరిమిలా ప్రసిద్ధురాలైన ఆనాటి పైలట్ లిత్‌వ్యాక్ లీల్యా ఒక్కతె మాత్రమే తన జుట్టును కత్తిరించుకోలేదు.

''నేను రస్కోవా దగ్గరకి వెళ్లి, యిలా రిపోర్టు చేశాను: 'కామ్రేడ్ కమాండర్, మీ ఆజ్ఞ పాలింపబడింది, ఒక్క లిత్‌వ్యాక్ మాత్రం ఆజ్ఞని పాటించేందుకు నిరాకరించింది.''

''స్త్రీగా ఎంత నెమ్మదస్తురాలైనా, రస్కోవా మరీనా కమాండరుగా చాలా కచ్చితంగా వుండగలదు. ఆమె యిలా చెప్పి, నన్ను వెనక్కి పంపింది:

'''ఆజ్ఞ పాలింపబడేలా చెయ్యలేకపోతే నువ్వెలాంటి పార్టీ ఆర్గనైజరువి? ఎబౌట్ టర్న్, మార్చ్!..'

"మా డ్రెస్సులు, హైహీల్ షూలు... వీటన్నింటినీ సంచుల్లో కుక్కినప్పుడు మాకెంత విచారం కలిగిందో. పగటి పూట మేము బూట్లు వేసుకునేవాళ్లం, కాని రాత్రి పూట ఒక్కోసారి అద్దం ముందు నాలుగడుగులు నడిచి చూసుకునేందుకు షూలు వేసుకునేవాళ్లం. రస్కోవా యీ తంతుచూసి, కొద్ది రోజులు పోయాక, స్త్రీల దుస్తులన్నింటినీ పార్శెల్‌చేసి యిళ్లకి పంపెయ్యాలని ఆజ్ఞ జారీచేసింది.

"కానైతే శాంతి కాలంలో విమానాన్ని నడిపేందుకు యివ్వబడే రెండేళ్ల వ్యవధికి బదులు ఆర్నెల్ల వ్యవధిలోనే మేమొక కొత్త విమానాన్ని నడపడం నేర్చుకున్నాం. ఇలా చెయ్యగలగాలంటే అమ్మాయిల దృష్టి మరి దేనిమీదకీ మరలకూడదు. అమ్మాయిలు తమని తాము సైనికులుగా భావించుకోవాలి. ఇది తేలికైనదని మీరు అనుకుంటున్నారేమో? మమ్మల్ని ట్రక్కుల్లో ఎక్కించి స్నాన గృహాలకి తీసుకెళ్లినప్పుడు షూలు వేసుకొని, రుమాళ్లు కట్టుకు నడిచే స్త్రీలు మా కంట పడుతూండే వాళ్లు. వాళ్లది భిన్నమైన, పాతకాలపు జీవితం. మా అమ్మాయిలు విచారంలో మునగడం నేను చూశాను..."

ఆర్నెల్ల, ఒక్కొక్క సందర్భంలో మూణ్ణెల్ల కోర్సులు పూర్తిచేసినమీదట అమ్మాయిలకి నర్సు శిక్షణ సర్టిఫికెట్లు యివ్వబడేవి. లేక స్నైపర్ల, పైలట్ల, లేక శాపర్ల శీఘ్ర శిక్షణ తరగతులు పూర్తిచేసుకొని పట్టాలు తీసుకోగానే వాళ్లు స్నైపర్లుగా, పైలట్లుగా, లేక శాపర్లుగా రిక్రూట్ చేసుకోబడేవాళ్లు. వాళ్లకి మిలిటరీ సర్టిఫికెట్లయితే ఉండేవి గాని, వాళ్లింకా సైనికులు కారు. ఇదంతా వాళ్లకింకా పరిచితమైన స్కూలు తరగతుల వంటిదే, కాని యుద్ధం లేక యుద్ధ రంగం కాదు. యుద్ధం, యుద్ధ రంగాలను గురించి వాళ్లకి వున్నవి అవాస్తవికమూ, తరచుగా శుద్ధ కాల్పనికమూ అయిన అభిప్రాయాలు మాత్రమే.

షెవల్దీషెవా వేరా, అప్పట్లో సర్జను, సీనియర్ లెఫ్టినెంటు. తన స్వీయ కథని ఆమె యిలా చెప్పింది:

"ఆకురాలు కాలంలో సైనిక రిజిస్ట్రేషన్, రిక్రూట్‌మెంటు కార్యాలయం నుంచి నాకు పిలుపు వచ్చింది. అక్కడొక కల్నల్ నన్ను 'నువ్వు ఎగరగలవా?' అని ప్రశ్నించాడు. నాకు భయమని ఒప్పేసుకున్నాను. మేము చాలా సేపు సంభాషించుకున్నాం. పేరచూట్ దళాల్లో చేరేందుకు నన్ను ఒప్పించాలని ఆయన ప్రయత్నించాడు — అందమైన యూనిఫార్మ్, ప్రతి రోజూ చాక్లెట్లు... కాని నాకు ఎత్తంటే చిన్నప్పట్నుంచీ భయం. తర్వాత ఆయన 'పోనీ, మిమ్మల్ని గెరిల్లా దళంలోకి పంపితే ఎలా వుంటుంది?' అంటూ సూచన చేశాడు. 'మరి నేను మాస్కోలో వున్న మా అమ్మకి ఉత్తరాలు రాయడం ఎలా?' అని ప్రశ్నించాను. తర్వాత ఆయన నా పత్రాల మీద 'స్టెప్ యుద్ధ రంగం' అని రాశాడు.

''నేను రైల్లో ప్రయాణం చేస్తున్నప్పుడు ఒక యువ కెప్టెన్ నేనంటే ప్రేమలో పడ్డాడు. అతను రాత్రంతా నా రైలు పెట్టెలో నిలబడే గడిపాడు. అతను అప్పటికే యుద్ధంలో కాకలుదీరాడు, చాల సార్లు గాయపడ్డాడు. అతను నావంక చాలసేపు తదేకంగా చూసి యిలా అన్నాడు: 'వేరొచ్కా, దయచేసి మీరు మొరటుగా తయారవకండి. ఇప్పుడున్నట్లే ఉండిపోండి. ఇప్పుడు మీరు ఎంతో సుకుమారంగా వున్నారు... నేను జీవితంలో చాలా చూశాను...'

2వ ఉక్రేనియన్ యుద్ధ రంగపు 4వ గార్డుల సైన్యాన్ని చేరుకునేసరికి నాకూ, నా స్నేహితురాలికీ ఒక నెలరోజులు పట్టింది. అయితేనేం చివరకి మేము దాన్ని చేరుకున్నాం. ఛీఫ్ సర్జన్ కొద్ది నిముషాలపాటు మమ్మల్ని చూసేందుకు బయటికొచ్చి, మమ్మల్ని వెనక్కి ఆపరేషన్ గదికి తీసుకెళ్లాడు. 'ఇదిగో యిదీ మీ ఆపరేషన్ టేబిలు' అని చెప్పాడు. పెద్దపెద్ద స్టుడిబేకర్ అంబ్యులెన్సులు ఒకదాని తర్వాత ఒకటి వచ్చాయి. నేలమీద, స్ట్రెచ్చర్లమీద క్షతగాత్రులు వున్నారు. 'ముందెవర్ని తీసుకోవాలి?' అన్నదొక్కటే మేము అడిగిన ప్రశ్న. 'నిశ్శబ్దంగా ఉన్న వాళ్లని' అని ఆయన జవాబిచ్చాడు. ఓ గంట తర్వాత నేను టేబిల్ దగ్గర ఆపరేషన్లు మొదలుపెట్టాను. అలా జరిగింది మా పని... రాత్రింబగళ్లు మేము ఆపరేషన్లు చేస్తూండేవాళ్లం. కాసేపు కునుకుతీసి, చటుక్కున కళ్లు తెరిచి, కళ్లు నులుముకొని, చేతులు సబ్బుతో, బ్రష్షుతో కడుక్కుని మళ్లీ ఆపరేషన్ టేబిల్ దగ్గరకి వెళ్లేవాళ్లం. తిండి తినేటందుకు కూడా ఓపిక లేలంత అలసిపోయేవాళ్లం.

''ర్మెర్కింక రైల్వే స్టేషన్ దగ్గర మేము భారీ విమాన బాంబు దాడిలో చిక్కుకునాం. రైలు ఆగిపోయింది. మేము నాలుగు పక్కలకీ చెల్లాచెదురయ్యాం. అంతకు ముందు రోజే అపెండిసైటిస్ ఆపరేషన్ చేయించుకున్న మా రాజకీయ శిక్షకుడు కూడా పరుగుతీశాడు. రాత్రంతా మేము అడవిలో దాక్కున్నాం. మా రైలు పూర్తిగా ధ్వంసమైపోయింది. తెల్లవారుతుందనగా నాజీ విమానాలు కిందుగా ఎగురుతూ అడవిని గాలించనారంభించాయి. దాక్కునేందుకు ఎక్కడా చోటులేదు — కుమ్మరి పురుగులా నేలదొలిచి లోపలకి దూరలేం కదా. నేను బర్చి చెట్టు పట్టుకుని దానికి ఆనుకొని స్థాణువులా నిలబడిపోయాను: 'ఓరి నాయనోయ్! నేను చచ్చిపోతానంటావా? నేనే కనుక బతికితే, ప్రపంచం మొత్తంలో నా అంత అదృష్టవంతురాలు ఉండదు!' అనుకున్నాను. దరిమిలా, నేనెలా బర్చి చెట్టును పట్టుకొని నిలబడ్డానో చెప్పినప్పుడల్లా అందరూ పగలబడి నవ్వుతూండేవాళ్లు. తెల్లటి బర్చి చెట్టును ఆనుకొని నిటారుగా నిలబడ్డ నేను గురికి మంచి ఎరని!

''విజయ దినోత్సవాన్ని నేను వియన్నాలో జరుపుకున్నాను. ఆ సందర్భంగా

మేము జూకి వెళ్లాం. మేము జూకి వెళ్లాలని ఎంతగానో కోరుకున్నాం. మేము కాన్సెం ట్రేషన్ కాంపులకి వెళ్లివుండవచ్చు, కాని మేమందుకు విముఖత చూపాము...''

యుద్ధ రంగంలో గడిపే కాలమంతట్లో మిక్కిలి కష్టమైనది తొట్టతొలి రోజులు, వారాలు, నెలలు. ఎందుకంటే, మనిషి ఆలోచనలు, అనుభూతులు అప్పటికింకా శాంతి కాలంలో మాదిరిగానే వుంటాయి. అతనింకా భయంకరమైనదాన్ని చూసి భయపడుతూ వుంటాడు, విపరీతమైనదాన్ని విపరీతమైనదిగానే చూస్తూ వుంటాడు. అలా పరీక్షకి గురైన వ్యక్తి మరెవరో కాక చిన్న అమ్మాయి, ఆమె యుద్ధానికి పూర్వం, యింకా చిన్న పిల్లగానే పరిగణించబడినందున తల్లిచేత గారాబం చెయ్యబడి, తల్లి చాటు పిల్లగా వుంది.

దుబ్ర్యకోవా సోఫీయా, అప్పట్లో మెడికల్ ఆర్డర్లీ. ఆమె జ్ఞాపకం చేసుకొని యిలా చెప్పింది: ''పొత్తికడుపులో, తలలో తగిలిన గాయాలు మిక్కిలి ప్రమాదకరమైనవని మాకు చెప్పారు. అందుకని బాంబుదాడులు జరిగినప్పుడు లేక కాల్పులు జరుగుతున్నప్పుడు మేము మా తలల్నీ, పొత్తికడుపుల్నీ కాపాడుకునేందుకు ప్రయత్నించేవాళ్లం. మేమొకసారి ధ్వంసంచెయ్యబడిన ఒక ట్రక్కులోని కుషన్ సీటు తీసుకుని దానితో మమ్మల్ని మేము కప్పుకునేవాళ్లం. మేము మా తలల్ని మోకాళ్ల సందున దాచుకునేవాళ్లం...

''నా మొట్టమొదటి క్షతగాత్రుడు నాకింకా గుర్తున్నాడు. అతని ముఖం నాకింకా స్పష్టంగా గుర్తుంది... అతని తుంటికి గాయం తగిలింది. గాయం తెరుచుకొనివుంది. దానిలోంచి ఒక ఎముక పొడుచుకొని బయటకి వచ్చింది. శాస్త్రీయంగా ఏం చెయ్యాలో నాకు తెలుసు. కానైతే, నేను అతని దగ్గరకి పాక్కుంటూ వెళ్లి ఆ దృశ్యం చూసే సరికి నాకు వాంతి వచ్చింది. అకస్మాత్తుగా నాకు 'సిస్టర్, కాసిని మంచినీళ్లు తాగు' అన్న క్షతగాత్రుడి మాటలు వినవచ్చాయి. అదంతా యిప్పుడే జరిగినట్లు ఆ దృశ్యం యిప్పటికీ నా కళ్లకు కట్టినట్లుంది. అతని మాటలు వినగానే, నేను స్పృహలోకి వచ్చాను. 'నీ ఎదుట ఒక క్షతగాత్రుడు చనిపోతూంటే, నువ్వు భావోద్వేగానికి లోనై, వాంతిచేసుకుంటున్నావా...' అనుకున్నాను. నేను ఫస్ట్ ఎయిడ్ ప్యాకెట్ విప్పి, గాయానికి కట్టాను. అప్పుడు నా మనస్సు కుదుటబడింది, తర్వాత నేనతనికి సక్రమంగా ఫస్ట్ ఎయిడ్ చెయ్యగలిగాను.

''యుద్ధం గురించిన సినిమాల్లో యుద్ధ రంగంలోని నర్సుల్ని చూస్తూ వుంటాం. వాటిలో ఆమె పాడింగ్ వున్న పంట్లాము కాక, మడత నలగని శుభ్రమైన స్కర్టు వేసుకొని, ఆకర్షణీయంగా కేశాలంకరణ చేసుకున్న తలమీద కాప్ ఓరగా పెట్టుకొని కనిపిస్తుంది. అది బొత్తిగా వాస్తవం కాదు. అలాంటి డ్రెస్సు

వేసుకుని క్షతగాత్రుణ్ణి మేము మోసుకు రాగలిగేవాళ్లమా? చుట్టూ పురుషులున్నప్పుడు స్కర్టులో పాకడం సాధ్యమా? వాస్తవానికి యుద్ధం చివరి రోజుల్లో మాత్రమే మా పూర్తి యూనిఫారంలో భాగంగా మాకు స్కర్టులిచ్చారు. అప్పుడే మాకు మగాళ్ల అండర్‌వేర్లకి బదులు ఆడవాళ్ల అండర్‌వేర్లు యిచ్చారు. అప్పుడు మా సంతోషానికి అవధి లేకపోయింది. మేము వాటిని ప్రదర్శించుకునేందుకు మా సైనిక షర్టుల గుండీలు తీసివుంచేవాళ్లం...''

మీన్స్క్‌కి చెందిన 48వ సైన్యపు వెటరన్, బెల్యాయ్ ఆన్నా యిలా చెప్పింది:

''బాంబు దాడి. ప్రతి ఒక్కరూ కనుమ దగ్గరకి పరుగెత్తుతున్నారు. నేనూ పరుగెత్తుతున్నాను. అంతలో అకస్మాత్తుగా ఎవరిదో 'సాయం! సాయం!' అన్న మూలుగు వినిపించింది. నేను పరిగెత్తుతూనే వున్నాను... కొద్ది నిముషాల తర్వాత నాకు స్పృహ వచ్చి, నా భుజంమీద వున్న ఫస్ట్ ఎయిడ్ సంచి తడుముకున్నాను... సిగ్గుపడ్డాను... నా భయం పోయి, మూలుగుతున్న సైనికుడి దగ్గరకి పరుగెత్తాను. అతని గాయానికి కట్టుకట్టడం మొదలెట్టాను. తర్వాత రెండో క్షతగాత్రుడి దగ్గరకి పరుగెత్తాను, ఆ తర్వాత మూడో క్షతగాత్రుడి దగ్గరకి...''

యుద్ధ ప్రాంతంలో మృత సైనికుల శవాలు చూసేందుకు బాగా అలవాటు పడిపోతారు. కాని ఆశ్విక దళానికి చెందిన మెడికల్ ఆర్డర్లీ కోర్జ్ ఓల్గా ఒక మృత సైనికుణ్ణి చూసి విపరీతంగా చలించిపోయింది. అప్పటికి ఆమె వయస్సు 17 ఏళ్లు. కాని యిప్పటికీ యింకా ఆమె ఆ దృశ్యాన్ని మరచిపోలేకపోయింది.

''నేను యుద్ధ రంగంలో వున్నప్పుడు, నేను అవేవీ ఎన్నడూ మరచిపోలేనని అనుకున్నాను, కానైతే మరచిపోతున్నా ననుకోండి... అయినా ఆ దృశ్యం మాత్రం అతి చిన్న వివరాలతో సహా నా మనస్సుమీద హత్తుకుపోయింది. అతనొక యువకుడు. మంచి అందగాడు. అతను చచ్చి పడివున్నాడు. అతను సైనిక లాంఛనాలతో సమాధిచెయ్యబడతాడు అనుకున్నాను. కాని అతన్నొక తోపులోకి యీడ్చుకుపోయారు, ఓ గుంత తీశారు. అతన్ని ఏ శవపేటికా యేమీ లేకుండా, గుంతలో దించి మట్టితోసి పూడ్చేశారు... అది వేసవి కాలం. సూర్యుడు ఉజ్వలంగా ప్రకాశిస్తున్నాడు, అందమైన ఆ యువకుడిమీద కూడా. ఎండ పడుతోంది. అతని ఒంటిమీద వాటర్‌ప్రూఫ్ ఆచ్ఛాదన లేదు. అతన్ని ఉన్నవాణ్ణి ఉన్నట్లు సైనిక దుస్తుల్లోనే పూడ్చిపెట్టారు. అతని దుస్తులింకా కొత్తవైనా మాయలేదు. అతను అప్పుడప్పుడే వచ్చాడు. మరి అతన్ని సమాధిలో దించి అలా పూడ్చివేశారు. ఆ గుంత అయినా అంత లోతు లేదు, కేవలం అతని శరీరం మునిగేటంత లోతు మాత్రమే వుంది. ఆ గాయం చిన్నదే గాని, మరణాంతకమైనది — గుండు దెబ్బ సరిగ్గా కణతమీద తగిలింది. రక్తస్రావం

కూడా ఏమంత లేదు. అందుకనే అతను యింకా సజీవంగానే వున్నట్లు పడివున్నాడు. బాగా పాలిపోయి వున్నాడంతే.

''ఫిరంగి కాల్పుల వెంటనే బాంబు దాడి జరిగింది. ఒక బాంబు ఫిరంగి గుళ్ళున్న పెట్టెకి తాకింది. గుళ్ళు పేలి, చెల్లాచెదరుగా నాలుగు పక్కలకీ ఎగి రాయి... మా తలలమీద విమానాలు గిరికీలు కొడుతున్నాయి. అలాంటి పరిస్థితిలో మేము మహా అయితే చెయ్యగలిగింది మృతుల్ని భూమిలో పూడ్చిపెట్టడమే. మేము ముట్టడిలో వున్నప్పుడు సైనికుల్ని మేమెలా సమాధిచేసేవాళ్ళమో తెలుసా? మేము దాక్కున్న చోట పక్కనే సమాధిచేసేవాళ్ళం. వట్టినే నేలలో పూడ్చేసే వాళ్ళం, అంతకు మించి మరేం లేదు. చిన్న దిబ్బలు మాత్రమే మిగిలాయి. నాజీలో, వాళ్ళ వాహనాలో మమ్మల్ని వెంటాడి తరిమితే ఆ మట్టి దిబ్బలు తొక్కివెయ్య బడేవి, నేలమట్టం చెయ్యబడేవి. వాటి ఐపూ, ఆనవాలూ మిగిలేది కాదు, వట్టి నున్నటి నేల మాత్రమే వుండేది. మృతులని మేము తరచుగా అడవిలో... ఓక్ చెట్ల కిందో, బర్చి చెట్ల కిందో పాతిపెట్టేవాళ్ళం...

''నేను యిప్పటికీ అడవుల్లోకి, ప్రత్యేకించి ముదురు ఓక్ చెట్లూ, బర్చి చెట్లూ వున్న అడవుల్లోకి పోలేను. నేనక్కడ నేలమీద కూర్చోలేను...''

స్త్రీ వెటరన్ల మనసుల్లో యీ దారుణ స్మృతులు సజీవంగా నిలిచివుంటాయి. వాళ్ళు తమ కథల్ని ప్రశాంతంగా మొదలుపెడతారు, కాని కథనం చివరికొచ్చేసరికి వాళ్ళు ఉద్రిక్త స్వరాల్లో దాదాపు అరుస్తూ వుంటారు. తర్వాత వాళ్ళు కుంగిపోయి, గాభరాపడినట్లు కూర్చుండిపోతారు. నాకు తెలుసు, నేను వెళ్ళిపోయాక వాళ్ళు స్వస్థచిత్తులయ్యేందుకు ట్రాంక్విలైజరు మాత్రలు మింగుతారన్న సంగతి. నాకు వాళ్ళపట్ల జాలి కలుగుతుంది. వాళ్ళ కొడుకులూ, కూతుళ్ళూ ''ఇంక చాలదా? అవిన్ని ఉద్రేకపరచకండి...'' అంటూన్నట్లు సంజ్ఞలు చేస్తూ నా వంక అర్థిం పుగా చూస్తారు.

ఇందుకు నాకున్న సమర్థనీయతల్లా ఒక్కటే: టేపు ద్వారా, కాగితాల ద్వారా వాళ్ళ సజీవ స్వరాలు పదిలపరచబడతాయి. ఇవి శాశ్వతమైనవి కాకపోయినప్పటికీ, అత్యుత్తమ మానవ ధారణా శక్తికంటె అవి మరింత మన్నిక కలిగినవి. అయినా కూడా, ఆ స్త్రీల దగ్గర కూర్చొని, వాళ్ళ కథనాలు వినడం చాలా కష్టమైన పని.

బీటి ప్రాంతంలోని లెనిన్‌గ్రాడ్‌స్కీ అనే జనావాసానికి చెందిన స్మిర్నోవా (కుహార్ స్కయా) మరీనా అనే మెడికల్ ఆర్డర్లీ ఒక లేఖ రాసింది. ఆమె అంతర్జాతీయ రెడ్ క్రాస్ సంస్థ యిచ్చే అత్యంత గౌరవభాజనమైన ఫ్లోరెన్స్ నైటింగేల్ స్వర్ణ పతక గ్రహీత. ఆ లేఖలో కొంత భాగం వినండి:

''నేను నా మొదటి క్షతగాత్రుణ్ణి చూడగానే మూర్ఛపోయాను. తర్వాత

భయం పోయింది. మొదటిసారి ఫిరంగి గుళ్ల వర్షానికి ఎదురుగా క్షతగాత్రుడైన ఒక సైనికుడికి సాయంచేసేందుకు వెళ్లినప్పుడు నేను బిగ్గరగా ఏడ్చాను. నా ఏడ్పు యుద్ధపు హోరుకంటె బిగ్గరగా ఉన్నట్లనిపించింది. తర్వాత దానికీ అలవాటుపడ్డాను...

"1942 డిసెంబరు 25న, 56వ సైన్యానికి చెందిన 333వ డివిజన్ స్టాలిన్‌గ్రాడ్ సమీపంలోని ఒక దిబ్బ స్థలాన్ని పట్టుకుంది. నాజీలు ఎలాగైనాసరే దాన్ని తిరిగి ఆక్రమించుకు తీరాలని నిర్ణయించుకున్నారు. జర్మన్ టాంకులు దాడి ప్రారంభించాయి, కాని మన ఫిరంగి దళం ఆ దాడిని నిలవరించింది. నాజీలు తిరుగుముఖం పట్టారు. ఫిరంగి దళానికి చెందిన లెఫ్టినెంట్ హూదొవ్ కోస్త్య గాయపడి, తటస్థ ప్రాంతంలో పడివున్నాడు. అతన్ని మా శ్రేణుల్లోకి లాక్కురావాలని ప్రయత్నించిన మెడికల్ ఆర్డర్లీలు చంపబడ్డారు. వైద్య దళానికి చెందిన రెండు కుక్కలు కూడా అలాగే చంపబడ్డాయి. కుక్కలు అలాంటి పనులు చేయడం నేను మొదటి సారిగా అప్పుడే చూశాను. ఇప్పుడింక నా వంతు అనుకున్నాను — నా చెవుల టోపీ తీసేశాను, నిటారుగా నిలబడి, పాడటం మొదలుపెట్టాను, ముందు మెల్లగా, తర్వాత బిగ్గరగా, మరింత బిగ్గరగా, మా అందరికీ అభిమాన పాత్రమైన 'నేను నీకు తుది వీడ్కోలిచ్చాను, సాహస కృత్యం చేసేందుకు' అనే పాట పాడనారంభించాను. ఉభయ పక్షాలూ — యిటు మనవాళ్లూ, అటు జర్మన్లూ — కాల్పులు ఆపేశారు. నేను కోస్త్య దగ్గరకి వెళ్లి, అతనిమీదకి ఒంగాను, స్లెడ్జి బండిమీద వేసుకుని, మా సైనిక శ్రేణి దగ్గరకి యీడ్చుకెళ్లాను. అలా లాక్కెడుతూంటే నా మనస్సులో తలమీద కాలిస్తే పరవాలేదు, వీపుమీద కాల్చకుండా వుంటే బాగుండును అన్న ఒకేఒక్క ఆలోచన మెదిలింది. కాని నేను మా శ్రేణిని చేరుకునేదాకా ఒక్కగానొక్క కాల్పు కూడా కాల్చబడలేదు.

"మా యూనిఫారాలెప్పుడూ రక్తపు మరకలతో నిండివుండేవి. దానితో మాకు సరిపడినన్ని శుభ్రమైన యూనిఫారాలు ఎప్పుడూ వుండేవి కావు. నేను కాపాడిన మొట్టమొదటి క్షతగాత్రుడు సీనియర్ లెఫ్టినెంట్ బెలోవ్, చిట్టచివరి క్షతగాత్రుడు ఫిరంగి దళ సార్జెంటు త్రొఫీమొవ్ సెర్గేయ్. 1970లో ఆయన నన్ను చూసేందుకు వచ్చాడు. అప్పుడు ఆయన తలమీది గాయాన్ని నేను మా అమ్మాయిలకి చూపించాను — ఇప్పటికీ అక్కడొక పెద్ద మచ్చ వుంది. మొత్తం 481 మంది క్షతగాత్రుల్ని నేను గుళ్లవర్షంలో మోసుకొచ్చాను. ఒక విలేకరి యేకంగా నేనొక పదాతి సైనికుల మొత్తం పటాలాన్నే మోసుకువచ్చానని అంచనా వేశాడు..."

యుద్ధ కాలంలో మానవ వినాశకర ఆయుధాలు నిర్దుష్టం చెయ్యబడ్డాయి. కాని మనుషుల్ని కాపాడే పద్ధతులు మాత్రం యథాతథంగా వుండిపోయాయి.

క్షతగాత్రుల్ని మోసుకురావడం లేక యీడ్చుకురావడమే ఆ పద్ధతి. కాల్బుల మధ్య యిలా క్షతగాత్రుల్ని మోసుకురావడం నేనెప్పుడూ చూడలేదు. కాని నేనొకసారి దిట్టంగా బలంగా వున్న మనుషులు రైల్వే ట్రక్కుల్లోంచి ధాన్యపు బస్తాలను అన్‌లోడ్‌చెయ్యడం చూశాను. 60 నుంచి 80 కిలోగ్రాముల బరువున్న బస్తాల్ని (మనిషి సగటు బరువు) వాళ్ళు మోస్తున్నారు. వాళ్ల చొక్కాలు చెమటతో తడిసి వోడుతున్నాయి. ఇది బండ పోలికే కావచ్చుగాని, మెడికల్ ఆర్డర్లీల అపరి చిత కృషిని అర్థంచేసుకునేందుకు యీ ఉపమానం తోడ్పడుతుందని నా ఉద్దేశం. ఫిరంగి కాల్పుల మాట అలా వదిలేసినా, క్షతగాత్రుడు నిశ్చలంగా ఉంటాడు గనుక, అసలు ఉన్నదానికంటె ఎక్కువ భారంగా వుంటాడని కూడా నా ఉద్దేశం.

ఎ. ఎమ్. స్రైల్కోవా, డాక్టర్ అసిస్టెంటు యిలా రాస్తోంది: "మేము యుద్ధ రంగంలో ఉన్నప్పుడు, మాకంటె వయస్సులో పెద్దవాళ్లకంటె మాకు ఎక్కువ కష్ట సహిష్ణుతా శక్తి వున్నట్లు మేము నిరూపించాం. ఈ అంశాన్ని వివ రించడమెలాగో నాకు తెలియడం లేదు. మా బరువుకి రెండు మూడు రెట్లున్న మనుషుల్ని మేము మోసేవాళ్లం. దానికితోడు, మేము వాళ్ల ఆయుధాలని కూడా మోసేవాళ్లం. వాళ్ల పెద్ద ఓవర్‌కోట్లు, బూట్లు యిందుకింకా కొసరు. 80 కిలోల బరువున్న సైనికుణ్ణి వీపుమీదకి ఎత్తుకొని మోసుకొచ్చేవాళ్లం. అతన్ని కింద పడేసి, వెంటనే 70–80 కిలోల బరువున్న మరో సైనికుణ్ణి మోసుకొచ్చేం దుకు వెళ్లేవాళ్లం. ఒక్కొక్క దాడి తరుణంలో మేమిలా అయిదారు సార్లు వెళ్లే వాళ్లం. మా సొంత బరువు 48 కిలోగ్రాములు – అంటే బాలే నర్తకి బరువన్న మాట. అంత బరువెలా మోశామో యిప్పుడు నా ఊహకి అందదు..."

దవీదొవా వేరా సరిగా యుద్ధం మొదలయ్యేందుకు ముందు మాస్కోలోని చరిత్ర, పురావస్తు శాస్త్ర ఇన్‌స్టిట్యూట్‌నుంచి పట్టా పుచ్చుకుంది. ఇంకా కచ్చి తంగా చెప్పాలంటే, 1941 జూలై 6న ఆ పట్టా ఆమె చేతికి వచ్చింది. ఆ వెంటనే ఆమె తనని యుద్ధ రంగానికి పంపమని దరఖాస్తు పెట్టుకుంది. ఆమెని ఒక విధ్వం సక బృందంతో శత్రువు వెనుకతట్టు ప్రాంతానికి పంపారు. గెరిల్లా బృందాల తోపాటు బైలోరష్యా అంతటా శత్రువుతో ఆమె పోరాటం సాగించింది. యుద్ధానం తరం ఆమె బైలోరష్యా కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ ఆధ్వర్యంలోని పార్టీ చరిత్ర ఇన్‌స్టిట్యూట్‌లో పనిచేసింది.

వేరా యిలా చెప్పింది: "చరిత్ర శాస్త్రజ్ఞురాలిగా నేను చాలాకాలంపాటు యుద్ధ సమస్యలను అధ్యయనంచేశాను. అత్యంత సహజంగానే, సోవియట్ స్త్రీలని యుద్ధంలో పాల్గొనేలా ప్రోత్సహించింది ఏమిటని నన్ను నేను ప్రశ్నించుకున్నాను. ఇది మన జాతీయ స్వభావమని అనుకుంటున్నాను. తన దేశమూ, తన ప్రజలూ

నాశనంచెయ్యబడుతూంటే సోవియట్ స్త్రీ చంటి బిడ్డలకి నీళ్లు పోస్తూనో లేక వంటచేస్తూనో గడపలేదు. మరో కారణం ఏమిటంటే, మన స్త్రీల విమోచనం, పురుషులతోబాటు స్త్రీలకి సమాన హక్కులు వుండటం. యుద్ధారంభం నాటికి యీ సమాన హక్కులు జీవితానుభవంలోకి వచ్చాయి.

''యుద్ధం మొదలైన రెండో రోజున మేము మా ఇన్‌స్టిట్యూట్‌నుంచి సైనిక రిజిస్ట్రేషన్, రిక్రూట్‌మెంటు కార్యాలయానికి పరుగెత్తాం. యుద్ధ రంగంలో ఉండటమంటే బొత్తిగా యేమీ తెలియకపోయినా, 'మమ్మల్ని యుద్ధ రంగానికి పంపండి' అని అర్థించాం. అయితే, 'పోయి, ముందు మీ పరీక్షలు పూర్తిచెయ్యండి' అని చెప్పి, మమ్మల్ని వెనక్కి పంపేశారనుకోండి.

''మేము మా పరీక్షలు పాసై, మమ్మల్ని యుద్ధ రంగానికి పంపమని మళ్లీ దరఖాస్తులు పెట్టాం. యుద్ధం స్త్రీల వ్యవహారం కాదనుకోండి, అయినా అమ్మాయిలు అభ్యర్థించారు... యుద్ధం మగాళ్ల వ్యవహారం. స్త్రీలకి ఎంతటి కష్ట సహిష్ణుతా శక్తి వున్నా, పురుషులకంటె ఎక్కువ వెసులుబాటుతనం చూపి, వివిధ పరిస్థితులకి తమని తాము వాళ్లు సరిపెట్టుకోగలిగినా, స్త్రీలు పోరాటానికి అల వాటుపడలేకపోయారు. స్త్రీ మాత. తన బిడ్డని కాపాడి పదిలంగా చూసుకొనే శక్తిని ప్రకృతి ఆమెకి సమకూర్చింది. అయినా కూడా, స్త్రీ యుద్ధానికి అలవాటు పడలేకపోయింది...

''1942లో మేము యుద్ధపు అగ్రశ్రేణిని దాటి, ఒక గోరీల దొడ్డిని చేరు కున్నాం. జర్మన్లు సుమారు ఐదు కిలోమీటర్ల దూరంలో వున్న సంగతి మాకు తెలుసు. అది రాత్రి పూట. జర్మన్లు దూరాన గల విశాల ప్రాంతంపై కాంతి ప్రస రిస్తూ చాలా సేపు మండే కాంతి ప్రక్షేపకాలు పైకి ప్రయోగిస్తున్నారు. ప్లెటూన్ కమాండరు నన్ను గోరీల దొడ్డి చివరకి తీసుకెళ్లి ఆ కాంతి ప్రక్షేపక రాకెట్లు ఎక్కణ్ణుంచి వస్తున్నాయో చూపించాడు. దానికితోడు జర్మన్లు ఏ పొదల మాటు నుంచి మా పైకి రావచ్చునో కూడా ఆయన చూపాడు. చనిపోయినవాళ్లని చూడట మంటే నాకు చిన్నప్పట్నుంచీ ఎప్పుడూ భయం లేదు. కాని అప్పుడు నా వయస్సు 22 ఏళ్లు. నేను కాపలా డ్యూటీలో నియమింపబడటం అదే మొదటి సారి. ఆ రెండు గంటల కాల వ్యవధిలో నా జుట్టు నెరిసిపోయింది. ఉదయానికల్లా నా జుట్టులో తెల్లటి పాయ కనిపించింది. నేనక్కడ నిలబడి, ఆ పొదలు సరసర చిరు శబ్దంచేస్తూ ఎలా కదిలాయో, అనుక్షణం వాటిలోంచి జర్మన్లు ముందుకొస్తున్నట్లు ఎలా ఊహిం చుకున్నానో నాకు యిప్పటికీ జ్ఞాపకం... ఒక గోరీల దొడ్డిలో కాపలా డ్యూటీలో నిలపబడటం స్త్రీ పనే నంటారా? భావావేశ విషయం తీసుకుంటే ప్రతిదాన్ని గురించీ మేము పురుషులకి భిన్నమైన స్థాయిలో ఆలోచిస్తాం. మగాళ్లు ప్రతిదాన్నీ

మరింత తేలిగ్గా తీసుకుంటారు. ఉదాహరణకి వాళ్లైతే, తాము కాపలా డ్యూటీలో నిలబడాలి, కాల్చాలన్న ఆలోచన స్వీకరించేందుకు సంసిద్ధులై వుంటారు... పోతే మేము, మా స్త్రీ జన స్వభావం మూలంగా, అలాంటి వాటినెప్పుడూ పరమ అసహజమైనవిగా తీసుకుంటాం. అందుకు అలవాటుపడేందుకు మేము ప్రయత్నించామనుకోండి, అయినా అది మాకు మరింత కష్టసాధ్యమే అయింది.

''పురుషులు, స్వభావ రీత్యానే, ఆయా విషయాలపట్ల భిన్న దృక్పథం కలిగి వుంటారు. నా స్నేహితురాలి కూతురు యిటీవల తన భర్తపట్ల తనకి కోపం కలిగినట్లు చెప్పింది. అందుకు కారణం ఏమిటో తెలుసాండి: 'ఇది మా పెళ్లి పదవ వార్షికోత్సవమన్న సంగతే అతనికి గుర్తులేదు. అతనికి నేనంటే యింక ప్రేమ లేదన్న మాట' అంది. అతను ఆ విషయానికి ప్రాముఖ్యమేమీ యివ్వలేదు, అంతమాత్రమే. అదెప్పుడో జరిగిపోయింది, గడిచిపోయింది. ఇప్పుడు ఆరోజు అతని దృష్టిలో సర్వసామాన్య విషయం... నేను చెప్పొచ్చేదేమిటంటే, పురుషుల భావావేశ స్థాయి వేరు. స్త్రీలు, యుద్ధం అన్న సమస్యని చర్చించేటప్పుడు యీ అంశాన్ని విధిగా దృష్టిలో పెట్టుకొని, స్త్రీల ఆలోచనా ధోరణిని అర్థంచేసుకునేందుకు ప్రయత్నించాలి.

''కానైతే సున్నిత మనస్కులూ, అత్యంత భావోద్విగ్న ప్రాణులూ అయిన స్త్రీలు పురుషులకంటె బలవత్తరమైనవాళ్లుగా, ఎక్కువ కష్ట సహిష్ణుతా శక్తి కలవాళ్లుగా నిరూపించుకున్నారు. మేము 30–40 కిలోమీటర్లు నడిచేవాళ్లం... గుర్రాలు డస్సి పడిపోయేవి. మగాళ్లు పడిపోయేవాళ్లు, కాని స్త్రీలం మాత్రం పాటలు పాడుతూ నడుస్తూనే వుండేవాళ్లం. చిన్న అమ్మాయిలు యుద్ధ భూమినుంచి దిట్టమైన సైనికుల్ని మోసుకొచ్చేవాళ్లు. మరి క్షతగాత్రులు మామూలుకంటె చాలా ఎక్కువ బరువుంటారు. ఈరోజున యివన్నీ నమ్మశక్యం కాని విషయాలుగా కనిపిస్తాయి...''

ఏళ్లు గడిచాయి. చరిత్ర శాస్త్రజ్ఞురాలిగా, గత ఘటనల్లో ఒక భాగస్వామిగా గతంలోకి ఊహ సారించిన వేరాయే, తాము ఐచ్ఛికంగా యుద్ధంలోకి ఎలా వెళ్లాం, ఆ కష్టాలన్నీ ఎలా సహించాం, ఎలా పోరాడాం అని ఆశ్చర్యపడుతోంది. స్త్రీల ఆత్మత్యాగం అతి ముఖ్యమైనది – ఇదీ సారాంశం.

కొవెలేనొవా నీనా, అప్పట్లో పదాతి సైనిక కంపెనీ మెడికల్ ఆర్డర్లీ, సీనియర్ సార్జెంటు, తన స్మృతులను యిలా చెప్పింది:

''నన్ను యుద్ధ రంగానికి రిక్రూట్‌చేసుకొనేందుకు ససేమిరా ఒప్పుకోలేదు. అప్పటికి నేను మరీ చిన్నదాన్ని, నాకు కేవలం 16 ఏళ్లే, 17 ఏళ్లకి బాగా తక్కువ. కానైతే మా డాక్టరు అసిస్టెంటుకి రిక్రూట్‌మెంట్ పత్రం వచ్చింది. తన చిన్నారి కొడు

కుని వదిలి వెళ్లాల్సివస్తోందని ఆమె గొల్లున ఏడ్చింది. నేను రిక్రూట్‌మెంటు కార్యాలయానికి వెళ్లి ఆమె బదులు నన్ను పంపించమని కోరాను..."

కొవెలేనొవా యిలా చెప్పింది: "సైనికులు నేనంటే జాలిపడ్డారు. ఒకడొక రస్కు యిస్తే, మరొకడు నాకు పంచదార బిళ్ల యిచ్చేవాడు... మా వెనక మాటుగా ఒక 'కత్యూష'* వుందని నాకు తెలియదు... అది కాల్చడం మొదలెట్టేసరికి ఉరుములు గర్జించినట్లు భయంకరమైన శబ్దమైంది... ఎదుట ప్రతీదీ నిర్ధూమధామమైంది. ఆ కాల్పులూ, శబ్దమూ నన్నెంత దిగ్భ్రాంతురాలిని చేసి గాభరాపెట్టాయంటే, నేనొక నీళ్లగుంటలో పడి, నా సైడ్ కాప్ పోగొట్టుకున్నాను. సైనికులు బిళ్లపెట్టున నవ్వుతూ యిలా అరిచారు: 'ఏమిటి సంగతి నీనొచ్కా? ఏమిటి సంగతి బుల్లెమ్మా?'

"బాహాబాహీ పోరాటాలు జరిగే దాడుల గురించి... నాకేమైనా జ్ఞాపకం వుందా అంటారా? నేకేం, జ్ఞాపకం వుంది... ఓసారి అలాంటి పోరాటం మొదలైంది, మనుషుల ఎముకలు విరుగుతున్నట్లు కరకర శబ్దం వినిపించింది. దాడుల సమయంలో నేను సైనికులతోబాటే వెళ్లేదాన్ని. వాళ్లకి కొంచెం వెనకే గాని, బాగా దగ్గర్లో వెళ్లేదాన్ని, ప్రతీదీ నా కళ్ల ముందే జరుగుతూండేది...

"నేనొక ఏడాదికంటె తక్కువ యుద్ధంలో పాల్గొని, తర్వాత లీవుమీద తూలలోని మా యింటికి వెళ్లాను. నిద్రలో ఎప్పుడూ అరిచేదాన్ని. మా అమ్మా, చెల్లీ రాత్రి పూట నా పక్కనే కూర్చొని ఏడ్చేవాళ్లు..."

అలాంటి సందర్భాల్లో సాధ్యమైనంతవరకు అమ్మాయిలపట్ల జాలి చూపి, వాళ్లని కాపాడుతూండేవారు. కానైతే కొన్ని సందర్భాల్లో, పరిస్థితుల మూలంగా మానవ సంవేదనలు నమ్మశక్యం కాని విధంగా మారేవి. ఉదాహరణకి, క్రౌర్యం చాటున జాలి మరుగుపడేది. రబ్బాయెవా ఎకతెరీనా, అప్పట్లో మెడికల్ ఆర్డర్లీ, ప్రైవేట్, యీకింది సంఘటనని గుర్తుచేసుకొని చెప్పింది:

"నేను నా మొట్టమొదటి క్షతగాత్రుణ్ణి మోసుకొచ్చినప్పుడు, నా కాళ్లు దడదడలాడాయి. నేనతన్ని లాక్కొస్తూ, 'యితను చచ్చిపోకూడదు... యితను చచ్చిపోకూడదు... అని గొణక్కొంటూ నడిచాను. అతనికి కట్టుకట్టేనప్పుడు నేను ఏడ్చాను. అతనిపట్ల నిండు జాలితో నేను అతనితో మాట్లాడాను. అటు వెళ్తున్న మా కమాండరు నన్ను కేకలేశాడు. అతను మోటుగా యేదో అన్నాడు..."

"మిమ్మల్నెందుకు కేకలేశాడతను?" అని నేను ప్రశ్నించాను.

---

* కత్యూష — శరపరంపరగా మిస్సైల్స్‌ను కురిపించే శతఘ్ని. — సం.

''ఎందుకంటారా, నేనలా జాలి ప్రదర్శించడం లేక ఏడవడం తప్ప గనుక. ఓ మూల నేను కట్లు కట్టవలసిన క్షతగాత్రులింకా బోలెడుమంది ఉండగా, నేను ఏడిస్తే నా శక్తి సన్నగిల్లి వుండేది.''

సెర్గేయెవా నతాల్యా, అప్పట్లో మెడికల్ ఆర్డర్లీ, ప్రైవేట్, కథనంలో కూడా యీ విషయం స్ఫృశించబడింది:

''క్షతగాత్రులు నేరుగా యుద్ధ భూమినుంచి మాకు అప్పగించబడ్డారు. ఓసారి షెడ్డులో వందమంది గాయపడిన సైనికులు వున్నారు, నేను ఒకే ఒక్కదాన్ని వున్నాను... ఇది జరిగింది ఏ ఊరు దగ్గరో పేరు జ్ఞాపకం లేదు... ఇప్పటికి చాలా ఏళ్లు గడిచిపోయాయి కదా... నాకు నాలుగు రోజులు వరసగా నిద్ర లేదు సరికదా, కూర్చొనేందుకు సైతం వ్యవధి లేకపోయింది. 'సిస్టర్... సిస్టర్... కొంచెం సాయం చెయ్యవ్, బుల్లెమ్మా!' అంటూ ప్రతి ఒకడూ పిలుస్తూండేవాడు. నేను ఒక క్షత గాత్రుడి దగ్గర్నుంచి మరొకడి దగ్గరకి పరుగెత్తుతూ, అకస్మాత్తుగా తడబడి కిందపడి, వెంటనే నిద్రలో కూరుకుపోయాను. 'నిశ్శబ్దం! నిశ్శబ్దం! నేను ఆజ్ఞా పిస్తున్నాను!' అన్న కేకతో నాకు మెలకువ వచ్చింది. అలా అరిచిందొక కమాండరు, యువ లెఫ్టినెంటు. అతనూ క్షతగాత్రుడే. అతను గాయం తగలని పక్క కొం చెంగా లేచి అలా కేకేశాడు. నేను శక్తి ఉడిగిపోయేదాకా శ్రమ పడ్డానని అతను గ్రహిం చాడు... మరి అక్కడ ప్రతి ఒకడూ 'సిస్టర్, సిస్టర్, డియర్!' అంటూ అరుస్తున్నా డాయిరి. అకస్మాత్తుగా నేను చెంగున లేచి పరుగెత్తాను — ఎక్కడికో, ఎలాగో నాకైతే జ్ఞాపకం లేదు. యుద్ధ రంగానికి చేరాక నేను ఏడవడం అదే మొదటిసారి...''

## “మా అమ్మ దగ్గరికి నేనొకత్తెనే తిరిగి వచ్చాను...”

విష్నేవ్స్కయా నీనాని కలుసుకునేందుకు నేను మాస్కో ప్రయాణం సాగి స్తున్ననాటికి ఆవిడని గురించి నాకు తెలిసిందంతా నా నోట్ బుక్‌లో ఒక్క పేజిలో యిమిడివుంది: పదిహేడేళ్ల వయసులో ఆవిడ యుద్ధ రంగానికి వెళ్లింది. 5వ సైన్యపు 32వ టాంక్ బ్రిగేడ్‌లోని 1వ బెటాలియన్‌లో ఆమె మెడికల్ ఆర్డర్లీగా పని చేసింది. దానిలో వున్నప్పుడే ఆవిడ సుప్రసిద్ధమైన ప్రోహొరొవ్కా యుద్ధంలో పాల్గొంది. యుద్ధానంతరం ఆవిడ యువజన సంఘంలో పనిచేసింది. తమ నగ రాన్ని విముక్తంచేసిన 32వ టాంకు బ్రిగేడ్‌ని గురించి బోలెడు సమాచారం పోగు చేసిన బొరీసొవ్ యువ పయనీర్ సంస్థకి చెందిన పరిశోధకుల సహాయం ద్వారా

నేనామెను గురించి తెలుసుకున్నాను. పత్రికల్లో నా వ్యాసాలు కొన్ని వెలువడ్డాక నాకు లేఖలు, ముఖ్యంగా యువ పయనీర్లనుంచి, ప్రవాహ సదృశంగా రాసాగాయి. అదిగో అలా, అత్యంత యాదృచ్ఛికంగా నాకు స్వచ్ఛంద సహాయకుల్ని నేను సమకూర్చుకోగలిగాను.

దానితో నాకొక సమస్య ఉత్పన్నమైంది. డజన్ల కొద్దీ చిరునామాల్లో ఎలా ఎంచుకోవాలన్నదే ఆ సమస్య. మొదట్లో, నేను కలుసుకున్నవాళ్లందరి ఇంటర్వ్యూలూ రాసుకుంటూ వచ్చాను. తర్వాత వాటన్నింటినీ నేను ఉపయోగించుకోలేనన్న విషయం గ్రహించాను. దానితో సమాచారాన్ని ఎంపిక చేసుకోవడంలోనూ, సేకరించుకోవడంలోనూ మరో సూత్రాన్ని అనుసరించవలసిన అవసరం ఏర్పడింది. ఆ సూత్రాన్ని నామటుకు నేను యిలా రూపొందించుకున్నాను: యుద్ధంలో ఆయా స్త్రీలు ఏమేమి పనులు చేశారన్న దాన్నిబట్టి సమాచార సేకరణ చేస్తాను. ఎందుకంటే, మనలో ప్రతి ఒక్కరూ తను నిమగ్నమైవున్న కార్యకలాపాల దృష్ట్యా జీవితాన్ని పరిశీలిస్తారు. అంచేత, ఒక మెడికల్ ఆర్డర్లీ యుద్ధాన్ని ఒక దృక్కోణంనుంచి చూస్తే, ఒక వంటకత్తె మరో దృష్టితో, ఒక స్త్రీ కమాండో యింకో దృష్టితో, స్త్రీ పైలట్ వేరొక దృష్టితో, స్త్రీ సబ్‌మెషీన్‌గన్ ప్లెటూన్ కమాండరు యింకో దృష్టితో, యిలా ఒక్కొక్కరు ఒక్కొక్క దృష్టితో చూడటం ఎంతో సహజమైన విషయం... వారిలో ప్రతి ఒక్కరికీ యుద్ధం గురించి ఒక్కొక్క దృక్కోణం వుంటుంది: ఒకామె ఆపరేషన్ టేబిల్ గుండా చూసింది (''నేను కోసివేసిన ఎన్ని చేతులూ, కాళ్లూ చూశానంటే... ఎక్కడైనా యింకెవరైనా పూర్తి మగాళ్లంటూ ఉన్నారన్న నమ్మకం నాకు పోయింది. వాళ్లందరూ గాయపడ్డవాళ్లు గానో, చనిపోయినవాళ్లు గానో కనిపించారు...'' — ఎ. దేమ్చెంకొ, అప్పటి సార్జెంట్ మేజర్, మెడికల్ ఆర్డర్లీ); మరొకామె యుద్ధ రంగపు వంటశాలలోని తన డేగిశాలని చూసింది (''కొన్ని సార్లు యుద్ధం ముగిశాక ఎవరూ మిగిలేవాళ్లే కారు... నేనో డేగిశాలో జావ, మరో దాంట్లో సూపూ కాచేదాన్ని. కాని, ఎవరూ లేనిదే, నేనెవరికి వడ్డించాలి!..'' — ఐ. ఎన్. జీనినా, ప్రైవేట్, వంటకత్తె); మూడవ ఆమె విమానపు కాక్‌పిట్ గుండా చూసేది (''మా శిబిరం ఒక అడవిలో మకాం చేసింది. నేను నా విమాన దాడి పూర్తిచేసినమీదట అడవికి వెళ్లాలని నిశ్చయించుకున్నాను: అడవి స్ట్రాబెర్రీలు బాగా పండాయి. దోవలో అకస్మాత్తుగా నాకు చచ్చిపడివున్న ఒక జర్మన్ కనిపించాడు... మీకు తెలుసో లేదో, నేను చాలా భయపడ్డాను. నాకది యుద్ధ రంగంలో రెండో సంవత్సరమైనా, అప్పటిదాకా నేనెప్పుడూ చనిపోయిన వ్యక్తిని చూడలేదు. పైన ఆకాశంలో నంటూరా, అది మరో సంగతి... కింద అంతా తగులబడిపోతున్నట్లూ, కుప్పకూలిపోతున్నట్లూ కనిపించేది... ఎవరైనా పైన ఎగురుతు

న్నప్పుడు, లక్ష్యాన్ని చూసుకోవడం, దానిమీద బాంబులు వెయ్యడం, వెనక్కి ఎగిరి రావడం – యిదొక్కటే అతని మనస్సులో మెదిలే ఆలోచన. చచ్చిపోయినవాళ్లని చూసే అవకాశం మాకు వుండదు. ఆ మాదిరి భయంకరానుభవంతో మాకు పని లేదు...'' – ఎ. జి. బోందరెవా, అప్పటి గార్డ్స్ లెఫ్టినెంట్, సీనియర్ పైలట్). మరి గెరిల్లాలు యుద్ధాన్నెప్పుడూ చలిమంటలతో ముడిపెడుతూవుంటారు (''మేము ప్రతీదీ చలిమంటమీదే చేసేవాళ్లం – మా రొట్టె కాల్చుకునేవాళ్లం, వంటచేసుకునేవాళ్లం. బొగ్గులింకా ఆరిపోకుండా వుంటే, మా గొర్రె చర్మపు జాకెట్లనీ, ఫెల్టుబూట్లనీ, మా కింకే దుస్తులుంటే వాటినీ చలిమంట చుట్టూ ఆరేసుకునేవాళ్లం...'' – ఇ. ఎఫ్. విసోత్స్కయా).

టాంకు యూనిట్లలోని మెడికల్ ఆర్డర్లీలుగా సాధారణంగా మగాళ్లే వుండేవాళ్లు, కాని చూడండొహోయ్ అన్నట్లు వాళ్ల మధ్య యీ చిన్న పిల్ల ప్రత్యక్షమైంది! యుద్ధంలో ప్రతీదీ రిస్కుతో కూడుకున్నదే. కాని టాంకు కవచం పట్టుకు వేలాడుతూ, ఒక చేత్తో ఫస్ట్ ఎయిడ్ కిట్ పట్టుకొని, బొత్తిగా రక్షణ లేకుండా యుద్ధంలోకి వెళ్లడం – అది రిస్కు కాదు, పక్కనే పొంచివున్న ప్రమాదం.

విష్నేవ్స్కయా నీనా రాసిన ఉత్తరం అందగానే నేను వెంటనే ఆమెను కలుసుకునేందుకు బయల్దేరాను.

రైలుపెట్టెలో మేము ముగ్గురం వున్నాం. మేము టీ తాగుతూ, ఆచారం ప్రకారం సంభాషణలోకి దిగాం.

''మనం టీకంటె ఏవైనో పుచ్చుకోవలసింది. కాని అది నాకు నిషిద్ధం, చేసేదేముంది డాక్టర్ల ఆదేశం... శరీర శ్రమ మరీ తక్కువైందంటారు వాళ్లు. మానసిక ఒత్తిడి మరీ ఎక్కువట, శరీర శ్రమ తగినంత లేదట.''

''ఈ మధ్య గుండెపోటు కూడా వచ్చింది. నాకు పల్లెటూరిలో వేసవి కుటీరం ఉండటం చాలా మంచిదైంది. ప్రతి ఒక్కరూ తమ తమ ఆరోగ్యాల సంగతి చూసుకొంటూ వుంటారు. కొందరు జాగింగ్ చేస్తే, మరికొందరు డంబెల్సుతో కసరత్తు చేస్తారు, నేను పల్లె ప్రాంతంలో గడుపుతున్నాను...''

''నా కూతురు డాక్టరు.... న్యూరాలజిస్టు. ఇప్పుడు జనం నవ్వడం చాలా తక్కువైపోయిందనీ, సరదాగా గడపటం అరుదైపోయిందనీ అంటుందామె. ఇది మన ఆరోగ్యానికి హానికరమట. మనకది కావాలి...''

''మన కెవరికీ టైము సరిపోదు, ఎప్పుడూ ఎక్కడికో పరుగులు తీస్తూవుంటాం. యుద్ధం ముగిసేనాటికి మేమింకా యువకులం. అప్పటి పరిస్థితి వేరు. అప్పుడు మాకు యేమీ ఉండేది కాదు, టీ పెట్టేందుకు పంచదార కూడా ఉండేది

కాదు. అయినా సరే మేమంతా చాలా తరచుగా కలుసుకునేవాళ్లం. ఎంతో సరదాగా వుండేది. మేము పాటలు పాడుతూండేవాళ్లం... మరి యిప్పుడో యువకులు సైతం అరుదుగా కాని కలుసుకోరు...''

గుండె నీరసం గురించి చెప్పిన వ్యక్తి పేరు నికొలాయ్. రెండో ఆయన పేరు కొచెత్కోవ్. ఇద్దరూ యుద్ధంలో పాల్గొన్నారు. ఇద్దరి కోట్లమీదా మెడల్సు వున్నాయి.

''ఇప్పటి కుర్రకారు ఆనాటి కష్టాలు అర్థంచేసుకోరు...''

''అర్థంచేసుకోకపోవడమేమిటి, చేసుకుంటారు... వాళ్లని గురించి మనం ఫిర్యాదు చెయ్యకూడదు.''

''అబ్బే, అసలు వాళ్లకి అర్థంచేసుకోవాలని వుంటే కదా. మనం వాళ్ల జీవితాన్ని మరీ వడ్డించిన విస్తరిలా తయారుచేశాం. మనం బోలెడు కష్టాలు పడ్డాం. అందుకని వాటన్నింటినుంచీ వాళ్లని కాపాడేందుకు మనం శాయశక్తులా కృషిచేశాం. మన గురించి వాళ్లకేం తెలుసు? మనమెలా బతికామో వాళ్లకేం తెలుసు?..''

నాకు కూడా ఉద్దేశింపబడిన ప్రశ్న అది. అందుకని నేనెవరిని, ఎందుకు చూసేందుకు వెళ్తున్నానో చెప్పాను...

''అమ్మా, నేనో సంగతి చెప్తా వినండి' అన్నాడు నికొలాయ్. యుద్ధంలో ఆయన ఒక ఇంజనీరింగ్ బెటాలియన్ కమాండరు. ''సిబ్బంది విభాగంనుంచి ఓ మూర్ఖుడు నా దగ్గరకి ప్లెటూన్ కమాండర్లుగా యిద్దరు అమ్మాయిల్ని పంపినప్పుడు నేను వెంటనే వాళ్లని తిరిగి పొమ్మన్నాను. వాళ్లకి బాగా కష్టం తోచిందనుకోండి. ఇంజనీరింగ్ ప్లెటూన్ కమాండర్లుగా యుద్ధ భూమికి వెళ్లి, మందు పాతర్లను తొలగించాలని కోరుకున్నారు వాళ్లు.''

''మీరు వాళ్లనెందుకు వెనక్కి పంపేశారు?'' అని నేనడిగాను.

''అందుకు కొన్ని కారణాలున్నాయి. మొదటిది, ఆ అమ్మాయిలు చెయ్యాలనుకున్న పనులు చెయ్యగల ఫస్ట్ క్లాస్ మగ సార్జెంట్లు నాకు వున్నారు. రెండవది, నాకా అమ్మాయిలు బాగా తెలుసు. వాస్తుశిల్ప కళాశాలలో వాళ్లు నా క్లాస్‌మేట్లు. స్త్రీలు యుద్ధ భూమికి వెళ్లడం అనవసరమని నేను అనుకున్నాను. అందుకు తగినంత మందిమి మగాళ్లం వున్నాం. అంతేకాక, పనులతో తలమునకలుగా వున్నవాళ్లకి వాళ్లు వుంటే మరిన్ని బాదరబందీలు తోడయ్యేవని కూడా నాకు తెలుసు. వాళ్ల కోసం ప్రత్యేకమైన ఒక గూడు ఏర్పాటుచెయ్యాల్సివచ్చేది. దానికితోడు, వాళ్లు అమ్మాయిలు కనుక, కమాండర్లుగా వాళ్లకి బోలెడు సమస్యలు తలెత్తివుండేవి.''

''అయితే మీ ఉద్దేశం, యుద్ధ రంగంలో అమ్మాయిలు వుండటం అనవసరమైన చిక్కులు కలిగిస్తుందంటారు, అంతేనా?''

''అబ్బే, నేను చెప్పింది అది కాదు. మనం గత చరిత్రని జ్ఞాపకంచేసుకుంటే,

ఆయా సమయాలన్నింట్లో రష్యన్ స్త్రీలు తమ భర్తల్నీ, కొడుకుల్నీ యుద్ధ భూమికి పంపినట్లూ, వాళ్ళకోసం విచారంగా నిరీక్షించినట్లూ, అయితే ఆపత్సమయాల్లో తమ పురుషుల సరసన నిలిచినట్లూ కూడా చూస్తాం. కాని మా మగాళ్లకి అమ్మాయిలు పోరాడవలసిరావడంపట్ల నేరంచేసిన భావం కలిగేది. ఆ భావం నన్నిప్పటికీ వదల్లేదు. మీకో సంఘటన చెప్తాను... మేము తిరోగమిస్తున్నాం. అది ఆకురాలు కాలం, రోజంతా వర్షం పడుతోంది. రోడ్డువార చచ్చి పడివున్న ఒక అమ్మాయిని చూశాను... ఆమె ఒక మెడికల్ ఆర్డర్లీ... పొడవాటి జుట్టుతో అందమైన అమ్మాయి: ఆమె ఒళ్లంతా బురద కొట్టుకొని వుంది... మా మధ్య ఆ అమ్మాయి వుండటం, ఆ బీభత్సం, బురద, అస్తవ్యస్తాల మధ్య ఆమె చావు... ఇదంతా ఎంతో అసహజంగా వుంది. నేనెన్నో చావులు చూశాను, కాని అది మాత్రం నా మనస్సులో గాఢంగా నాటుకుపోయింది...

''అమ్మాయిలు యుద్ధానికి వెళ్లింది వాళ్లకి చంపడం యిష్టం వుండి కాదు. అది మన దేశానికీ, ప్రజలకీ క్లిష్టమైన కాలం. ప్రొఫెసర్లు ఎమర్జెన్సీ వలంటీరు దళాల్లో చేరేందుకు అనుమతిని అర్థించారు...'' నికొలాయ్ కలవరపాటుతో కొనసాగించాడు. ''అమ్మాయిలు యుద్ధ రంగానికి ఐచ్ఛికంగా వెళ్లారు. వాళ్లు అసాధారణ ధైర్యసాహసాలు కలిగిన అమ్మాయిలు. ఉదాహరణకి, యుద్ధ భూమినుంచి ఒక క్షతగాత్రుణ్ణి మోసుకురావడమంటే ఏమిటో మీకు తెలుసా? ఉండండి చెప్తాను... ఓ రోజున మేము దాడి చేశాం. శత్రువులు మమ్మల్ని మెషీన్ గన్ కాల్పులతో నేలకూల్చనారంభించారు. దానితో మా బెటాలియన్ కథ ముగిసింది... ప్రతి ఒకడూ నేలమీద పడివున్నాడు... ప్రతి ఒకడూ చచ్చిపోయాడని కాదు గాని, చాలామంది గాయపడ్డారు... జర్మన్లు మెషీన్‌గన్నులతో మామీద కాల్పులు జరుపుతూనే వున్నారు... అప్పుడు, అకస్మాత్తుగా, ముందొక అమ్మాయి, తర్వాత మరో అమ్మాయి, ఆ తర్వాత యింకో అమ్మాయి, యిలా కందకంలోంచి బయటకి దూకారు... క్షతగాత్రులకి కట్లు కట్టి యీడ్చుకు రావడం మొదలెట్టారు. జర్మన్లు సైతం విభ్రాంతులై కొంచెం సేపు కాల్పులు నిలిపేశారు. రాత్రి పదయ్యేసరికల్లా అమ్మాయిలందరూ తీవ్రంగా గాయపడ్డారు. వాళ్లల్లో ఒక్కొక్కరు అయిదారు మందికి తక్కువ కాకుండా కాపాడారు. వాళ్లకి పతకాలు చాలా మితంగా యిచ్చారు. యుద్ధారంభంలో మెడల్సూ, పతకాలూ అంత ధారాళంగా యిచ్చేవాళ్లు కారు. క్షతగాత్రుల్ని వాళ్ల ఆయుధాలతోబాటు యీడ్చుకురావలసివచ్చేది. 'ఇతని ఆయుధాలేవి?' అన్నదే ఫస్ట్ ఎయిడ్ విభాగంలో అడిగే మొట్టమొదటి ప్రశ్న. అప్పట్లో ఆయుధాలు కొరతగా వుండేవి. అంచేత క్షతగాత్రుడి రైఫిల్నో, సబ్ మెషీన్ గన్నునో లేక మెషీన్ గన్నునో కూడా అతనితోబాటు మోసుకురావలసి

వచ్చేది. 1941లో క్షతగాత్రులైన సైనికుల ప్రాణాలు కాపాడినందుకుగాను పతకాలు యిచ్చే విషయంలో ఒక ఆజ్ఞ జారీచెయ్యబడింది: తీవ్రంగా గాయపడిన పదిహేను మంది సైనికుల్ని వాళ్ల ఆయుధాలతోబాటు యుద్ధ భూమినుంచి మోసుకొచ్చినవారికి యుద్ధంలో ''విశిష్ట సేవ చేసినందుకు'' మెడల్ యివ్వబడేది. పాతిక మంది సైనికులను కాపాడితే ''అరుణ తార'' పతకం, నలభై మంది సైనికుల్ని కాపాడితే ''అరుణ పతాక'' పతకం, ఎనభై మందిని కాపాడితే లెనిన్ పతకం యివ్వబడేవి. కాని నేనిప్పుడే చెప్పాను కదా, యుద్ధంలో అయిదారుగుర్ని కాపాడటం అంటే ఏమిటో, ఎలా వుంటుందో...

''యుద్ధ రంగంలో ఉన్న అమ్మాయిల్లో చాలా మంది అందమైన వాళ్లు వుండేవారు'' అంటూ ఆయన కొనసాగించాడు. ''నా ఉద్దేశంలో వాళ్లు అద్భుతమైన అమ్మాయిలే అయినప్పటికీ మేము వాళ్లని స్త్రీలని లాగే చూసేవాళ్లం కాము. మేము వాళ్లని నేస్తురాండ్రలా చూసేవాళ్లం.''

''మీరు వాళ్లంటే యిష్టపడలేదా?''

''ఏమిటి మీరనేది? వాళ్లు మమ్మల్ని యుద్ధ భూమినుంచి మోసుకొచ్చిన మా నేస్తురాండ్రు. నేను గాయపడిన రెండు సందర్భాల్లో నన్ను మోసుకు తీసుకొచ్చి కాపాడారు. నేను వాళ్లంటే యిష్టపడకుండా ఎలా వుండగలను? కాని నీ సొంత చెల్లెల్ని నువ్వు పెళ్లి చేసుకోవు, ఔనా? వాళ్లు మా చెల్లెళ్లు...''

అదీ రైల్లో జరిగిన యాదృచ్ఛిక సంభాషణ.

...నేను మెట్రోనుంచి బయటకి వచ్చి, ఒక సాధారణమైన మాస్కో ఆవరణలో ప్రవేశించాను. ఏ కారణంగానో చెప్పలేను గాని, వేసవిలోకంటె శీతాకాలంలో గృహావరణల మధ్య పోలికలు తక్కువగా ఉన్నట్లు, అదృశ్య కళాకారుడెవడో ఒక్కొక్క దానిలో చేరి చెట్లన్నింటికీ, బెంచీలకీ, పిల్లల ఆట స్థలాలకీ, ఉయ్యాలలకీ తెల్ల పెయింటు వేశాడేమో అనిపిస్తుంది. అదృశ్య కళాకారులు సైతం విడివిడిగా పని చేస్తూ వుంటారు కనుక, ఆవరణలు భిన్నభిన్నంగా తయారవుతాయి. ఈ ఆవరణలో పనిచేసిన కళాకారుడు ఉయ్యాలల్ని ఓ పెద్ద పీపాలా, చెట్లని మంచు చేత కప్పబడిన గడ్డిమేట్లలా తయారుచేశాడు – అతను తొందర్లో వున్నాడో, లేకపోతే అతని చెయ్యి అతని ఆలోచనలనీ, మనోస్థితినీ అందుకోలేకపోయిందో తెలియదు.

నాకు సంబంధించినంతవరకు, నేను ఇంటర్వ్యూ చెయ్యబోయే వ్యక్తితో నా సమావేశం ఆమె యింట్లో ప్రవేశించేందుకు ముందే, నేను నా నోట్‌బుక్ తెరిచి, టేప్ రికార్డర్ ఆన్‌చేసేందుకు ముందే ప్రారంభమవుతుంది. నేను ఊహించుకున్న

ఆమె రూప చిత్రంమీద ఆమె గృహావరణా, ''మీరు నన్ను చూసేందుకు రావాలను కుంటున్నారా? వార్ వెటరన్ల కౌన్సిల్ కార్యాలయంలో నాకు సంబంధించిన వివ రాలు తీసుకుంటే మేలేమో? వాళ్ల దగ్గర నాకు సంబంధించిన వివరాలన్నీ ఉన్నాయి'' అంటూ ఫోనులో వినవచ్చిన ఆమె స్వరమూ ముద్రితమై వుంటాయి. నేను ఊహా చిత్రం గీసుకునేందుకూ, అంచనావేసుకునేందుకూ త్వరపడుతాను. ప్రతిసారీ అను భవం నా రొమాంటిక్ ఊహల్ని పరీక్షకి పెడుతూ వుంటుంది — ఎన్నడూ అది నన్ను వదలదు.

పొట్టిగా, బొద్దుగా వున్న ఒక స్త్రీ తలుపు తెరిచింది. ఆమె మగాళ్లలా చెయ్యి జాపి కరచాలనంచేసి నన్ను పలకరించింది. ఆమె చిన్నారి మనుమడు ఆమె రెండో చెయ్యి పట్టుకొని నిలబడ్డాడు. వాడి ప్రశాంత ధోరణినిబట్టి ఆ యింటికి అపరి చితులు రావడం అరుదు కాదన్న విషయం నాకు బోధపడింది.

విష్నేవ్స్కయా నీనా నన్ను తన గదిలోకి తీసుకెళ్లింది.

''మీ రాక గురించి మీరు నాకు కొంచెం ముందు తెలియజేస్తే నేను తయారఠ య్యేందుకు టైము ఉండేది...''

''బహుశా, అదే మంచిదేమోలెండి. మీ మనస్సులోకి అతి ముఖ్య స్మృతులే రావచ్చు...''

''నా దగ్గర కొన్ని పత్రికల కటింగులు వున్నాయి. మా 32వ టాంకు బ్రిగే డుని గురించి చాలా రాశారు. నేను మికా సమాచారం యిస్తాను...''

ఆ పెద్ద గది ఒక కార్యాలయంలా సువిశాలంగా వుంది. అనవసరమైన ఫర్ని చర్ యేమీ లేదు. అక్కడ పుస్తకాలు — అత్యధిక భాగం స్మృతులు — వున్నాయి. ఎన్లార్జి చేసిన యుద్ధకాలపు ఫొటోలు చాలా వున్నాయి. కణుజు కొమ్ముకి తగిలించ బడి టాంకు సైనికుడి హెల్మెట్ ఒకటి వుంది. మడిచేందుకు వీలైన, వార్నీషు పుయ్యబడిన ఒక చిన్న టేబిలుమీద ''ఫలానా యూనిట్ సైనికులనుంచి,'' ''టాంకు పాఠశాల విద్యార్థులనుంచి'' వగైరా అంకిత వాక్యాలు కలిగిన చిన్నచిన్న నమూనా టాంకులు వున్నాయి... సైనిక యూనిఫారాల్లో వున్న మూడు ఆట బొమ్మలు నా దగ్గర వున్న సోఫాలో ''కూర్చొనివున్నాయి.'' ఆ గదిలో కర్టెన్లూ, వాల్‌పేపరూ సైతం ఖాకీ రంగులో వున్నాయి.

''నా యిరుగు పొరుగువాళ్లు 'నీ యింటిని నువ్వెందుకు మ్యూజియంలా తయారుచేశావ్?' అని సాశ్చర్యంగా ప్రశ్నిస్తూవుంటారు. కాని నేను అవన్నీ లేనిదే బతకలేనంతే'' అని చెప్పింది విష్నేవ్స్కయా నీనా.

ఆమె తన మనుమణ్ణి పక్క గదిలోకి పంపింది. నేను నా టేప్ రికార్డర్ని ఆన్‌చేశాను.

విష్నేవ్స్కయా నీనా, అప్పట్లో టాంకు బెటాలియన్ సార్జెంట్ మేజర్, మెడికల్ ఆర్డర్లీ, యిలా చెప్పింది:

‘‘టాంకు దళాల్లోకి అమ్మాయిల్ని చేర్చుకునేందుకు వాళ్లు యిష్టపడలేదు. వాళ్లు అసలు తీసుకోనే లేదని చెప్పవచ్చు. మరి నేనందులోకి ఎలా చేరాను? మేము కలీనిన్ ప్రాంతంలోని కొనకోవా పట్నంలో వుండేవాళ్లం. నేను అప్పుడే ఎనిమిదో క్లాసు పరీక్ష పాసై, తొమ్మిదో క్లాసుకి ప్రమోట్‌చెయ్యబడ్డాను. మాకు అప్పట్లో యుద్ధమంటే యేమిటో, యెలా వుంటుందో తెలియదు. కాని యుద్ధం ఎలా వుం టుందో తెలుసుకోవాలనీ, స్వయంగా చూడాలనీ మేము తహతహలాడాం...

‘‘మా యింటిలో యితర కుటుంబాలు చాలా వుండేవి: రోజురోజుకీ ఎక్కువ మంది మగాళ్లు — పేత్య బాబాయ్, వాస్య బాబాయ్ యుద్ధ రంగానికి వెళ్తూండే వాళ్లు... మా పిల్లలం వాళ్లకి వీడ్కోలు యిస్తూండేవాళ్లం. దానితో యుద్ధం పట్ల మా ఉత్కంఠ మరింత పెరిగింది. మేము వాళ్లని రైలు బండిదాకా సాగనంపే వాళ్లం. బాండు మోగగానే ఆడాళ్లు గొల్లున ఏడ్చేసేవాళ్లు. అయితే అప్పుడు కూడా మాకు భయం కలిగేది కాదు. రైలెక్కెయ్యడం, వెళ్లిపోవడం, యిదే మా మిక్కిలి పెద్ద కోరిక. యుద్ధం ఎక్కడో దూరాన జరుగుతోందని మాకు అనిపిం చేది. ఉదాహరణకి, వాళ్లు తమ మిలిటరీ యూనిఫారాలకి కుట్టుకున్న మిలమిల మెరుస్తూండే గుండీలంటే నాకు చాలా యిష్టంగా వుండేది. అప్పటికే నేను నర్సు శిక్షణ పొందుతున్నాను. కాని అదేదీ నిజమైనదని అనిపించేది కాదు...

‘‘తర్వాత మా స్కూలు మూతపడింది. రక్షణ నిర్మాణాల పనికోసం మమ్మల్ని సమీకరించారు. ఒక పొలం మధ్య వున్న షెడ్లలో మా మకాం. యుద్ధానికి సంబం ధించిన ఏదో ఒక పనిలో నియమింపబడినందుకు మాకు చాలా గర్వంగా వుండేది. మమ్మల్ని ‘బలహీనుల’ దళంలోకి తీసుకున్నారు. మేము ఉదయం ఎనిమిదినుంచి రాత్రి ఎనిమిదిదాకా — రోజుకి పన్నెండు గంటలు — పనిచేస్తూండేవాళ్లం. మేము టాంకు నిరోధక కందకాలు తవ్వేవాళ్లం. మేమందరం పదిహేను, పదహారేళ్ల అమ్మా యిలం, అబ్బాయిలం... ఓ రోజున మేము తవ్వుతూంటే, ‘విమాన దాడి!’, ‘జర్మన్లు!’ అన్న అరుపులు వినవచ్చాయి. పెద్దవాళ్లు దాక్కునేందుకు పరుగెత్తారు. కాని మేము జర్మన్ విమానాలెలా వుంటాయో, జర్మన్లెలా వుంటారో చూద్దా మన్న కుతూహలంతో అక్కడే నిలబడిపోయాం. విమానాలు మా నెత్తిమీదుగా ఎగిరాయి కాని మేము వాటిని స్పష్టంగా చూడలేకపోయాం. మరి కొంత సేపట్లో అవి వెనక్కి వచ్చాయి. అయితే యీసారి అవి మరింత కిందుగా వచ్చాయి. మేము వాటిమీది నల్ల శిలువ గుర్తులు చూశాం. మాలో కేవలం కుతూహలమే గాని, భయం ఏ కోశానా లేదు. అంతలో అకస్మాత్తుగా జర్మన్లు మరతుపాకులతో

మామీద కాల్పులు మొదలుపెట్టారు. వాళ్లు అలా కాలుస్తూనే వున్నారు. మా క్లాస్‌మేట్సూ, స్నేహితులూ, మాతో కలిసి పనిచేసిన అమ్మాయిలూ, అబ్బాయిలూ పడిపోవడం మేము చూశాం. మేము స్తంభించిపోయాం. ఏమి జరుగుతోందో మేము గ్రహించలేకపోయాం. మేం అక్కడే నిలబడి చూడసాగాం. అప్పటికే మా పెద్ద వాళ్లు మా దగ్గరకి పరుగెత్తుకు వచ్చి మమ్మల్ని నేలమీద పడదొయ్యడం మొదలెట్టారు. అయినా కూడా మాకు భయం కలగలేదు...

''త్వరలోనే నాజీ ఆక్రమణదారులు మా పట్టణానికి బాగా దగ్గర్లోకి వచ్చారు. వాళ్లు కేవలం సుమారు పది కిలోమీటర్ల దూరంలోకి వచ్చేశారు. అందుకని, యితర అమ్మాయిలతోబాటు నేను హడావిడిగా సైనిక రిజిస్ట్రేషన్, రిక్రూట్‌మెంట్ కార్యాలయానికి వెళ్లాను. మేము దేశ రక్షణకి తోడ్పడాలని కోరుకున్నాం. అయితే వాళ్లు మిక్కిలి బలవంతుల్నీ, బాగా రాటుదేలినవాళ్లనీ, అందునా పద్దెనిమిదేళ్లు నిండినవాళ్లనే తప్ప ఎవరినీ సైనిక కొలువులోకి తీసుకోలేదు. ఒక కెప్టెన్ టాంకు దళంలోకి అమ్మాయిల్ని ఎంపికచేస్తున్నాడు. నాకు పదిహేడేళ్లే వున్నాయనీ, తగినంత ఎత్తు లేననే కారణంతో అతను నా మాట వినిపించుకునేందుకే ఒప్పుకోలేదు.

''తన నిరాకరణకి కారణాన్ని అతను నాకిలా వివరించాడు: 'ఒక పదాతి సైనికుడు గాయపడితే అతను నేలమీద పడతాడు. నువ్వు అక్కడకి పాక్కుంటూ వెళ్లి, గాయానికి కట్టుకట్టి, అతన్ని రక్షణ స్థావరానికి లాక్కురావచ్చు. కాని టాంకు సైనికుడి విషయంలో యిందుకు పూర్తి భిన్నంగా వుంటుంది... అతను తన టాంకులో గాయపడితే, వెనక తలుపులోంచి లాక్కురావాలి. టాంకు సైనికులు ఎంత దిట్టంగా వుంటారో నీకు తెలుసా? నువ్వా పని చెయ్యలేవు. దీనికితోడు, నువ్వు టాంకు పైకి ఎక్కినప్పుడు శత్రువు నీమీద కాల్పులు జరుపుతాడు. తుపాకి గుళ్లూ ఫిరంగి పెంకులూ నీ చుట్టూ ఎగురుతూ వుంటాయి. టాంకు భగ్గున మండుతూవుంటే ఎలా వుంటుందో నీకు తెలుసా?'

'''నేను మిగతా కొమ్సొమోల్ సభ్యులకేమైనా తీసిపోయానా?' అని దాదాపు ఏడుస్తూ ప్రశ్నించాను.

'''నువ్వు తీసిపోలేదు, నిజమే. కాని నువ్వు పొట్టిగా వున్నావు...'

''కానైతే, నర్సు శిక్షణ తరగతుల్లో నా స్కూల్‌మేట్సుని రిక్రూట్‌చేసుకున్నారు. వాళ్లంతా పొడుగాటి, బలమైన అమ్మాయిలు. వాళ్లేమో యుద్ధ రంగానికి పోతూంటే నేను వెనక్కి వుండిపోవలసిరావడం నాకు బాధ కలిగించింది.

''నేను నా తల్లితండ్రులకి ఒక్క మాట కూడా చెప్పలేదు. కాని నేనా అమ్మాయిలకి వీడ్కోలు చెప్పేందుకు వెళ్లాను. వాళ్లు నామీద జాలిపడి, నన్ను లారీలో

టార్పాలిన్ కింద దాచారు. మేము టాపు లేని ఒకటిన్నర టన్నుల లారీలో వున్నాం. మేమందరం తలలకి రుమాళ్ళు కట్టుకొనివున్నాం: కొందరు నల్ల రుమాళ్లు, మరి కొందరు నీలం లేక ఎర్ర రుమాళ్లు కట్టుకున్నారు. కిసెల్యోవా షూరా తనతో ఒక గిటారు కూడా తీసుకొచ్చింది. మేమలా పోతూండగా మాకు కందకాలు కని పించాయి. సైనికులు మమ్మల్ని చూసి 'నటీమణులు వచ్చారు! నటీమణులు వచ్చారు!' అంటూ అరిచారు. మాకు కోపం కూడా వచ్చింది. మేమేమో యుద్ధంచేసేందుకు యుద్ధ రంగానికి వెళ్తే, వాళ్లేమో మమ్మల్ని వినోదం కలిగించేవాళ్లంగా చూస్తు న్నారు...

''మేము కేంద్ర కార్యాలయానికి వెళ్లాం. కెప్టెన్ మమ్మల్ని బారు తీరి నిలబడమని ఆజ్ఞాపించాడు. మేమందరం బారు తీరాం. నేనే చివర వున్నాను. మిగిలిన అమ్మాయిలందరి దగ్గరా ఎంతో సామాను వుంది. నాకు ఏ సామానూ లేదు. నేను యుద్ధ రంగానికి అనుకోకుండా బయల్దేరానేమో, నేను నాతో యేమీ తెచ్చు కోలేదు. 'నీకు పట్టుకునేందుకు కనీసం యిదైనా వుంటుంది' అంటూ షూరా తన గిటారు నాకు యిచ్చింది.

''బయటికొచ్చిన ఆ బెటాలియన్ ఛీఫ్ ఆఫ్ స్టాఫ్‌కి కెప్టెన్ యిలా రిపోర్టు యిచ్చాడు:

'' 'కామ్రేడ్ లెఫ్టినెంట్ కల్నల్, మీ దళంలో కొలువుచేసేందుకు పన్నెండు గురు అమ్మాయిలు వచ్చారు.'

''ఛీఫ్ ఆఫ్ స్టాఫ్ మా వైపు చూసి అన్నాడు:

'' 'పన్నెండుమంది కాదు — పదముగ్గురు!'

'' 'క్షమించండి, కామ్రేడ్ లెఫ్టినెంట్ కల్నల్, ఉన్నది పన్నెండుమందే.' పన్నెండుమందే ఉన్నారన్న విషయంలో అతనికి బొత్తిగా సందేహం లేదు. కాని అతను మా వేపు తిరిగి, మమ్మల్ని చూడగానే, నా దగ్గరకొచ్చి, 'నువ్వెందుకున్నావ్, యిక్కడ?' అని నిలదీశాడు.

'' 'నేను యుద్ధంచేసేందుకొచ్చాను, కామ్రేడ్ కెప్టెన్!'' అని బదులు చెప్పాను నేను.

'' 'సరే, యిలారా దగ్గరకి.'

'' 'నేనొక స్నేహితురాలితో వచ్చాను...'

'' 'నీ స్నేహితురాలితో డాన్సుకైతే వెళ్లొచ్చు. కాని యిక్కడ జరుగుతున్నది యుద్ధం... ఇలా రా.'

''నేను నా తల చుట్టూ మా అమ్మ పులోవర్ కప్పుకున్నాను. వాళ్ల దగ్గరకి అలాగే నడిచివెళ్లాను. నర్సు శిక్షణ స్కూలు సర్టిఫికెట్ తీసియిచ్చి, 'ఆఫీసర్

బాబాయిలూ, నేను బలమైనదాన్ని, నేను నర్సుగా పనిచేశాను. నేను రక్తదానం కూడా చేశాను... దయచేసి...'

"వాళ్ళ పత్రాలన్నీ చూశాక, లెఫ్టినెంట్ కల్నల్ 'ఏదైనా వాహనం దొరికీ దొరకగానే ఈ అమ్మాయిని యింటికి పంపించెయ్యండి!' అన్నాడు.

"అలాంటి వాహనం వచ్చేదాకా నన్ను తాత్కాలికంగా ఒక వైద్య బృందంలో చేర్చి, గాజుగుడ్డతో చిన్నచిన్న మెత్తలు చేసే పని అప్పగించారు. ఏదైనా కారు కేంద్ర కార్యాలయాన్ని సమీపించడం చూసినప్పుడల్లా నేను వెంటనే అడవిలోకి జారుకుని, ఆ కారు వెళ్ళిపోయేదాకా ఓ గంటో, రెండు గంటలో అక్కడే వుండి పోయేదాన్ని, తర్వాత నా స్థానానికి తిరిగి వేళ్ళేదాన్ని.

"ఈ దాగుడు మూతలు అలా మూడు రోజులపాటు – మా బెటాలియన్ యుద్ధంలోకి దిగేదాకా – కొనసాగింది. అదే 32వ టాంక్ బ్రిగేడ్‌కి చెందిన 1వ టాంక్ బెటాలియన్... అందరూ యుద్ధంలోకి పోతూ, క్షతగాత్రులకోసం కంద కాలు తవ్వేందుకుగాను నన్ను వెనక దిగవిడిచారు. అరగంట అయిందో లేదో మొదటి బృందం క్షతగాత్రులు రావడం మొదలైంది... అంతే కాదు, చనిపోయినవాళ్లని కూడా తీసుకురాసాగారు... ఆ పోరాటంలో మా అమ్మాయిల్లో కూడా ఒకతె నేల కొరిగింది. వాళ్ళు నా సంగతి మర్చేపోయారనుకోండి. వాళ్లప్పటికే అక్కడ నా ఉని కికి అలవాటుపడ్డారు. ఆ కమాండరు నన్ను గురించి ఆలోచించడం మానుకున్నాడు...

"ఇక తర్వాత నేనేం చెయ్యాలి? నేను సైనిక యూనిఫార్మ్ సంపాదించుకో వాలి. మా సామాన్లు వేసుకునేందుకు మా అందరికీ కిట్ బాగ్‌లు యిచ్చారు. ఆ బాగ్‌లు సరికొత్తవి. అందుకని నేనా బాగ్ పట్టీలు కోసేసి, కింది భాగపు కుట్లు విప్పేసి, తొడుక్కున్నాను. అది యూనిఫారం స్కర్టులా తయారైంది... మరీ చిరిగిపోని ట్యూనిక్ ఒకటి వెతుక్కుని వేసుకున్నాను. బెల్టుతో దాన్ని బిగిం చుకున్నాను. మిగతా అమ్మాయిలకి నా యూనిఫారం ప్రదర్శించాలనుకున్నాను. నేను నా 'ప్రదర్శన' ముగించానో లేదో యింతలో మా సార్జెంట్ మేజరు మా సొరంగంలోకి వచ్చాడు. ఆయన వెంటే మా యూనిట్ కమాండరు కూడా వచ్చాడు.

"'అటెన్షన్!'

"ముందుకొచ్చిన లెఫ్టినెంట్ కల్నల్‌ని ఉద్దేశించి, సార్జెంట్ మేజర్ యిలా అన్నాడు: 'కామ్రేడ్ లెఫ్టినెంట్ కల్నల్, మాట్లాడేందుకు అనుమతించండి. ఇక్కడి అమ్మాయిలు నా నెత్తిమీదకి ఒక సమస్య తెచ్చిపెట్టారు. సామాన్లు పెట్టు కునేందుకు నేను వాళ్లకి కిట్ బాగ్‌లు యిస్తే, వాళ్లే దాంట్లో దూరికూర్చున్నారు!'

"ఆ కమాండరు నన్ను గుర్తించి అన్నాడు:

'''ఓహో, నువ్వేనా తల్లీ, సత్తర కాయువా! సార్జెంట్ మేజర్, యీ అమ్మా యిలకి సైనిక దుస్తులియ్యండి!' అన్నాడు.

''నన్ను యింటికి పంపేసేందుకు కారు విషయం అందరూ మరచిపోయారు. మా అందరికీ సైనిక దుస్తులు యిచ్చారు. టాంకు సైనికులు దిట్టమైన కాన్వాసు పాంట్లు ధరించేవారు. మోకాలి భాగంలో గట్టిగా వుండేందుకోసం వాటికి దట్టింపు గుడ్డలు వున్నాయి. అలాంటిది మాకు ఓవరాల్సు యిచ్చారు. అవి ఒక మాదిరి కాటన్ ప్రింటు గుడ్డతో తయారైనవి. కాని అక్కడి నేల సగం మట్టిది, సగం కంకరది. చెల్లాచెదరుగా పడివున్న విడివిడి రాళ్లతో కూడినది. దానితో అతి త్వర లోనే మా ఓవరాల్సు పీలికలు, వాలికలయ్యాయి. ఎందుకంటారేమో, మేము టాంకుల్లో కూర్చునేవాళ్లం కాము, నేలమీద పాకేవాళ్లం. టాంకులు తరచు అంటు కొని మండిపోయేవి. టాంకు సైనికులు సజీవంగా మిగిలివుంటే వాళ్ల ఒళ్లంతా కాల్పు బొబ్బలతో నిండివుండేవి. మాకూ ఒళ్లు కాలేది. ఎందుకంటే, కాలుతున్న మనుషుల్ని పట్టుకుని, బయటకి లాగేందుకు మేము నేరుగా మంటల్లోకి దూకాల్సి వచ్చేది. టాంకు సైనికుణ్ణి, ముఖ్యంగా టర్రెట్ గన్నర్‌ని వెనక రంధ్రంనుంచి బయటకి లాగడం చాలా కష్టం.

''..అంతకు ముందు ఏ విధమైన శిక్షణా లేకుండా మేము యుద్ధ రంగం లోకి వచ్చాం. సైనిక హోదాల తారతమ్యాలు మాకు తెలియవు. అందుకని, సార్జెంట్ మేజర్ మాకు వాటిని గురించి వివరిస్తూ, మేమిప్పుడు అసలైన సైనికులం అయ్యా మనీ, మాకంటె పై హోదా కలిగిన ప్రతి ఒకరికీ మేము సెల్యూట్ చెయ్యాలనీ, మేము శుభ్రంగా వుండాలనీ, ఎప్పుడూ కిందినుంచి పైదాకా గుండీలు పెట్టుకొని వుండాలనీ చెప్పాడు.

''కాని మేము బాగా చిన్న పిల్లలమన్న సంగతి తెలిసిన సైనికులు మమ్మల్ని ఆటలు పట్టించాలని చూస్తూండేవాళ్లు. ఓ రోజున మా ఫస్ట్ ఎయిడ్ విభా గానికి టీ తీసుకొచ్చేందుకు నన్ను పంపారు. నేను వంటవాడి దగ్గరకి వెళ్లాను. అతను నావైపు చూసి 'నీకేం కావాలి?' అన్నాడు.

'''నేను టీకోసం వచ్చాను' అన్నాను.

'''టీ యింకా తయారుకాలేదు.'

'''ఎందుకని?'

'''వంటవాళ్లు పాత్రల్లో స్నానంచేస్తున్నారు. తొందర్లోనే స్నానం పూర్తి చేస్తారు. తర్వాత టీకి నీళ్లు కాస్తాం...'

''నేను అతను చెప్పిన మాట అక్షరాలా నమ్మి, ఖాళీ బకెట్లు పట్టుకొని, వెనక్కి తిరిగివెళ్లాను. దోవలో నాకు డాక్టరు ఎదురు పడ్డాడు.

'''ఎందుకు నువ్వు ఖాళీ బకెట్లతో వస్తున్నావు?'' అని ఆయన అడిగాడు.

'''వంటవాళ్లు పాత్రల్లో స్నానంచేస్తున్నార్ట. అందుకని టీ యింకా తయారు కాలేదట' అని జవాబిచ్చాను.

'''ఏ వంటవాళ్లు పాత్రల్లో స్నానంచేస్తున్నారు?' అంటూ డాక్టరు తల కొట్టుకొన్నాడు.

''ఆయన నన్ను వెనక్కి పంపి, ఆ వంటవాణ్ణి గట్టిగా కూకలేశాడు. ఆ దెబ్బతో వాళ్లు చకచకా నా బకెట్లు టీతో నింపారు.

''టీ తీసుకుని నేను తిరిగి వెళ్తూంటే, రాజకీయ శిక్షణ విభాగాధిపతీ, బ్రిగేడ్ కమాండరూ ఎదురుపడ్డారు. నాకు వెంటనే మేము సామాన్య సైనికులం. కనుక మేము ప్రతి ఒక్కరికీ సెల్యూట్ చెయ్యాలన్న మాట జ్ఞాపకం వచ్చింది. కాని చిక్కేమిటంటే, వాళ్లు యిద్దరున్నారు. వాళ్లిద్దరికీ నేను సెల్యూట్ చెయ్యడం ఎలా? వాళ్లు దగ్గరకి వస్తున్నారు. త్వరలోనే వాళ్లు దగ్గరకి వచ్చేశారు. నేను నా బకెట్లు కింద పెట్టి, రెండు చేతులూ పైకెత్తి టోపీకి తగిలేలా పెట్టి చెరొక చేత్తో చెరొకరికీ సెల్యూట్ చేశాను. వాళ్లు అంతదాకా నన్ను పట్టించుకోకుండా వెళ్తున్నవాళ్లల్లా చటుక్కున ఆగి, ఆశ్చర్యంగా 'ఇలా సెల్యూట్ చెయ్యాలని నీకెవరు నేర్పారు?' అని అడిగారు.

'''సార్జెంట్ మేజరు నేర్పాడు. మేము ప్రతి ఒక్కరికీ సెల్యూట్ చెయ్యాలని ఆయన చెప్పాడు. కాని జంటగా నడుస్తూ, మీరు యిద్దరున్నారు...' అన్నాను.

''సైన్యంలో మా చిన్న అమ్మాయిల పని ప్రతీదీ చిక్కులతో కూడివుండేది. హోదా గుర్తుల తారతమ్యాలు తెలుసుకోవడం చాలా కష్టంగా వుండేది. మేము సైన్యంలో చేరేనాటికి యీ గుర్తులింకా సమచతుర్భుజాలు, చతురస్రాలు, దీర్ఘ చతురస్రాలే. ఎవరి హోదా అయినా గుర్తించాలంటే తాతలు దిగిరావలసిందే! ఎవరో ఒకరు 'యీ పాకెట్ తీసుకెళ్లి కెప్టెన్‌కి ఇయ్యి' అంటూండేవారు. కాని నాకెలా తెలిసి చస్తుంది కెప్టెన్ ఎవరో. తరచు దోవలో అసలా 'కెప్టెన్' అన్న మాటనే మర్చిపోతూండేదాన్ని. నేను వెళ్లి యిలా అనేదాన్ని:

'''బాబాయ్, ఆ బాబాయ్ మీకిది యిమ్మన్నాడు...'

'''ఏ బాబాయ్?'

'''నీలం పంట్లాం, పచ్చ కోటు వేసుకున్నాడే, ఆయన...'

''మేము వాళ్లని యితను లెఫ్టినెంటు అనీ, అతను కెప్టెన్ అనీ కాక, వేరేలా, అంటే, అతను అందగాడా లేక సాదా మనిషా, రాగిజుట్టువాడా, పొడుగాటి వాడా... అంటూ గుర్తుపెట్టుకునేవాళ్లం. 'ఓ, ఆ పొడుగాటాయనా!' అంటూ గుర్తుచేసుకునేవాళ్లం.

''అయితే త్వరలోనే కాలిన ఓవరాల్సూ, కాలి బొబ్బలెక్కిన చేతులూ, ముఖాలూ చూశాక, అప్పుడు అర్థంచేసుకున్నాను యుద్ధమంటే యేమిటో. టాంకు సైనికులు తమ తగలబడుతున్న టాంకుల్లోంచి బయటకి దూకినప్పుడు వాళ్ళు నిలువెల్లా కాలుతూవుండేవాళ్ళు. దానికితోడు, తరచు వాళ్ళ కాళ్ళో, చేతులో విరుగుతూండేవి. వాళ్ళవి చాలా సీరియస్ కేసులు. వాళ్ళు పడుకొని, 'నేను చచ్చిపోతే మా అమ్మకో, లేక నా భార్యకో ఉత్తరం రాయేం' అంటూ బతిమాలుతూండేవాళ్ళు. మాకు అప్పటికే భయంకంటె భయానకమైన మరేదో అనుభవంలోకి వచ్చింది.

''కాళ్లకి గాయాలు తగిలి పడిపోయిన నన్ను టాంకు సైనికులు ఎత్తుకొని, కిరొవొగ్రాడ్ ప్రాంతంలోని ఝోల్తాయె గ్రామానికి తీసుకెళ్లినప్పుడు ఫస్ట్ ఎయిడ్ విభాగం ఉన్న ఇంటి యజమానురాలైన ముసలమ్మ 'అయ్యో పాపం, ఎంచక్కటి అబ్బాయో, ఎంత లేత కుర్రాడో!..' అంటూ శోకన్నాలు పెట్టింది.

''టాంకు సైనికులు నవ్వారు:

'''మామ్మా, అబ్బాయి కాదు, అమ్మాయి!'

''ఆమె నా పక్కన కూర్చొని, నా వంక దీర్ఘంగా చూసి: 'అబ్బే, అమ్మాయి కాదు. ససేమిరా అమ్మాయి కాదు, చిన్న అబ్బాయి...'

''నా జుట్టు పొట్టిగా క్రాప్ చేయబడింది. ఓవరాల్ వేసుకున్నాను. నెత్తి మీద టాంకు సైనికులు పెట్టుకునే హెల్మెట్ వుంది – నేను సరిగ్గా అబ్బాయి లాగే వున్నాను... ఇంట్లో వున్నవాటన్నింట్లోకీ మంచి చెక్కమంచంమీద పడుకో పెట్టింది. నేను బాగా తిని, సాధ్యమైనంత తొందరగా కోల్కొనేందుకుగాను ఓ పంది పిల్లని కూడా కోసింది... ఆమె నాపట్ల చాలా జాలి చూపింది. మధ్యమధ్య యిలా గొణుగుతూండేది:

'''మన పిల్లల్ని... అందునా ఆడపిల్లల్ని... కొలువులోకి పిలుస్తున్నారు, మనకి తగినంతమంది మగాళ్ళు లేరా...'

''పద్దెనిమిదో ఏట పోరాటంలో ''విశిష్ట సేవ చేసినందుకు'' నాకు ఒక మెడలూ, కూర్స్క్ యుద్ధంలో పాల్గొన్నందుకు ఒక ''అరుణ తార'' పతకం యిచ్చారు. నా పంథొమ్మిదవ యేట దేశభక్తియుత యుద్ధపు రెండో తరగతి పతకం బహూకరించారు. మాకు వచ్చిన అదనపు బలగాలు పద్దెనిమిది పంథొమ్మిదేళ్ల కుర్రాళ్లతో కూడివున్నాయి. నా పతకాలు చూసి నా వయస్సే కలిగినవాళ్ళు ఆశ్చర్య చకితులయ్యారని వేరే చెప్పనక్కర్లేదనుకుంటాను. వాళ్లొక్కొక్క సారి 'నీకీ పతకాలు ఎందుకిచ్చారబ్బా?.. నువ్వేమైనా పోరాటంలో పాల్గొన్నావా?' అంటూ వ్యంగ్యంగా ప్రశ్నిస్తూ వుండేవాళ్ళు. లేకపోతే 'ఇంతకీ బులెట్లు టాంకు కవచాన్ని తూట్లు పొడవగలవంటావా?' అంటూ ప్రశ్నలువేసి నన్ను ఏడిపిస్తూండేవాళ్ళు.

''అలా నన్ను ఏడిపించినవాళ్లలో ఒకడికి యుద్ధ భూమిలో నేనొకసారి శత్రువుల కాల్పుల మధ్య కట్టుకట్టడం తటస్థించింది. స్కొగొలెవాతిహ్ అన్న అతని యింటి పేరు సైతం నాకు జ్ఞాపకం వుంది. అతని కాలు విరిగింది... నేనతని కాలికి బద్దలు వేసి కట్టు కడుతున్నప్పుడు 'నిన్నప్పుడు ఏడ్పించినందుకు దయచేసి నన్ను క్షమించు సిస్టర్...' అంటూ నన్నతను క్షమాపణ వేడుకోవడం మొదలెట్టాడు.

''అయినా అప్పట్లో ప్రేమ అంటే మాకేం తెలిసి చచ్చు? మాలో కొంద రికి తెలిసివుండగల ప్రేమ అల్లా స్కూలు పిల్లల చిన్న పిల్లల మధ్య ప్రేమ మాత్రమే. నాకో సంగతి జ్ఞాపకం వస్తోంది. ఓ రోజున శత్రువులు మమ్మల్ని చుట్టుముట్టారు... మమ్మల్ని అన్ని వేపుల్నించీ కమ్ముకొస్తున్నారు. మేమా రాత్రి శత్రు వలయానికి గండికొట్టి బయటపడే ప్రయత్నం చెయ్యాలని నిర్ణయించుకున్నాం. ఆ ప్రయ త్నంలో సఫలమైతే బతికి బయటపడతాం, లేకపోతే మేమంతా సంఘ మరణం పొందుతాం, అదీ పరిస్థితి. మేము బయటపడే అవకాశాలు ఎక్కువగా ఉన్నట్టు అనుకోలేదు... నేనొక విషయం మీకు చెప్పాలో అక్కర్లేదో నాకు నిజంగానే తోచడం లేదు...

''సరే, బయటపడేందుకుగాను రాత్రికోసం వేచి చూస్తూ మేమక్కడ కూర్చు న్నాం. మా బెటాలియన్ కమాండరు గాయపడినందున మా బెటాలియన్‌కి నాయ కత్వం చేపట్టిన మీష – అతనికి యింతా చేసి పంథొమ్మిదేళ్లకి మించి లేవు – నాతో యిలా అన్నాడు:

'''ఇంతకీ నువ్వది రుచి చూశావా?'

'''ఏమిటి రుచి చూడటం?' అని నేను అడిగాను – మేము చాలాసేపుగా ఏమీ తినలేదు, నాకు మా చెడ్డ ఆకలేస్తోంది.

'''ఏమిటి కాదు, ఎవరితో...'

'''ఏమిటి నువ్వనేది, లే – దు!'

'''నేనూ రుచి చూడలేదు. ప్రేమంటే ఎలా వుంటుందో తెలుసుకోకుండానే మనం చచ్చిపోతామేమో... మనం యీ రాత్రే సఫాకావచ్చు...'

''నాకు చివరకి అతను అంటున్నదేమిటో అర్థమయ్యాక 'ఏయ్, బడుద్ధాయ్, యేమిటి నువ్వు వాగుతున్నది' అన్నాను.

''ఇక్కడ భయంకరమైన విషయం ఒకళ్లు చంపివెయ్యబడటం కాదు, జీవితం అంటే యేమిటో తెలుసుకోకుండా చచ్చిపోవడం, ఏ అనుభవాలూ పొందకుండా చచ్చిపోవడం. అదీ అత్యంత భయంకరమైన విషయం. జీవితమంటే యేమిటో యింకా తెలుసుకోకుండానే జీవితంకోసం పోరాడేందుకు మేము సిద్ధపడ్డాం.''

ఆమె అత్యంత క్లేశపూరితమూ, అత్యంత బాధాకరమూ అయిన అంశానికి తిరిగివచ్చింది.

"...టాంకు దళాల్లో మెడికల్ ఆర్డర్లీలు ఎక్కువ కాలం బతికేవాళ్లు కారు. మాకు టాంకులో జాగా వుండేది కాదు. మేము టాంకు కవచానికి కరిచిపెట్టుకు నిలబడి ఒకే ఒక్క విషయం ఆలోచిస్తూండేవాళ్లం. టాంకు చక్రాల కేటర్‌పిల్లర్లలో కాళ్లు యిరుక్కుని లాగివెయ్యబడకుండా చూసుకోవడం ఎలాగన్నదే ఆ ఆలోచన. ఏ టాంకైనా అంటుకోలేదు కదా అని అనుక్షణం చూస్తూ వుండాలి. ఏదైనా అంటుకుంటే అక్కడకి పరుగెత్తాలి, పాకాలి... మేము అచ్చంగా ఐదుగురం వున్నాం, ఐదుగురు స్నేహితురాళ్లం: యసీన్‌స్కయా ల్యూబా, కిసెల్యోవా షూరా, బొబ్కోవా తోన్యా, లాతిష్ జీనా, నేనూ. టాంకు సైనికులు మమ్మల్ని 'కొనకోవొ అమ్మాయిలు' అంటూండేవాళ్లు. వాళ్లలో ఒక్క నేను తప్ప మిగిలినవాళ్లందరూ చచ్చిపోయారు...

"పోరాటంలో చనిపోయేందుకు ముందు రోజు సాయంత్రం ల్యూబా, నేనూ పక్కపక్కన ఒకరి భుజంమీద మరొకరం చేతులేసుకు కూర్చున్నాం. కబుర్లు చెప్పుకున్నాం. అది 1943. మా టాంకు డివిజన్ ద్నీపరు నదిని చేరుకుంది. ల్యూబా అకస్మాత్తుగా యిలా అంది: 'నీకు తెలుసా, నేనీ యుద్ధంలో చచ్చిపోతాను... నాకు అంతర్వాణి చెప్తోంది. నేను సార్జెంట్ మేజరు దగ్గరికెళ్లి కొత్త అండర్‌వేర్ యిమ్మన్నాను. కాని, 'నేను యీమధ్యనే కదా నీకు కొత్తవి యిచ్చాను' అంటూ పిసినారితనం ప్రదర్శించాడు. 'దానిదేముంది, పొద్దున్న నేను కూడా నీతో వస్తాను, ఇద్దరం కలిసి అడుగుదాం' అని చెప్పి ఆమెని శాంతపరిచేందుకు ప్రయత్నించాను. 'ఇప్పటికి రెండేళ్లుగా మనం యుద్ధం చేస్తున్నాం. తుపాకి గుళ్లే భయపడుతున్నాయి మనమంటే' అని అనునయించ ప్రయత్నించాను.

"కాని మర్నాటి ఉదయం నన్నామె సార్జెంటు దగ్గరకి రమ్మని బలవంతం చేసింది. మేము అతని దగ్గర్నుంచి కొత్త అండర్‌వేర్ల జత తీసుకున్నాం. తర్వాత ఆ కొత్త అండర్ షర్టు... అదంతా రక్తంతో నిండిపోయింది... తెలుపు, ఎరుపుల – ఉజ్వలమైన రక్తపు ఎరుపు – సమ్మేళనం నా జ్ఞాపకాలను పీడిస్తోంది. తను సరిగ్గా అలాగ వుంటాననే ఆమె ఊహించుకుంది.

"బొబ్కోవా తోన్యా ఎలా చచ్చిపోయిందో నాకు యిటీవలే తెలిసింది. తను ప్రేమించిన కుర్రాణ్ణి మందు పాతర పెంకు తాకిడినుంచి తన శరీరంతో కప్పి కాపాడేందుకు ఆమె ప్రయత్నించింది. తునకలు ఎగిరాయి... అరక్షణంలో ఆమె రివ్వున దూసుకుపోగలిగిందో తెలియదు గాని, ఆ లెఫ్టినెంట్ బొయ్‌చేవ్‌స్కీ పేత్యని కాపాడింది. ఆమె అతన్ని ప్రేమించింది. అతను బతికి వున్నాడు.

"ముప్ఫయ్యేళ్లు గడిచాక యుద్ధ వెటరన్ల సమావేశానికి క్రస్నొదార్ ప్రాంతం

నుంచీ వచ్చిన పేత్య యీ విషయం నాకు చెప్పాడు. మేమిద్దరం కలిసి తోన్యా చనిపోయిన చోటును దర్శించాం. అతను ఆమె సమాధినుంచి పిడికెడు మట్టి తీసుకెళ్లాడు. ఆ మట్టిని తన తల్లి సమాధిలో నిక్షిప్తంచేసినట్లు అతను దరి మిలా నాకు రాశాడు: 'నాకు యిద్దరు తల్లులు వున్నారు — మొదటిది నా కన్న తల్లి, రెండవది నా ప్రాణం కాపాడిన తోన్యా...'

''ఐదుగురు అమ్మాయిలం, ఐదుగురు స్కూలుమేట్సుం యుద్ధ రంగానికి వెళ్లాం. నేనొక్కదాన్ని మాత్రం తిరిగివచ్చాను. మరి నేనే ఎందుకు తిరిగివచ్చానో? మిగతా అమ్మాయిలు చచ్చిపోయారు, నేను తిరిగివచ్చాను... అవిగో అక్కడ వేలాడుతున్నాయి వాళ్ల ఫొటోలు. ఐదుగురం...

''నేను బోలెడు చోట్లకి తిరుగుతూ వుంటాను... చాలామందికి రాస్తూ వుంటాను... 'నీ కెప్పుడూ తీరికే వుండదమ్మా' అంటూ వుంటాడు మా అబ్బాయి. నేనింతవరకు యుద్ధ వెటరన్ల ఏ ఒక్క సమావేశానికీ గైరుహాజరు కాలేదు. నేను ఎంత జబ్బుగానైనా ఉండు గాక, పాకుతూనైనా సరే వెళ్లవలసివచ్చు గాక, నేను వెళ్తాను... అదే నా జీవితం... ఒక పునర్మిలనంనుంచి మరోదానికి నిరీక్షణ...''

అకస్మాత్తుగా ఆమె కవిత్వంలోకి దిగింది:

> నేను చూసిన సాహస కృత్యాలన్నింట్లోకీ —
> మరి నమ్మండి నే చూశా వాటి నెన్నింటినో
> ఒక మిత్రుణ్ణి మృత్యువు బారినుంచి కప్పి కాపాడటం
> ప్రమాదంనుంచి అతన్ని దూరంగా లాక్కెళ్లడం ఉత్తమోత్తమం.

ఆమె బిడియంగా చెప్పింది: ''ఇది నేనే రాశాను, యుద్ధ రంగంలో వుండగా నేను కొంచెం కవిత్వం గిలికాను, ఇప్పటికీ రాస్తూనేవున్నాను. నే స్నేహితురాళ్లు నా గీతాలంటే యిష్టపడేవాళ్లు...''

ఆశ్చర్యకర విషయం యేమిటంటే, యుద్ధ రంగంలో చాలమందే కవిత్వం రాశారు. ఇప్పటికీ వాళ్ల కవితల్ని జాగ్రత్తగా కాపీచేసి, కుటుంబ పురాపత్రాల్లో పదిలపరుస్తూ వుంటారు. ఎన్నో సమావేశాల, పరిచయాల తర్వాత హృదయపు లోతుల్లోంచి అడ్డదిడ్డంగా వెలువడి, మనస్సులను స్పందింపజేసే ఆ కవిత్వ పాదాలను నేను చారిత్రక పత్రాలుగా పరిగణిస్తాను. ఈ ''హార్దిక పత్రాల్లో'' నాకొక నిర్దిష్ట యుగవాణి వినిపిస్తుంది ఒక నిర్దిష్ట తరం కనిపిస్తుంది.

అయితే విష్నెవ్స్కయా తన కథని యింకా ముగించలేదు:

''రెండేళ్ల క్రితం పాజ్దన్యకోవ్ వాన్యని కనుక్కున్నాను. మేం అతను చనిపోయాడని అనుకున్నాం, కాని అతను బతికివున్నట్లు తేలింది. అతను నాయకత్వం వహించిన టాంకు ప్రోహొరొవ్క యుద్ధంలో రెండు జర్మన్ టాంకుల్ని నాశనం

చేసింది, కాని తర్వాత అది అంటుకుని తగలబడిపోయింది. టాంకు సిబ్బందిలో మిగి లినవాళ్లందరూ చచ్చిపోయారు. వాన్య ఒక్కడే బతికి బయటపడ్డాడు. కాని అతని రెండు కళ్ళూ పోయాయి, ఒళ్లంతా దారుణంగా కాలిపోయింది. మేం అతన్ని ఆస్పత్రికి పంపాం, కాని అతను కోలుకుంటాడని అనుకోలేదు. నేనతన్ని దరిమిలా ముప్ఫయ్యేళ్ల తర్వాత కలిశాను. ఆ సన్నివేశం నాకింకా బాగా గుర్తుంది. నేను మెట్లెక్కుతు న్నాను. నా కాళ్లు దడదడలాడాయి. అతనేనా, కాదా? స్వయంగా అతనే తలుపు తీశాడు. అతను తన చేతుల్తో నన్ను తడిమి, నన్ను గుర్తించి, 'నువ్వు నీనావి కదూ, ఔనా?' అన్నాడు. ఊహించుకోగలరా మీరు, ఇన్నేళ్లు గడిచిపోయాక కూడా అతను నన్ను గుర్తుపట్టాడు!

''అతని తల్లి చాలా ముసిల్ది. అతను ఆవిడతో కలిసి వున్నాడు. ఆవిడ మాతో బాటు టేబిల్ దగ్గర కన్నీళ్లు ఒత్తుకొంటూ కూర్చుంది. నేను ఆవిడతో 'ఇద్దరు యుద్ధ కాలపు కామ్రేడ్సు కలుసుకున్నందుకు సంతోషించేందుకు బదులు మీరెందుకు కంట తడి పెడుతున్నారు?' అన్నాను.

''ఆవిడ నాతో యిలా అంది:

'''నా కొడుకులు ముగ్గురు యుద్ధానికి వెళ్లారు. యుద్ధంలో యిద్దరు చనిపోయారు. వాన్య ఒక్కడే ప్రాణాలతో తిరిగివచ్చాడు.'

''మరి ఆ వాన్యకి రెండు కళ్ళూ పోయాయి... అతను ఆఖరుసారిగా చూసినది ప్రోహొరొవ్క దగ్గరి యుద్ధ భూమి, టాంకు యుద్ధం... ఆ రోజును గురించి నువ్వేమనుకుంటున్నావని నేనతన్ని అడిగాను. మీకు తెలుసా, అతనేం చెప్పాడో?

'''ఒకే ఒక్క విషయం గురించి నేను విచారిస్తున్నాను — మా సిబ్బందిని వెళ్లిపొమ్మని మరీ తొందరగా ఆజ్ఞాపించాను. కుర్రాళ్లు ఎటుతిరిగీ చచ్చిపోదురు. కాని మేము మరో జర్మన్ టాంకుని కుంటుపరచగలిగేవాళ్లం...'

''అదిగో అదొక్కటే, అతనిన్నాళ్ళూ పశ్చాత్తాపడుతున్న విషయం...''

# "టెలిఫోన్ రిసీవర్ షూట్‌చెయ్యదు..."

''మనం బెర్రీ పైలు* తిందాం, నేను పొద్దుట్నుంచి వీటి తయారీలోనే వున్నాను...'' అంటూ నాకు సరదాగా స్వాగతం చెప్పింది చుదాయెవా వలెంతీనా.

---

* పై — మాంసం గానీ, కాబేజి గానీ, పళ్లు గానీ పూర్ణంలా పెట్టి బేక్ చేసే రష్యన్ పిండి వంట. — సం.

నా గాభరాను ఊహించి, ఆ వెంటనే ఆమె ''నేను మీకు నా కథ చెప్తాను కదా... నాలో కన్నీళ్లింకా పూర్తిగా యింకిపోలేదు... నేను నా స్నేహితురాండ్రని జనానికి నా అడ్రెస్సు ఎందుకిస్తూవుంటారర్రా అని కూకలేశాను. ఇప్పటికే నేను గుండె నొప్పి టాబ్లెట్లు, గుళిగల సాయంతో బతుకుతున్నాను. సరే, ముందీ బెర్రీ పైలు రుచి చూద్దాం. ఇవి నా జన్మస్థానమైన సైబీరియాలో చేసే మాదిరి పైలు. బెర్రీ పూర్ణపు పైలు...'' ఆ తర్వాత ఆవిడ మరొకామెను ఉద్దేశించి, ఆమెకి స్పష్టంగా వినిపించేందుకుగాను బిగ్గరగా యిలా అంది: ''ఒక విలేకరి వస్తుందని ఎదురుచూశాం చూడు... ఆవిడ వచ్చింది. ఆవిడ ఎలా వుందో చూద్దువు గాని, నువ్విక్కడికి రా. ఆమె ఫోనులో ఎంతో సీరియస్‌గా మాట్లాడిందా, కాని తీరాచేసి చూస్తే, నిజంగానే చిన్నమ్మాయ్.'' ఆ తర్వాత ఆవిడ మళ్లీ నాతో మాట్లాడ్డం మొదలెట్టింది: ''నువ్వేమీ పట్టించుకోకు అమ్మాయ్... నా ధోరణే అంత – నేనె ప్పుడూ మనస్సులో అనుకున్నదేదో పైకి అనేస్తూంటాను.''

''మన ఆగంతకురాల్ని ముందు సర్దుకు కూర్చోనియ్యి. ఆవిణ్ణి గాభరా పెట్టకు...'' అంటూ వంటింటినుంచి ఒక స్వరం వినవచ్చింది.

''ఓస్, ఆమె యేమీ అనుకోదు. మన అమ్మాయే, ఆమె అర్థంచేసుకుంటుంది.''

యుద్ధ కాలంలో దిగ్బంధంచేయబడిన లెనిన్‌గ్రాడ్‌లో కమ్సొమోల్ ఆర్గనై జరు అయిన జేంచెంకొ అలెక్సాండ్రా భోజనాల బల్ల దగ్గర నేను మొహమాట పడ కుండా నాకు సాయంచేసింది.

అలెక్సాండ్రాకి నన్ను పరిచయం చేశాక వలెంతీనా యిలా అంది:

''మేమిద్దరం ఎంత కాలంనుంచి నేస్తులమో చెప్పమంటారా? యుద్ధం నాటి నుంచి యిప్పటిదాకా ఎన్నేళ్లు గడిచాయో అన్నేళ్లు...''

''మీరు ఆవిడ మాటలకి అడ్డురాకండి. ఆవిడ మాట్లాడ్డం ఆపిందో ఏడ వడం మొదలెడ్తుంది. నాకా సంగతి తెలుసు...'' అని నన్ను హెచ్చరించింది అలె క్సాండ్రా.

''టీ తయారై చాలా సేపైంది. నేను పోయి తీసుకొస్తాను.''

''నువ్విక్కడ కూర్చో... నేనే పోయి తీసుకొస్తాను...''

అబ్బ, చివరకి స్మృతుల్లో సైతం ఆ వెనకటి కాలానికి తిరిగివెళ్లడం ఆమెకి ఎంత కష్టం! ఎంత భయానకం...

చుదాయెవా వలెంతీనా, అప్పట్లో విమాన విధ్వంసక శతఘ్ని దళ కమాండర్.

''మారుమూల సైబీరియాకి చెందిన నా లాంటి అమ్మాయిని ఐచ్ఛికంగా యుద్ధ రంగానికి వెళ్లేలా ప్రేరేపించింది ఏమిటి? భూమి చివరి అంచు అనబడే

సైబీరియానుంచి! నేనొక రోజున కలుసుకున్న ఐక్య రాజ్య సమితి ప్రతినిధి ఒకరు ఆ 'భూమి చివరి అంచు'ను గురించి నన్ను అడిగాడు... మ్యూజియంలో అతను నాకేసే మళ్లీమళ్లీ గుచ్చి చూస్తూవుంటే, నాకు యిబ్బంది అనిపించడం కూడా మొదలుపెట్టింది. తర్వాత అతను నా దగ్గరకి వచ్చి, దుబాసీ సాయంతో నన్నిలా ప్రశ్నించాడు: 'మదామ్ చుదాయెవా, దయచేసి నాకు ఇంటర్వ్యూ యివ్వగలరా?' నేను తెగ గాభరాపడిపోయాననుకోండి. అతనికి నేనేం చెప్పగలను అనుకున్నాను. నేనా మ్యూజియంలో చెప్పిందే అతనికి చెప్తాం అనుకున్నాను. కాని అతను మరి దేంట్లోనో ఆసక్తి చూపించాడు. అన్నింటికంటె మొదట నన్నతను 'మీరు చాలా లేతగా కని పిస్తున్నారు... మీరు యుద్ధంలో పాల్గొనడం ఎలా తటస్థించింది?' అని ప్రశ్నిం చాడు. 'అదా, సంగతేమిటంటే, యుద్ధ రంగానికి వెళ్లేనాటికి మేము చిన్న పిల్లలం' అని జవాబిచ్చాను. కాని అతనికి ఆసక్తి కొలిపే విషయం అది కాదు.

''సైబీరియా భూగోళపు చిటారు అంచున ఉందని తను అనుకుంటున్నట్లు అతను చెప్పాడు. నేను అతని ఉద్దేశం గ్రహించి అన్నాను: 'బహుశా మా దేశంలో సార్వత్రిక సైన్య సమీకరణ జరిగిందేమోననీ, అందుకే కేవలం స్కూలు విద్యార్థిని నైన నేను యుద్ధ రంగానికి వెళ్లివుంటాననీ మీరు అనుకుంటున్నారు, ఔనా?' 'ఔనౌను' అంటూ అతను తల ఊపాడు. 'సరే, నేను మీ ప్రశ్నకి జవాబు చెప్తాను' అన్నాను. అతనికి నేనారోజున ఏం చెప్పానో, అదంతా – నా జీవిత కథ అంతా – నీకు చెప్పబోతున్నాను...

''నాకు మా అమ్మ జ్ఞాపకం లేదు. నేను చిన్నదానిగా ఉన్నప్పుడు ఆవిడ చని పోయింది. మా నాన్న నొవొసిబీర్స్క్ జిల్లా కమిటీ ప్రతినిధి. 1925లో పార్టీ ఆయన్ని ధాన్య సేకరణకోసం స్వగ్రామానికి పంపింది. దేశ ప్రజలకి ధాన్యం చాలా అవసరం. కాని ధనిక రైతులు ధాన్యం పాడైపోయేదాకా దాచేసేవారు. అప్పటికి నా వయస్సు తొమ్మిది నెలలు. మా నాన్నతోబాటు ఆ గ్రామానికి తను కూడా వెళ్లాలని అమ్మ నిర్ణయించుకుంది. అమ్మ కూడా ఆ గ్రామంలోనే పుట్టింది. నాన్న ఆవిణ్ణి తనతోబాటు తీసుకెళ్లాడు. మమ్మల్ని ఎవరి దగ్గర వుంచేందుకూ వీల్లేక అమ్మా, నాన్నా నన్నూ, అక్కనీ తమ వెంట తీసుకెళ్లారు. నాన్న గ్రామస్తుల సభ ఏర్పాటు చేశాడు. తను వెనక పాలేరుగా పనిచేసిన ధనిక రైతుని, 'మీరు ధాన్యం ఎక్కడ దాచారో మాకు తెలుసు, మర్యాదగా మీ అంతట మీరు ధాన్యం అప్పగించారా సరేసరి, లేకపోతే మేమే మీ దగ్గరకి వచ్చి బలవంతాన ధాన్యం జప్తుచేస్తాం' అని హెచ్చరిం చాడు.

''సభ పూర్తయాక, మా బంధువులందరూ యింట్లో కూడారు. మా నాన్నకి ఐదుగురు సోదరులున్నారు. మా నాన్నతో సహా వాళ్లందరూ 1941–45 నాటి

దేశభక్తియుత మహా యుద్ధంలో నేలకొరిగారు. సరే, వాళ్లందరూ భోజనాల బల్ల దగ్గర కూర్చున్నారు. బల్లమీద సాంప్రదాయికమైన మా సైబీరియన్ మాంసపు కుడుములు వున్నాయి. బెంచీలు గోడకి ఆనుకొని వున్నాయి... అమ్మ రెండు కిటికీలకీ మధ్య జాగాలో కూర్చొని వుంది. ఆవిడ భుజం ఒకటి కిటికీకి ఎదురుగానూ, రెండోది నాన్నకేసీ తిరిగివున్నాయి. నాన్న కిటికీలు లేని చోట కూర్చున్నాడు. అది ఏప్రిల్ మాసం... సైబీరియాలో ఒకొక్క ఏడాది ఏప్రిల్లో కూడా చలిగా వుంటుంది. అమ్మకి చలివేసివుంటుంది. ఆ విషయం నాకు తర్వాత అర్థమైంది. అమ్మ లేచి, నాన్న గొర్రెబొచ్చు కోటు భుజాలమీద వేసుకొని, నన్ను చేతుల్లోకి తీసుకొని పాలివ్వ నారంభించింది. సరిగ్గా ఆ క్షణంలో ఒక రైఫిలు పేలిన శబ్దమైంది. వాళ్లు మా నాన్నని కాల్చి చంపాలని అనుకున్నారు. గొర్రెబొచ్చు కోటుకి గురిచేశారు. మా అమ్మ అనగలిగిన మాటల్లా 'నా...' అని మాత్రమే. ఆవిడ నన్ను వేడివేడి మాంసపు కుడుములమీద వదిలేసింది. అమ్మకి అప్పటికి ఇరవై నాలుగేళ్లు...

"మా నాన్న అంతర్యుద్ధ వీరుడు. ఆయన తిరుగుబాటు చేసిన చెకొస్లొవాక్ దళంమీద దాడిలో పాల్గొన్న ఒక కవచ రైలుకి కమాండరు. 1931లో ఆయనకి అరుణపతాక పతకం బహూకరించారు. ఆ కాలంలో, ప్రత్యేకించి సైబీరియాలో, మేమున్న చోట యీ పతకం పొందినవాళ్లు చాలా కొద్దిమందే వుండేవారు. ఆ పతకం ఉన్నవాళ్లకి విశేషమైన గౌరవ ప్రతిష్ఠలు వుండేవి. నాన్నకి ఒంటినిండా పంథొమ్మిది తుపాకి గుళ్ల గాయపు మచ్చలు వున్నాయి.

"శత్రువు నా దేశంమీద మళ్లీ దాడిచేసినప్పుడు, అలాంటి కుటుంబంలో పెరిగిన నేను, అంత అద్భుతమైన తండ్రి బిడ్డనైన నేను, నాకు పట్టనట్లు ఉదాసీనంగా ఎలా వుండగలను? మా నాన్నని ఎరగనివాళ్లు లేరు...

"1941వ సంవత్సరం వచ్చింది. స్కూలు విద్య పూర్తిచేసుకొని వెళ్లిపోతున్న విద్యార్థులకి మా స్కూల్లో వీడ్కోలు పార్టీ జరుగుతోంది. మేమందరం చిన్న పిల్లలం. మా అందరికీ మా సొంత ప్లాన్లు వున్నాయి. భవిష్యత్తును గురించిన స్వప్నాలు వున్నాయి. పార్టీ తర్వాత మేము ఓబ్ నదిమీద ప్రయాణంచేసి రాత్రి ఒక ద్వీపంలో గడిపాం. మేము నగరం విడిచివెళ్లినప్పుడు అది యెప్పటి మాదిరిగానే ప్రశాంతంగా వుంది. మేమందరం ఎంతో సరదాగా, సంతోషంగా వున్నాం... మేము పొద్దు పొడవడం చూసి, తిరుగు ప్రయాణం సాగించాం... కాని నగరమంతా అట్టుడికినట్లు ఉడికిపోతోంది. చాలామంది కన్నీళ్లు పెట్టుకుంటున్నారు. నాలుగు పక్కల్నుంచీ 'యుద్ధం! యుద్ధం మొదలైంది!' అంటూ అరుపులు వినవస్తున్నాయి. రేడియోలన్నీ ఆన్‌చెయ్యబడ్డాయి. కాని మేము జరిగిందేమిటో గ్రహించలేకపోయాం.

యుద్ధం యేమిటి? మేమెంతో సంతోషంగా వున్నాం, మేము ఏ కాలేజిలో చేరుతాం, మేము ఏ వృత్తి చేబట్టుతాం అంటూ ప్లాన్లు వేసుకున్నాం... అంతలో మబ్బు లేని ఆకాశంనుంచి పిడుగు పడ్డట్టు – యుద్ధం దాపురించింది! పెద్దవాళ్లు కంట తడి పెట్టుకుంటున్నారు, కాని మేము భయపడలేదు. మాలో మేము 'నాజీలని నుగ్గునూచం చెయ్యడానికి' మనకి ఒక్క నెలకంటె ఎక్కువ పట్టదనీ, మనం యుద్ధాన్ని శత్రువు భూభాగంలోకి తీసుకెళ్తామనీ ఒకళ్లకి ఒకళ్లం నచ్చచెప్పుకున్నాం... 'పోరాటంలో మరణించాడు' అంటూ జనానికి అధికారిక నోటీసులు అందడం మొదలవడంతో మేమంతా అర్థంచేసుకున్నాం.

''మా నాన్న పోరాటపు డ్యూటీకి పనికిరాలేదు. కాని ఆయన రిక్రూట్‌మెంటు కార్యాలయ అధికారులను పీక్కుతినడం మొదలెట్టాడు. దానితో, ఆయన త్వరలోనే యుద్ధ రంగానికి వెళ్లాడు – ఆరోగ్యం బాగుండకపోయినా, వృద్ధుడైనా, ఊపిరితిత్తులు సరిగా లేకపోయినా – ఆయనకి క్షయ వ్యాధి వుండేది – వయస్సు ముదిరినా! కాని ఆయన ఉక్కు దళంలో చేరాడు. దాన్నే 'స్టాలిన్ దళం' అని కూడా అనేవారు. ఆ దళంలో చాలామంది సైబీరియన్లు ఉండేవారు. ఛా, మేము పాల్గొకుండా యుద్ధం ఎలా జరుగుతుంది, మేము కూడా పోరాటంలో పాల్గొనాల్సిందే అని మేము అనుకున్నాం. మాకు తక్షణం ఆయుధాలు కావాలని అనుకున్నాం! అందుకని మేము హడావిడిగా సైనిక నమోదు, రిక్రూట్‌మెంట్ కార్యాలయానికి వెళ్లాం. ఫిబ్రవరి 10వ తేదీకల్లా నేను యుద్ధ రంగానికి పోయేందుకు సంసిద్ధురాలినయాను. 'నా మాట విని, పోకు వాల్యా... ఏమిటి నువ్వు చేస్తున్నది! నువ్వింత లేత, బక్క పిల్లవి! నువ్వెలాంటి సైనికురాలివి అవుతావని అనుకుంటున్నావ్?' అంటూ నా సవతి తల్లి భోరున ఏడ్చింది. నాకు చిన్నతనంలో చాలా కాలంపాటు కీళ్లవాతం వుండేది. మా అమ్మ హత్యచెయ్యబడ్డాక, నాకా వ్యాధి పట్టుకుంది. నాకు ఐదేళ్లు వచ్చేదాకా నేను నడవలేకపోయాను... కాని మన దేశంమీద దండయాత్ర జరిగాక నాలో శక్తి వెల్లువలా పెల్లుబికింది!

''రెండు నెలలపాటు మేము గుడ్సు రైలు పెట్టెల్లో ప్రయాణం చేశాం. ఓ పూర్తి రైలుబండి నిండుగా రెండు వేలమంది అమ్మాయిలం. మా వెంట మాకు శిక్షణ యిచ్చిన ఆఫీసర్లు వున్నారు. మేము సిగ్నలర్లుగా పనిచెయ్యాల్సివుంది. మేము ఉక్రెయిన్ చేరుకున్నాం. అక్కడే మామీద మొట్టమొదటి సారి బాంబు దాడి జరిగింది. సరిగ్గా మేము సైనిక స్నాన గృహంలో స్నానంచేస్తున్నాం. మేము స్నాన గృహంలో ప్రవేశించే సరికి, అక్కడ డ్యూటీలో ఒక సైనికుడు వున్నాడు. అతను ఆ స్నాన గృహానికి బాధ్యుడు. మేము అతని సమక్షంలో స్నానంచెయ్యడానికి మాకు సంకోచం కలిగింది. మేము బాగా చిన్న పిల్లలం కదా. కాని బాంబింగు మొదలు

కాగానే మేమందరం అతని దగ్గరకి పరుగెత్తాం. ఆ క్షణంలో మా మనస్సుల్లో ఉన్నదల్లా మా ప్రాణ రక్షణ మాత్రమే. మేము ఆదరాబాదరా ఎలాగోలాగ దుస్తులు వేసుకున్నాం. నేను నా తలమీద ఎర్రటి తువ్వాలు కప్పుకున్నాను. మేము బయటకి పరుగు తీశాం. ఒక సీనియర్ లెఫ్టినెంటు — అతనూ లేత కుర్రాడే — నన్ను ఉద్దేశించి అరిచాడు:

'''బాంబు షెల్టరుకి పరుగెత్తు! ఆ తువ్వాలు తీసి పారెయ్యి! నువ్వు మన మరుగు బయట పెడుతున్నావ్!..'

''కాని నేను 'నేనేమీ బయటపెట్టడం లేదు! తడి జుట్టుతో బయటకి వెళ్లకూడదని మా అమ్మ చెప్పింది' అని అరుస్తూ నేనతనికి దూరంగా పగురెత్తాను. విమాన దాడి ముగిశాక అతను నన్ను వెతుక్కుంటూ వచ్చి 'నువ్వు నా ఆజ్ఞ ఎందుకు పాటించలేదు? నేను నీ పై ఆఫీసర్ని' అని నిగ్గదీశాడు. కాని నేనతన్ని నమ్మలేదు. 'ఏమిటి! భలే పై ఆఫీసరువే!' అంటూ నేనా యువ లెఫ్టినెంటుతో దెబ్బలాడాను. అతను శుద్ధ లేత కుర్రాడు, మహా అయితే నాకంటె ఒక్క ఏడాదికంటె ఎక్కువ వయస్సుండదు.

''మాకు భారీ ఓవర్‌కోట్లు యిచ్చారు. అవి మంచి దట్టంగా మరీ భారీగా వున్నాయి. వాటిలో అటూయిటూ తిరుగుతున్న మేము ఎండిన గడ్డి బొద్దుల్లా కనిపించేవాళ్లం. మాది నడకలా కాక అటూయిటూ ఊగిసలాటలా వుండేది. మొదట్లో మాకు యే బూట్లూ సైతం వుండేవి కావు. అంటే, బూట్లయితే వుండేవి గాని, అవన్నీ మగాళ్ల సైజు బూట్లు. దరిమిలా మా బూట్లు మార్చి, తార్పాలిన్ పైభాగం కలిగిన సరికొత్త, ఎర్రటి బూట్లు యిచ్చారు. వాటిలో ప్రదర్శనగా తిరుగుతూ మేమెంత మురిసిపోయేవాళ్లమో!

''మేమందరం పొట్టిగా, సన్నగా వుండేవాళ్లం. అందుకని మా ట్యూనిక్‌లు లుడుంగులుడుంగుమంటూ వుండేవి. మాలో కుట్టుకోగలిగినవాళ్లు ఏదో ఒకలాగ వాటిని తమకి సరిపోయేలా అమర్చుకున్నారు. కాని మేము ఆడవాళ్లం కదా, మాకు వేరే అవసరాలు ఉంటాయి. దానితో మా సార్జెంట్ మేజరు మా కొలతలు తీసుకోవడం మొదలెట్టాడు. మీరు ఆ దృశ్యం చూసివుంటే, కడుపుబ్బ నవ్వేవారు, నిజానికి అంత తమాషా అయినదేమీ లేకపోయినా! మా బెటాలియన్ కమాండరు వచ్చి, 'ఏం, మీ అందరికీ మీ బట్టలు అందాయా?' అని అడిగాడు. సార్జెంట్ మేజరు 'అందజేస్తున్నామండి...' అని జవాబిచ్చాడు.

''సరే, విమాన విధ్వంసక దళంలో నేనలా ఒక సిగ్నలర్ని అయాను. కమాండరు కేంద్రంలో నన్ను సిగ్నలరుగా నియమించారు. మా నాన్న యుద్ధంలో నేల కొరిగాడన్న వార్త నాకు అందివుండకపోతే, నేను యుద్ధం చివరిదాకా ఓ సిగ్నలరు

గానే ఉండిపోయేదాన్ని. ఆ సంఘటన తర్వాత 'నేను మా నాన్నని చంపినందుకు నాజీలమీద పగతీర్చుకొని బదులుతీర్చుకోవాలి' అని చెప్పి, నన్ను యుద్ధపు అగ్ర శ్రేణికి పంపమని అధికారుల్ని కోరాను. పోరాడాలనీ, పగ సాధించాలనీ, కాల్పులు కాల్చాలనీ తపించాను. శతఘ్ని దళానికి టెలిఫోన్ చాలా ముఖ్యమైనదని నాకు నచ్చచెప్పేందుకు వాళ్లు ప్రయత్నించారు. కానైతే ఒక టెలిఫోన్ రిసీవరు షూట్ చెయ్యదని మీకు తెలుసు కదా... నేను మా రెజిమెంటల్ కమాండరుకి దరఖాస్తు పెట్టాను. ఆయన నా అభ్యర్థనని తిరస్కరించాడు. తర్వాత జంకు లేకుండా డివిజన్ కమాండరుకి రాశాను. త్వరలోనే కల్నల్ క్రస్నీహ్ వచ్చి, మమ్మల్నందర్నీ బారుతీర్చి, 'విమాన విధ్వంసక దళం కమాండర్ కావాలని దరఖాస్తు పెట్టుకున్న అమ్మాయి ఎవరు?' అని ప్రశ్నించాడు. సన్నటి మెడతో, పొట్టిగా వుండే నేను ఎదురుగా నిలబడ్డాను. ఆ సన్నటి మెడమీద డెబ్బై ఒక్క కార్ట్రిడ్జిలున్న బరువైన ఒక సబ్‌మెషీన్ గన్ను వేలాడుతోంది... బహుశా నేను కనికరం పుట్టించేలా కనిపించివుంటాను... ఆయన నాకేసి చూసి, 'ఏమిటి కావాలి నీకు?' అన్నాడు. 'నేను షూట్‌చెయ్యాలి' అని జవాబిచ్చాను. ఆయన ఏమనుకున్నాడో తెలియదు. ఆయన నావైపు దీర్ఘంగా చూశాడు, తర్వాత వెనక్కి తిరిగి వెళ్లిపోయాడు. నా దరఖాస్తు తిరస్కరింపబడినట్లే అనుకున్నాను. కాని కొద్ది సేపట్లో మా కమాండరు పరుగున వచ్చి 'కల్నల్ నీకు అనుమతి యిచ్చారు' అని చెప్పాడు...

''నేను స్వల్పకాలిక తరగతుల్లో శిక్షణ పొందాను. అది బాగా స్వల్పకాలికమైనది — కేవలం మూడు నెలలే. నేను శతఘ్ని దళ కమాండర్ని అయ్యాను. నన్ను 1357వ నంబరు విమాన విధ్వంసక రెజిమెంటుకి పంపారు. మొదట్లో నా ముక్కుమ్మటా, చెవమ్మటా రక్తం పడేది. నా పొట్ట పూర్తిగా ఖరాబైపోయింది... రాత్రి పూట అంత ఫర్వా లేదు గాని, పగటి పూట పరమ దారుణంగా వుండేది. విమానాలు నేరుగా నామీదకే, సరిగ్గా నా శతఘ్నిమీదకే వస్తున్నట్లు వుండేది. ఒక్క క్షణంలో నన్ను ఖైమాఖైమా చేసేస్తారని అనిపించేది... నిజానికి అది చిన్న అమ్మాయి చేసే పని కాదు... మొదట్లో మాకు 85 శతఘ్నులు వుండేవి. మాస్కో పొలిమేరల్లో అవి చక్కగా పనిచేశాయి. దరిమిలా అవి టాంకు విధ్వంసక శతఘ్నులుగా పనిచేశాయి. దరిమిలా మాకు 35 శతఘ్నులు యిచ్చారు. ర్జేవ్ పట్టణ సెక్టరులో మాకీ శతఘ్నులు యిచ్చారు. అప్పట్లో అక్కడ తీవ్రమైన యుద్ధం జరుగుతోంది. వసంతకాలంలో వోల్గా నదిమీది మంచుగడ్డ పగులుతోంది... ఓ రోజున ఓ పెద్ద మంచు పలక నదీ ప్రవాహానికి వాలుగా కొట్టుకురావడం మేము చూశాం. దానిమీద యిద్దరు ముగ్గురు జర్మన్లూ, ఒక రష్యన్ సైనికుడూ ఒకొర్నొకరు పెనవేసుకొని చచ్చి పడివున్నారు. ఆ మంచు పలక అంతా రక్తం కొట్టు

కొనివుంది. మీరా దృశ్యాన్ని చిత్రించుకోగలరా? వోల్గా నదీమ తల్లి నీరంతా రక్తంతో సమ్మిశ్రితమై వుంది...''

వలెంతీనా ఒక మాట మధ్య ఆగి, యిలా అంది: ''నేనింక ఆపుకోలేను... కాస్త ఊపిరి పీల్చుకోనియ్యండి... ఇదంతా చాలా కష్టం... అలెక్సాంద్రా నన్ను ట్రాంక్విలైజరు వేసుకోమంది. అది కనీసం నా కన్నీళ్లనైనా ఆపుతుంది...''

వలెంతీనా తన కథని యిలా కొనసాగించింది: ''నేను యుద్ధంనుంచి అంగ వైకల్యంతో తిరిగివచ్చాను. నాకు వీపుమీద ఒక షెల్ పెంకు తగిలింది. గాయం పెద్దది కాదు గాని, నేను దూరంగా వున్న ఒక మంచు గుట్టమీదకి విసిరెయ్యబడ్డాను. అదెలా జరిగిందంటే, నేను చాలా రోజులుగా నా ఫెల్టు బూట్లని ఆర బెట్టుకోలేదు. కట్టెలు లేకపోవడమో, లేక బూట్లు ఆరబెట్టుకునేందుకు నా వంతు యింకా రాకపోవడమో జరుగుతూ వచ్చింది. మా స్టౌ చిన్నది. మేము చాలామం దిమి వున్నాం. దానితో వాళ్లు నన్ను చూసేసరికి నా కాళ్లు బాగా గడ్డకట్టి పోయాయి. నేను గాలికి రేగి ఏర్పడిన మంచు గుట్ట కింద కప్పబడిపోయివుంటాను, కాని నేను ఊపిరిపీలుస్తున్నందున మంచు గుట్టలో ఒక మాదిరి రంధ్రం ఏర్పడింది. శిక్షణ యివ్వబడిన కుక్కలు నన్ను కనుక్కున్నాయి. అవి మంచును తవ్వి, నా టోపీని సైనిక ఆర్డర్లీ దగ్గరకి తీసుకెళ్లాయి. దానిలో నా గుర్తింపు కార్డు వుంది. అలాంటి గుర్తింపు కార్డులు అందరి దగ్గరా వుండేవి. వాటిలో ఒక వేళ సైనికుడు చనిపోతే, ఆ సమాచారం తెలియజెయ్యవలసిన బంధువుల పేర్లూ, అడ్రెస్సులూ వుండేవి. వాళ్లు తవ్వి నన్ను పైకి తీసి ఒక కాన్వాసు గుడ్డమీద పడుకోబెట్టారు. నా గొర్రెతోలు కోటు రక్తంతో నానిపోయివుంది... కాని నా కాళ్ల సంగతి ఎవరూ పట్టించుకోలేదు...

''నేను ఆర్నెల్లు ఆస్పత్రిలో వున్నాను. గాంగ్రీన్ మొదలైంది గనుక నా కాలొకటి మోకాలు పైదాకా తీసెయ్యాలని అనుకున్నారు. అదిగో సరిగా ఆ ఘట్టంలో నేను పిరికిదానిలా ప్రవర్తించాను. నాకు అంగవికలురాలిగా బతికేందుకు యిష్టం లేకపోయింది. అసలెందుకు బతకాలి? నన్ను దగ్గర వుంచుకునేందుకు ఎవరు ఇష్టపడతారు? నాకు తల్లి గాని, తండ్రి గాని లేరు. నేను ప్రతి ఒకరికీ భారంగా వుంటాను. నిజానికి ప్రాణంతో వున్న కట్టె లాంటి నా అవసరం ఎవరికి వుంటుంది? ఆత్మహత్య చేసుకోవాలని అనుకున్నాను...

''ఒక యువ లెఫ్టినెంట్ అయిన మా వార్డు డాక్టరు ఆస్పత్రి అధికారి అయిన జనరల్ దగ్గరకి వెళ్లి 'నన్ను ప్రయత్నించనివ్వండి, ఒక్క సారి నన్ను ప్రయత్నించనివ్వండి...' అని అర్థించాడు. 'ఏం ప్రయత్నిస్తావ్? ఆమె బొటన వేళ్లలో ఒకటి

యిప్పటికే నల్లబడిపోయింది. ఆ అమ్మాయి వయస్సు కేవలం పంథొమ్మిదేళ్లు. మన మూలంగా ఆమె చనిపోతుంది' అన్నాడు జనరల్. మా వార్డు డాక్టరు నా కాలు తీసేందుకు అభ్యంతరం చెప్పాడు. అతను అప్పట్లో చర్మం కిందికి ప్రాణవాయువును ఒక ప్రత్యేక సిరంజితో పంపే కొత్త పద్ధతి కనిపెట్టాడు. దఫదఫాలుగా ప్రాణవాయువు ఎక్కించడం అన్నమాట. నేను వైద్య నిపుణురాలిని కాను గనుక అదేమిటో నేను కచ్చితంగా మీకు చెప్పలేననుకోండి.

''జనరల్‌ని ఎలాగైతేనేం ఆ యువ లెఫ్టినెంటు ఒప్పించాడు. నా కాలిని తీసెయ్యకుండా, కొత్త పద్ధతి ప్రకారం వాళ్లు చికిత్స మొదలుపెట్టారు. రెండు నెలలు గడిచే సరికల్లా, ఊత కర్రల సాయంతోనే అనుకోండి, నేను నడవడం మొదలుపెట్టాను. నా కాళ్లు ఖాళీ మేజోళ్లలా వుండేవి. వాటిమీద నేను నిలబడ లేకపోయేదాన్ని. కాళ్లని నేను చూడటమైతే చూసేదాన్ని గాని, అవి ఉన్న అనుభూతి నాకు కలిగేది కాదు. తర్వాత నేను ఊత కర్రలు లేకుండా నడవడం నేర్చుకున్నాను. జనం 'నువ్వు పునర్జన్మ ఎత్తావు' అంటూండేవాళ్లు. నన్ను ఆస్పత్రి నుంచి విడుదలచేశాక, కోలుకునేందుకుగాను సెలవు తీసుకునేందుకు నాకు ఆస్కారం వుంది. కాని నేను ఏమాదిరి సెలవు తీసుకోగలను? నేనెక్కడికి వెళ్లగలను? ఎవరి దగ్గరకి వెళ్లగలను? అందుకని నేను తిరిగి నా దళానికి, నా శతఘ్ని దగ్గరకే వెళ్లాను. అక్కడ నేను పార్టీలో చేరాను. పంథొమ్మిదేళ్ల వయస్సులో...

''విజయ దినం నాటికి నేను తూర్పు ప్రష్యాలో ఉన్నాను. యుద్ధంలో అప్పటికే రెండు రోజుల విరామం ఏర్పడింది. ఇరు పక్షాల్లో ఎవరూ కాల్పులు జరపడం లేదు. అకస్మాత్తుగా అర్ధరాత్రి పూట 'విమానాల దాడి!' అన్న హెచ్చరిక వినిపించింది. మేమందరం తటాలున లేచి నిలబడ్డాం. తర్వాత 'విజయం! శత్రువులు లొంగిపోయారు!' అన్న మాటలు వినవచ్చాయి. వాళ్లు లొంగిపోయారన్నది చాలా బాగానే వుంది. కాని మేము వెంటనే గ్రహించిన ప్రధానాంశం ఏమిటంటే, అది విజయం అన్న విషయం. 'యుద్ధం అయిపోయింది! యుద్ధం ముగిసింది!' అంటూ ప్రతి ఒక్కరూ తమ చేతిలో – సబ్‌మెషీన్ గన్ను వుంటే సబ్‌మెషీన్ గన్ను, పిస్తోలుంటే పిస్తోలు – యిలా ఏదుంటే దాన్ని కాల్చడం ప్రారంభించారు... మా శతఘ్ని కూడా పేల్చాం. 'మనం బతికి వున్నాం! మనం బతికి వున్నాం!' అంటూ కొందరు సైనికులు కన్నీళ్లు తుడుచుకున్నారు, మరికొందరు నాట్యం చేశారు. తర్వాత మా కమాండరు 'మీరు కాల్చిన గుళ్ల ఖరీదు చెల్లించేదాకా మీరు సైన్యం నుంచి విడుదలచెయ్యబడరు. మీరు చేసిన పనేమిటి? మీరెన్ని గుళ్లు పేల్చారు?' అంటూ గాండ్రుమన్నాడు. ఇక ప్రపంచంలో శాంతి చిరస్థాయిగా వుంటుందనీ, యికమీదట ఎవరూ ఎన్నడూ యుద్ధాన్ని కోరుకోరనీ, గుళ్లన్నింటినీ నాశనం

చేసెయ్యాలనీ, ఇక యుద్ధం గురించి జనం ఎన్నడూ మాట్లాడకుండా వుండేం దుకు యిదే మార్గమనీ మాకు అనిపించింది...

"నాకు తల్లీ, తండ్రీ లేకపోయినా, యింటికి తిరిగివెళ్లాలని నేనెంతగా తపించానో. నేను నా సవతి తల్లి పాదాలకి వంగి నమస్కరించాలని కోరుకున్నాను. ఆమె నాకు మాతృమూర్తిలా స్వాగతమిచ్చింది. దరిమిలా నేనామెను అమ్మా అని పిలిచే దాన్ని. ఆస్పత్రి అధికారి ఆవిణ్ణి మానసికంగా సిద్ధంచేసేందుకుగాను, నా కాలు తీసేశారనీ, నన్ను ఆ స్థితిలో తీసుకొస్తారనీ, నేను ఆమెతో కొద్ది రోజులపాటు వుంటాననీ, తర్వాత నన్ను తామే తీసుకుపోతామనీ రాశాడు... కాని ఆమె నేను సజీవంగా తిరిగిరావాలని కోరుకుంది. ఆమె నాకోసం నిరీక్షించింది... ఆమె నాకోసం ఆత్రంగా నిరీక్షించింది...

"మేము యుద్ధ రంగానికి 18–20 యేళ్ల వయస్సులో వెళ్లాం. యుద్ధ రంగంనుంచి 20–25 యేళ్ల వయస్సులో తిరిగివచ్చాం. మొదట్లో మేము సంతోషించాం, కాని తర్వాత పౌర జీవితంలో మేమేం చెయ్యగలుగతామని తలుచుకొని భయపడ్డాం. మా వెనకటి క్లాస్‌మేట్సు కాలేజీల్లో, యూనివర్సిటీల్లో చదువులు ముగించుకొని పట్టాలు తీసుకున్నారు. కాని మా స్థితి యేమిటి? మేము ఎందుకూ పనికిరాము. మాకు ఒక వృత్తి గాని, ఒక పనిలో నైపుణ్యం గాని లేదు. మాకు తెలిసిందల్లా యుద్ధం, పోరాటం. ఇక యుద్ధానికి సలాం కొట్టెయ్యాలని మేము ఆత్రపడ్డాం. నా మిలిటరీ ఓవర్‌కోటు కుట్లు విప్పి, నాకొక కోటు తయారు చేసుకున్నాను. బొత్తాములు మార్చేశాను. నా తార్పాలిన్ బూట్లని మార్కెట్లో అమ్మేసి, నాకొక జత సాదా షూలు కొనుక్కున్నాను. నేను మొట్టమొదటిసారి సాదా దుస్తులు ధరించినప్పుడు ఆనందం పట్టలేక ఏడ్చేశాను. అద్దంలో నన్ను నేను పోల్చుకోలేకపోయాను. నాలుగేళ్లుగా మేము పాంట్లు వేసుకుంటున్నాం. నేను గాయపడ్డానని ఎవరికి చెప్పుకోగలను? నేను చెప్పానా, నాకు ఉద్యోగం యివ్వరు. కాని వాస్తవానికి నా కాళ్లు బలంగా లేవు, నా నరాలు బాగా బలహీనపడ్డాయి...

"ఇప్పుడు నన్ను జనంతో మాట్లాడమని తరచు ఆహ్వానిస్తూ వుంటారు. ఈమధ్య ఇటాలియన్ యువతీ యువకుల బృందం ఒకదానితో నేను మాట్లాడాను. వాళ్లు ధనవంతుల బిడ్డలని నాకు తెలిసింది. యుద్ధం తర్వాత నేను పెళ్లిచేసుకున్నానా అని వాళ్లు ప్రశ్నించారు. ఎందుకో గాని, నేను పెళ్లిచేసుకోలేదని వాళ్లు అనుకున్నారు. 'ప్రతి ఒకరూ యుద్ధానికి సంబంధించిన కొన్ని స్మృతి చిహ్నాలను యింటికి తెచ్చుకున్నారు, కాని నేను భర్తని తెచ్చుకున్నాను... నాకొక కూతురు కూడా వుంది. ఇప్పుడు నా మనుమలూ, మనమరాళ్లూ పెరుగుతున్నారు...' అని నేను చెప్పాను. నాకు యింకా ఎక్కువమంది పిల్లలు వుండివుంటే నేను సంతోషించేదాన్ని, కాని

అందుకు నాకు ఆరోగ్యం గాని, బలం గాని, ఆర్థిక స్తోమత గాని లేదు. చేసేదేం వుంది? నేను ఉన్నత విద్యే పొందలేకపోయాను. నేనొక పోలీటెక్నికల్ కాలేజిలో లేబరేటరీ అసిస్టెంటుగా పనిచేశాను. నా పనంటే నాకు యిష్టం. నేనెప్పుడూ యువ జనం మధ్య వున్నాను. యువత నిలుపుకోడానికి అది తోడ్పడుతుంది...

''రెండేళ్ల క్రితం మా ఛీఫ్ ఆఫ్ స్టాఫ్ గ్రింకో ఇవాన్ నన్ను చూసేందుకు వచ్చాడు. అతను అప్పటికే రిటైరైపోయాడు. మేమిదిగో యీ టేబిల్ దగ్గరే కూర్చున్నాం. నేనప్పుడు కూడా కాసిని బెర్రీ పైలు చేశాను. అతను నా భర్తతో మాట్లాడాడు. వాళ్లు పరస్పరం ఒకరికొకరు తమ స్మృతులు చెప్పుకున్నారు. మాటల సందర్భంలో మా అమ్మాయిల్ని గురించి కూడా ప్రస్తావించారు.''

నేను వెళ్లిపోయేటప్పుడు, నేనెంత వద్దన్నా వినకుండా, వలెంతీనా చుదాయెవా నాకు బెర్రీ పైలు పొట్లం కట్టి బలవంతాన యిచ్చింది. ''ఇవి ప్రత్యేకమైనవి – సైబీరియన్‌వి'' అని ఆమె రెట్టించింది. తన సహయోధురాండ్ర పేర్లు, చిరు నామాలు, టెలిఫోన్ నంబర్ల ఓ పెద్ద జాబితా కూడా ఆవిడ నాకు యిచ్చింది...

# "అది నేను కాదు..."

నేను ఇంటర్వ్యూ చేసిన ప్రతి స్త్రీకీ ఆమె స్వంత భవితవ్యం వుంది. మాస్కోలో 65వ సైన్యానికి చెందిన యుద్ధ వెటరన్ల సమావేశంలో నేను ఒమేల్చెంకొ ఓల్గాని కలుసుకున్నాను. ప్రతి ఒక్కరూ వసంతకాలపు లేత రంగు దుస్తులు వేసుకొని, మెరిసే రుమాళ్లు కట్టుకోగా, ఆవిడ మిలిటరీ యూనిఫారం వేసుకుంది. ఎందుకో గాని ఆవిడ ముఖం నాకు అసాధారణమైనదిలా అనిపించింది. గతం ఆవిడ ముఖంలో చెరగని ముద్రవేసింది. కాల క్రమంలో అది కొద్దిగా మాత్రమే మెత్తబడింది. నన్ను ఆమెకు పరిచయంచేశారు. దరిమిలా నేనామెను ఆమె వుండే పోలొత్స్క నగరంలో కలుసుకున్నాను.

ఆవిడ ఒంట్లో బాగా లేదు. అయినా పడక నుంచి లేస్తానని ఆమె పట్టుబట్టింది.

''ఏమిటి మీరనేది, 'మరో సారా'? మా తరంవాళ్లు ఒక్కొక్కళ్లే అప్పుడే రాలిపోతున్నారు... వీన్నిత్సలో వుండే నా స్నేహితురాలి చిరునామా మీకు యివ్వ బోతున్నాను. యుద్ధ రంగంలో మేమిద్దరం కలిసి పోరాడాం – కాని నిన్ననే ఫోన్ చేసి, ఆమె చనిపోయిందని చెప్పారు. యుద్ధం మాలో ప్రతి ఒక్కరి ఆయుర్దాయం లోనూ కోతపెట్టింది.''

నేను ఇంటర్వ్యూ చేసినవారిలో కొందరినుంచి ''మీరు మరీ ఆలస్యంచేశారు!''

అన్న గర్భితమైన మందలింపు వినడం నాకు యిదే మొదటిసారి కాదు. నేను రాసిన కొన్ని ఉత్తరాలు కవరుమీద ''చిరునామాదారు లేరు'' అన్న మాటలతో తిరిగివచ్చిన సందర్భాలు నాకు గుర్తున్నాయి. చాలా సందర్భాల్లో జరిగినట్లు ''చిరునామాదారు అడ్రెస్సు మారింది'' అని కాక, ''చిరునామాదారు లేరు'' అన్న మాటలతో తిరిగి వచ్చాయి. విశ్వాంతరాళంలో ఏదో ఒక మానవ స్వరం మలిగిపోయింది, ఏదో ఒక మానవ స్మృతి కరిగిపోయింది.

ఓల్గా అనుకోనంత ప్రశాంతంగా, దాదాపు ఉద్వేగరహితంగా మాట్లాడింది. మొదట్లో నేను దీన్ని అర్థంచేసుకోలేకపోయానో లేక అవగాహన చేసుకోలేకపోయానో తెలియదు. ఈ అంశం నన్ను వేధించింది. ఎందుకంటే నేను తమ కథలను చెప్పే వాళ్ల కన్నీళ్లు పెట్టుకోడానికి అలవాటు పడివున్నాను. అప్పుడు గాయం ఎక్కడుందో సరిగా అర్థంచేసుకున్నాను. కాని ఆ ఉద్వేగరహితమైన, నిస్తేజమైన కళ్లలో ఎక్కడో చాలా లోతుగా బాధ మరుగుపడివుంది...

ఒమేల్చెంకొ ఓల్గా, అప్పట్లో ఒక రైఫిల్ కంపెనీలో మెడికల్ ఆర్డర్లీ.

''మా ప్రాంతంనుంచి అందరూ ఖాళీచేసి వెళ్లిపోయేటప్పుడు మా అమ్మ నన్ను తనతో తీసుకెళ్లాలని అనుకుంది. నేను యుద్ధ రంగానికి వెళ్లాలని ఆత్రం చెందుతున్న సంగతి ఆవిడకి తెలుసు. అందుకని నన్నామె మా సామాన్లున్న బండికి కట్టిపడేసింది. కాని నేను రహస్యంగా ఆ పగ్గం విప్పుకొని, యింకా మణికట్టుకి ముడేసి వున్న ఆ పగ్గంతోనే తప్పించుకు వెళ్లిపోయాను.

''ప్రతి ఒకరూ సాగిపోతున్నారు – కొందరు బళ్లమీద, కొందరు పరుగెడుతూ... నేనెక్కడికి వెళ్లాలి? దోవలో అమ్మాయిల బృందమొకటి తటస్థపడింది. వాళ్లలో ఒకమ్మాయి 'మా అమ్మ యిక్కడకి దగ్గర్లో వుంది. అక్కడికి పోదాం పదండి' అంది. మేమక్కడికి పొద్దుపోయి చేరుకుని, తలుపు తట్టాం. ఆమె తల్లి తలుపు తీసి, మాకేసి చూసి 'అక్కడే వుండండి' అంది. మేమందరం దుమ్ము కొట్టుకుని వున్నాం, మా బట్టలు బాగా చీలికలు వాలికలై వున్నాయి. అందుకని మేము గుమ్మం దగ్గరే నిలబడ్డాం. ఆవిడ పెద్ద యినుప డమ్ములు తీసుకొచ్చింది. మా అందరిచేతా బట్టలు విప్పించింది. మేము సబ్బుకి బదులు పొయ్యి బూడిదతో తలలు అంటుకొని, తర్వాత వెచ్చటి బట్టీ పైకి ఎక్కాం. నేను వెంటనే నిద్రలో కూరుకుపోయాను. పొద్దున్న ఆ అమ్మాయి తల్లి కాబేజి సూపు కాచింది. తవుడూ, బంగాళదుంపలూ కలిపి రొట్టె కాల్చింది. ఆ రొట్టే, ఆ సూపూ మాకెంతో రుచిగా, ఘుమఘుమలాడుతూ వున్నాయనిపించింది!

''మేము ఆవిడ యింట్లో నాలుగు రోజులు వున్నాం, ఆవిడ మాకు తిండి

పెట్టింది, మేము ఒకే సారి 'అతిగా తిని, చావకుండా' వుండేందుకని చెప్పి, ఆవిడ మాచేత కొంచెం కొంచెంగా ఎక్కువ సార్లు తినిపించింది. ఐదవ రోజున ఆమె 'ఇంక పొండి!' అంది. అంతకి కొంచెం ముందు పొరుగావిడ ఒకత్తె ఆమె దగ్గరకి వచ్చింది. మేమప్పుడు నెగడిమీద కూర్చుని వున్నాం. మా స్నేహితురాలి తల్లి మమ్మల్ని మాట్లాడవద్దని సైగచేసింది. తన కూతురు వచ్చినట్లు ఆవిడ తన యిరుగు పొరుగువాళ్లకి సైతం చెప్పలేదు. ఆవిడ అందరికీ తన కూతురు యుద్ధ రంగంలో వున్నట్లు చెప్పింది. ఆవిడకి ఉన్న సంతానమల్లా ఆ ఒక్క అమ్మాయే. కాని ఆవిడకి ఆమెమీద జాలి లేదు. తిరిగిరావడం ద్వారా ఆమె తనకి అవమానం కలిగించినందుకు ఆవిడ ఆమెను క్షమించలేకపోయింది.

''రాత్రి పూట ఆమె మమ్మల్ని లేపి, ఒక్కొక్కరికి ఒక్కొక్క తిండి పొట్లం యిచ్చి, యింక 'పొండి!' అంది.''

''మరి ఆవిడ తన కూతుర్ని యింటి దగ్గర ఉంచేసేందుకు ప్రయత్నించలేదా?''

''లేదు, ఆవిడ తన కూతుర్ని ముద్దుపెట్టుకొని, 'మీ నాన్న యుద్ధంచేస్తున్నాడు, అందుకని నువ్వు కూడా పోయి యుద్ధంచేయాలి' అని చెప్పింది.

''మేము తిరిగి వెళ్తున్నప్పుడు దోవలో ఆ అమ్మాయి తను శిక్షణ పొందిన నర్సుననీ, తన దళం చుట్టుముట్టడింపబడిందనీ చెప్పింది.

''నేను ఒక చోటునుంచి మరో చోటుకి పోతూ, చివరకి తంబోవ్ నగరం చేరుకున్నాను. అక్కడ నాకు మిలిటరీ ఆస్పత్రిలో ఉద్యోగం దొరికింది. రోజుల తరబడిగా పస్తుల తర్వాత, నా బరువు పెరగడం మొదలైంది. అంతేకాదు, నేను బొండాంలా తయారయ్యాను. నాకు పదహారేళ్ల వయస్సులో, అందరు నర్సులూ, డాక్టర్లు మాదిరిగానే నేను కూడా రక్తదానం చెయ్యవచ్చునని చెప్పారు. దానితో నేను నెలనెలా రక్తదానం చెయ్యడం మొదలెట్టాను. అందుకుగాను నాకు రక్తదానం చేసేవాళ్లకి బలం తిరిగి పుంజుకొనేందుకు యిచ్చే రేషన్ — ఒక కిలో పంచదార, ఒక కిలో ముతక గోధుమ నూక, ఒక కిలో సాసేజి — యిచ్చేవారు. న్యూరా అనే ఒక నర్సుతో నాకు స్నేహం అయింది. న్యూరా ఆంటీకి ఏడుగురు పిల్లలు. ఆమె భర్త యుద్ధ రంగంలో యుద్ధారంభంలో మరణించాడు. ఆమె పెద్ద కొడుకు వయస్సు ఏడేళ్లు. వాడే బజారు సరుకులు తెచ్చేవాడు. ఓరోజున వాడు రేషన్ కార్డులు పారేశాడు. నేను నా రక్తదాతల రేషన్ వాళ్లకివ్వాలని నిర్ణయించుకున్నాను. నేను నెలకి పట్టుకి అర్ధ లీటరు చొప్పున రెండు సార్లు రక్తం ఇచ్చేదాన్ని. ఓ రోజున ఆస్పత్రి డాక్టరు 'నీ అడ్రెస్ రాద్దాం, బహుశా నీ రక్తం పొందే వ్యక్తి నీకు ఎప్పుడైనా ఉత్తరం రాయవచ్చు' అన్నాడు. మేము మా అడ్రెస్సు రాసిన కాగితం ముక్కని నా రక్తం వున్న సీసాకి అంటించాం.

''కొంత కాలానికి – రెండు నెలలు పూర్తి కాలేదు – నేను డ్యూటీ ముగించుకొని వచ్చి పడుకున్నాను. అకస్మాత్తుగా నన్ను లేపి, యిలా చెప్పారు:

'''లే, మీ అన్న వచ్చాడు.'

'''మా అన్నేమిటి? నాకు అన్న ఎవడూ లేడే!' అన్నాను.

''మా నర్సుల క్వార్టర్సు పై అంతస్తులో వున్నాయి. నేను కిందికి వెళ్లి చూసేసరికి నా ఎట్టయెదుట అందమైన ఒక యువకుడు నిలబడివుండటం చూశాను. నేనిలా అడిగాను:

'''ఒమేల్చెంకొని చూట్టానికి వచ్చిందెవరు?'

'''నేను' అని, డాక్టరూ, నేనూ కలిసి రాసిన చీటీని నాకు అతను చూపించాడు. 'సరే... నేను నీ రక్తం పంచుకున్న అన్నని.'

''అతను నాకోసం రెండు ఆపిల్సూ, ఓ చిన్న స్వీట్ల పాకెట్టూ తెచ్చాడు – అప్పుడు స్వీట్లు కొనడం దుస్సాధ్యంగా వుండేది. అబ్బ, ఆ స్వీట్లు ఎంత రుచిగా వున్నాయని! నేను ఆస్పత్రి అధికారి దగ్గరకి వెళ్లి, 'నన్ను చూసేందుకు మా అన్నయ్య వచ్చాడు...' అని చెప్పాను. నాకు లీవు యిచ్చారు. అతను 'పద, థియేటరుకి వెళ్దాం' అన్నాడు. అంతకు ముందు నేనెప్పుడూ థియేటరుకి వెళ్లలేదు. చూసుకోండి: నేను థియేటరుకి వెళ్తున్నాను, అందులోనూ ఒక యువకుడితో!'

''అతను కొద్ది రోజుల్లో వెళ్లిపోవలసివుంది. అతను వొరోనెజ్ రంగానికి వెళ్లాలి. అతను వీడ్కోలు చెప్పేందుకు వచ్చినప్పుడు నేను కిటికీ తెరిచి, చెయ్యి ఊపాను. నాకు మళ్లీ లీవు తీసుకునే అవకాశం లేకపోయింది. నేను శుశ్రూష చెయ్యవలసిన క్షతగాత్రులు చాలామంది వున్నారు.

''నాకెన్నడూ ఏ ఉత్తరాలూ రాలేదు. అసలు ఉత్తరం అందుకోవడమంటే ఎలా వుంటుందో కూడా నాకు తెలియదు. అకస్మాత్తుగా నా పేరిట త్రికోణాకారంలో మడత పెట్టిన ఒక ఉత్తరం వచ్చింది. నేను ఆ ఉత్తరం విప్పి చదివాను: 'మీ స్నేహితుడు, మెషీన్ గన్ ప్లెటూన్ కమాండరు వీరమరణం పొందాడు'. అతను నా రక్తం పంచుకున్న అన్న. అతనొక అనాథ శరణాలయంలో పెరిగాడు. అతనికి ఉన్నదల్లా నా అడ్రెస్సు ఒక్కటే అయివుంటుందనడం స్పష్టం. అతను వెళ్లేటప్పుడు, నన్ను ఆ ఆస్పత్రిలోనే ఉండమనీ, అలా అయితేనే యుద్ధం ముగిశాక నన్ను కనుక్కోవడం తనకి తేలిక అవుతుందనీ చెప్పాడు. ఒక్క నెల గడిచిందో లేదో అతను మరణించాడన్న దుర్వార్త నాకు తెలిసింది. నేను బెంబేలెత్తిపోయాను. యుద్ధ రంగానికి పోయి, అతని చావుకి బదులు తీర్చుకోవాలని నిర్ణయించుకున్నాను. ఎక్కడో నా రక్తమే చిందింపబడినట్లు నాకు అనిపించింది...

''అనుకున్నంత తేలిక కాదు పని జరగడం... ఆస్పత్రి అధికారికి నేను మూడు

దరఖాస్తులు పెట్టాను. తర్వాత నేను ఆయన్ని స్వయంగా కలుసుకునేందుకు వెళ్ళి, 'నన్ను మీరు వెళ్ళనివ్వకపోతే, నేను పారిపోతాను' అని చెప్పాను.

'' 'సరే, నువ్వు అంత మొండి పట్టు పడితే నీకు సిఫారసు ఉత్తరం యిస్తాను...'

''నా అనుభవాలన్నింట్లోకీ అత్యంత భయంకరమైనది నా మొదటి యుద్ధం. కాల్పులతో భూమ్యాకాశాలు దద్దరిల్లాయి. నా గుండె బద్దలైపోతున్నట్లూ, నా చర్మం పగిలిపోతున్నట్లూ అనిపించింది. నా చుట్టూ వున్న ప్రతీదీ చిటపటలాడు తోంది, భంభం అంటోంది. నా కాళ్ల కింద నేల కంపిస్తోంది, నేనదంతా భరించ లేకపోయాను... నేను తట్టుకోలేననుకున్నాను... నేను విపరీతంగా భయపడి పోయాను. తర్వాత నేనొక నిర్ధారణకి వచ్చాను: భయానికి చోటిచ్చి నన్ను నేను నవ్వుల పాలు చేసుకోకూడదనుకున్నాను. నేను నా కమ్సొమోల్ కార్డు తీసుకుని, గాయ పడిన ఒక సైనికుడి రక్తంలో ముంచి, దాన్ని నా జేబులో పెట్టుకొని, గుండీలు బిగించాను. నేనలా చేస్తూ, అన్నీ సహిస్తాననీ, ధైర్యం కోల్పోననీ నాకు నేను ప్రమా ణంచేసుకున్నాను. ఎందుకంటే, మొదటి పోరాటంలో పిరికితనం చూపితే, ముందు ముందు నేను ఒక్క అడుగు కూడా ముందుకి వెయ్యలేనని నాకు నేను నచ్చచెప్పు కొన్నాను. అప్పుడిక నన్ను అగ్రశ్రేణినుంచి తప్పించి వెనకవున్న ఫస్ట్ ఎయిడ్ విభాగానికి పంపేస్తారు అనుకున్నాను. నేను అగ్రశ్రేణిలో వుండాలనీ, నా రక్తం చిందింపబడ్డందుకు స్వయంగా పగతీర్చుకోవాలనీ నేను కోరుకున్నాను. మేము దాడిచేస్తున్నాం, నడుమెత్తు ఒత్తుగా పెరిగిన గడ్డిలో చొరుచుకు వెళ్తున్నాం... ఆ భూమి కొన్ని ఏళ్ల తరబడి సాగులో లేదు. దాని గుండా పోవడం కష్టంగా వుంది. అది కూర్స్క్ యుద్ధ రంగం...

''పోరాటం ముగిశాక నన్ను మా దళపు ఛీఫ్ ఆఫ్ స్టాఫ్ రమ్మన్నాడు. సగం ధ్వంసంచెయ్యబడి లోపల ఖాళీగా వున్న గుడిసెను నేను సమీపించాను. నేను లోపలకి వెళ్ళాను. అక్కడ ఒకే కుర్చీ వుంది. ఆయన నన్నా కుర్చీమీద కూర్చోమని, యిలా అన్నాడు:

'' 'నీకేసి చూస్తూంటే నాకు ఏమని అనిపిస్తోందో తెలుసా: నువ్వా నరకంలోకి వెళ్లేలా నిన్ను ప్రేరేపించింది ఏమిటబ్బా? నువ్వొక దోమలా చంపెయ్యబడతావు. నీకు తెలుసు కదా, ఇది యుద్ధం. కనీసం ఫస్ట్ ఎయిడ్ విభాగంలోకి నిన్ను నేను బదిలీచెయ్యనియ్యి. నువ్వు చచ్చిపోతే ఒకటి, ఒక వేళ నీకు ఏ కళ్ళో, చేతులో పోయా యనుకో అది మరొకటి. నువ్వా విషయం ఆలోచించావా?'

'' 'నేను ఆలోచించాను క్రామ్రేడ్ కల్నల్' అని నేను జవాబిచ్చాను. 'నాది ఒక్కటే కోర్కె — దయచేసి నన్ను కంపెనీలో ఉండనియ్యండి.

'''సరే, వెళ్లు!' అంటూ ఆయన అకస్మాత్తుగా అరిచాడు. నేను తుళ్ళిపడ్డాను కూడా.

''చాలా తీవ్రమైన పోరాటాలు జరిగాయి. నేను బాహాబాహీ యుద్ధంలో పాల్గొన్నాను... అది భయంకరమైనది. జనం మరీ... అది మనుషులు చెయ్యవలసింది కాదు... మనుషులు తన్నుతారు, బయనెట్లతో పొట్టలో, కళ్లల్లో పొడుస్తారు. ఒకళ్ల పీక మరొకళ్లు పుచ్చుకొని, నులిమేసేందుకు ప్రయత్నిస్తారు. మనుషులు పెడబొబ్బలు పెడతారు, గావు కేకలు వేస్తారు, మూలుగుతారు... యుద్ధంలో అయినా యిదంతా పరమ భయంకరం. అది అత్యంత భయంకరమైంది. నేను యివన్నీ అనుభవంలో చూశాను. నాకు యివన్నీ తెలుసు. పైలట్లకీ, టాంకు సైనికులకీ, శతఘ్ని దళ సైనికులకీ పోరాటం భారమైనదే — ఆ మాటకొస్తే అది ప్రతి ఒకరికీ భారమైనదే — కాని మిగతావాళ్లతో పోలిస్తే, పదాతి సైనికులకి అది సాటిలేనంత భారతరమైనది...

''తను భయపడలేదు అని ఎవరైనా చెప్తే, నేనతన్ని నమ్మను. జర్మన్లు లేవడం, నీవంక ముందడుగేస్తూ రావడం నువ్వు చూస్తావు. ఐదునుంచి పది నిముషాల్లో దాడి మొదలవుతుంది. నువ్వు వణక నారంభిస్తావు... కాని ఆ వణుకు మొదటి కాల్పులదాకా మాత్రమే వుంటుంది. మరి నీకు ఆజ్ఞ వినిపించాక, నీకింక మరేమీ గుర్తుండదు. నువ్వు మిగిలినవాళ్లతోబాటు లేచి, పరుగెత్తడం మొదలు పెడతావు. అప్పుడిక నువ్వు భయపడటం మానేస్తావు. కాని ఓ రోజు గడిచాక నువ్వింక నిద్రపోలేవు. నీకు భయం వేస్తుంది. నువ్వు వివరాలన్నీ గుర్తుచేసుకుంటావు. నువ్వు చంపెయ్యబడి వుండవచ్చునన్న విషయం గ్రహిస్తావు. దానితో నీకు విపరీతమైన భయం కలుగుతుంది. దాడి ముగిసీ ముగియగానే సైనికుల ముఖాలకేసి చూడకుండా వుండటం మంచిది: అవి పూర్తిగా భిన్నమైన ముఖాలు, మనుషుల ముఖాలు కావు. అవెలా వుంటాయో నేను వర్ణించలేరు. వాళ్లంతా కొంచెం పిచ్చెక్కినవాళ్లలా కనిపిస్తారు. వాళ్లకేసి చూసేందుకు భయం కలుగుతుంది...

''మరి చావు అంటే నేను భయపడ్డానా? నిస్సందేహంగా భయపడ్డాను. కాని అదే సమయంలో, అలాంటి తరుణంలో చచ్చిపోవడం కూడా చరిత్రే అన్న విషయం మేము అర్థంచేసుకున్నాం. నా మటుకు నేను అలా అనుకున్నాను. నేను బతికే వున్నాను అన్న విషయాన్ని నేనిప్పటికీ నమ్మలేను. గాయపడ్డాను, షెల్ తగిలి స్పృహ కోల్పోయాను నిజమే, కాని బతికివున్నాను...

''యుద్ధం ముగిసినప్పటికి నేను తీవ్రంగా జబ్బు పడ్డాను, నన్ను ఒక ఆస్పత్రి నుంచి మరో ఆస్పత్రికి తరలించారు. చివరకి ఒక వృద్ధ ప్రొఫెసరు నన్ను పరీక్షించి, నాకు వైద్యంచెయ్యడం మొదలుపెట్టాడు. నేనే కనుక పద్దెనిమిది లేక

పంధొమ్మిదేళ్ల వయస్సులో యుద్ధ రంగానికి వెళ్లివుంటే నా శరీరం దాన్ని తట్టుకో గలిగివుండేదనీ, అందుకు భిన్నంగా నేను పదహారేళ్లకే బాగా లేత వయస్సులోనే యుద్ధంలోకి వెళ్లిన మూలంగా నా శరీరం బాగా దెబ్బతినిపోయిందనీ చెప్పాడాయన.

“‘వైద్యం, మందులూ వున్నాయి, అవి మిమ్మల్ని మీ కాళ్లమీద మళ్లీ నిలబెట్టగలవనుకో, కాని మీరు తిరిగి మీ ఆరోగ్యం పుంజుకొని, పూర్తి బతుకు బతకాలనుకుంటే, మీకు నా సలహా యేమిటంటే, మీరు పెళ్లిచేసుకొని, సాధ్యమైనంత మంది పిల్లల్ని కనండి. అదొక్కటే మిమ్మల్ని కాపాడగలదు. ఒక్కొక్క బిడ్డ పుట్టేకొద్దీ మీ శరీరం పునరుజ్జీవితమవుతుంది...’ అని సలహా యిచ్చాడాయన.”

“అప్పటికి మీ వయస్సెంత?”

“యుద్ధంనుంచి తిరిగివచ్చే నాటికి నాకు పంధొమ్మిదేళ్లు. అప్పటికి నేను పెళ్లి విషయం ఆలోచించడం లేదనుకోండి.”

“ఎందుకు?”

“నేను చాలా అలసిపోయాను. నా వయస్సు యువతీ యువకులకంటె నేను చాలా పెద్దదాన్ని అనిపిస్తూండేది నాకు. నేను ముసలిదాన్నని కూడా నాకు అని పించేది. నా స్నేహితురాళ్లు డాన్స్ పార్టీలకు వెళ్తూ ఉల్లాసంగా ఉండేవారు, కాని నేను అలా ఉండలేకపోయాను. నేను అప్పటికే భిన్నంగా కనిపించేదాన్ని. అది పైకి కనిపించేది కాదు. యువకులు నన్ను ఆకర్షించేందుకు ప్రయత్నించేవారు. కాని నా హృదయం శిథిలమైపోయింది. నేను తట్టుకున్నదాన్ని ప్రతి మగాడూ తట్టుకొని వుండ గలిగేవాడు కాడు... ఆపరేషన్ గుడారం... దానిలో కొట్టివేసిన చేతులు, ముంజే తులు, కాళ్లు, మిగాళ్లు కుప్పవెయ్యబడిన ఒక చోటు వుండేది. ఒక రోజున నా వెంట ఒక ఆఫీసరు ఆ గుడారంలోకి వచ్చాడు. ఆయనకి ఒక బాండేజి కావలసి వచ్చింది. ఆయన లోపలకి వచ్చి చూశాడు.... అంతే, మరుసటి క్షణం మూర్ఛపోయి నిలబడ్డ చోటే పడిపోయాడు. ఒక మగాడు దాన్ని తట్టుకోలేకపోయాడు...

“పోతే, సేవ్స్క పొలిమేరల్లో జరిగిన పోరాటాలు తీసుకోండి... ఒక్క రోజున యుద్ధ భూమినుంచి యాభై ఏడుగురు క్షతగాత్రుల్ని నేను మోసుకొచ్చాను. దీన్ని గురించి రాయబడ్డ మా యుద్ధ రంగ వార్తాపత్రిక కాపీ ఒకటి యింకా నా దగ్గర వుంది. అందులో నన్ను గురించీ, 118వ రైఫిల్ రెజిమెంటు గురించీ, 37వ గార్డుల డివిజన్ గురించీ రాశారు. అది చాలా తీవ్రమైన పోరాటం. ఎంత విపరీతమైన ఒత్తిడి కలిగించిన పోరాటమంటే, మా చెవుల వెంట రక్తం కారింది. ఆ మరుసటి ఉదయం నేను లేచేసరికి ఖాయిలాపడ్డ తర్వాత లేచినట్లుంది...”

“మీరు పెళ్లిచేసుకున్నారా?”

''చేసుకున్నాను. ఐదుగురు కొడుకుల్ని కని, వాళ్లని పెంచాను. నాకు అప్పుడే మనుమలు వున్నారు. అంచేత నేను మరీ చెడ్డ తల్లిని గాని, బామ్మని గాని కానను కోండి. కాని నేను యుద్ధంనుంచి తిరిగిరాగానే, అందుకు నాకు తగిన శక్తి లేదని అనుకున్నాను.

''ఇప్పుడు నేను అవన్నీ గుర్తుచేసుకొంటూ వుంటే, ఆ అమ్మాయిని నేను కాననీ, మరెవరో చిన్నమ్మాయి అనీ నాకు అనిపిస్తుంది...''

నా హృదయం మెప్పుదల, విభ్రాంతి, ఆశ్చర్యం, కోపం, బాధ, సానుభూతి వంటి పరస్పర విరుద్ధ అనుభూతులతో నిండిపోయింది. ఈ అనుభూతులు నేను మాట్లాడుతున్న ఆమె ముఖంవైపు మరింత సన్నిహితంగా చూసేలా, ఆమె స్వరాన్ని మరింత శ్రద్ధగా వినేలా చేసింది. ఏక కాలంలో గతంలోనూ, వర్తమానంలోనూ, అంటే రెండు కాల పరిధుల్లో జీవించే యీ వ్యక్తుల భావాలు ఎలా వుంటాయో అని అబ్బురపడ్డాను. మనం ఊహ సారించి మాత్రమే తెలుసుకోగలవాటిని వీళ్లు అనుభవంలో ప్రత్యక్షంగా చూశారు. కాని మనం వాటిని తెలుసుకు తీరాలి!

భారమైన యీ స్మృతుల వాహకులపట్ల కాదు మన జాలి, మనపట్లనే, నిజంగా జాలిపడాలంటే, యీ క్రూరమైన సమాచారంనుంచి మనం పారిపో కూడదు, దానిలో పాలుపంచుకోవాలి, దాంట్లో కొంత భాగాన్ని మనం కూడా జీర్ణించు కోవాలి. అంతే కాదు, యిది మార్చరాని ఒక చారిత్రక యథార్థ పత్రం, ఇది 1941–42, 43, 44, 45 సంవత్సరాల పత్రాల్లో రక్తంతో, ప్రాణాలతో లిఖించబడిన పుట...

యుద్ధం అంటే కాల్పులు జరపడం, బాంబులు పడెయ్యడం, దాడులు జరపడం, కందకాలు తవ్వడం మాత్రమే కాదు. యుద్ధమంటే బట్టలు ఉతకడం, వంటచెయ్యడం, బ్రెడ్డు కాల్చడం కూడా. మిషూతినా అలెక్సాంద్రా, అప్పట్లో ఆస్పత్రి అటెండెంట్. ఆమె యిలా చెప్పింది: ''యుద్ధంలో మన ఆడాళ్లకి చేసేం దుకు బోలెడు పనులున్నాయి.'' సైనికుడికి బూట్లు ఇవ్వాలి, దుస్తులు యివ్వాలి, తిండి పెట్టాలి, అతని దుస్తులు ఉతకాలి. అప్పుడే అతను సిసలైన యోధుడవు తాడు. చరిత్రలో ఎన్నో సైన్యాలు ఆకలి, అపరిశుభ్రతల మూలంగా ఓడింపబడిన సందర్భాలు ఉన్నాయి. సైన్యం పురోగమించింది, దాని వెంట ''సెకండ్ ఫ్రంట్'' అంటే చాకళ్లు, బేకర్లు వెళ్లారు. మిషూతినా అలెక్సాంద్రాతో మాట్లాడిన తరు వాత సైనికేతరులుగా యుద్ధంలో పాల్గొన్న స్త్రీలను గురించి తెలుసుకోవాలని నిశ్చయించుకున్నాను.

...యుద్ధంలో వంటకత్తెగా పనిచేసిన ప్రైవేట్ మసకోవ్‌స్కయా అలెక్సాంద్రా నేనామెను కలుసుకున్నప్పుడు ఆశ్చర్యం, తత్తరపాటు పొందింది.

''మేము యుద్ధంలో తుపాకులు కాల్చలేదు. నేను తుపాకి పట్టుకొనే లేదు. నేను సైనికులకి వంటచేశానంతే. ఆ పనికి నాకొక మెడల్ యిచ్చారు. నిజానికి ఆ మెడల్ పొందేందుకు నేను అర్హురాలినని నుకోను. నేను పోరాడలేదు కదా, ఏమం టారు? ఉత్తినే వంటచేశానంతే. పీపాలూ, గంగాళాలూ అటూ యిటూ లాక్కెళ్ల డం. వాటి దుంపతెగ, అవెంత బరువుండేవనుకున్నా వమ్మాయ్... మా కమాండింగ్ ఆఫీసరు అంటూండేవాడు 'నేనీ గంగాళాలన్నింటికీ చిల్లులు పెట్టేస్తాను... యుద్ధం తర్వాత నువ్వు పిల్లల్నేం కంటావు?' అతనొక రోజున నిజంగానే వాటిమీద కాల్చి, వాటికి చిల్లులు పెట్టేశాడు. దాంతో నేనొక గ్రామంలో అంతకంటె చిన్న పాత్రలు కొత్తవి వెతుక్కోవలసివచ్చింది.

''సైనికులు కందకాలనుంచి మధ్యమధ్య విరామంకోసం వస్తూండేవాళ్లు. వాళ్లందరూ నిస్త్రాణచెంది, దుమ్ముకొట్టుకొని, అలసిపోయి, చేతులూ కాళ్లూ చలి దెబ్బకి కమిలి, కొంకర్లుపోయి వుండేవాళ్లు. ఉజ్బెక్కులకీ, తజిక్కులకీ చలి దెబ్బ మరింత ఎక్కువగా వుండేది. వాళ్లుండే ప్రాంతాల్లో ఎప్పుడూ ఎండకాస్తూ వుంటుంది. ఇక్కడేమో టెంపరేచరు మైనస్ 30–40 డిగ్రీలుంటుంది. వాళ్లు చలికి కొరడుబారిపోయేవాళ్లు. వాళ్లకి చెమ్చాలతో తిండి తినిపించాల్సివచ్చేది.''

మీన్‌స్క్ ప్రాంతంలో ల్యుబాన్ అనే జిల్లా కేంద్రం వుంది. దానికి దగ్గర్లో ఉరేచ్యె అనే పెద్ద గ్రామం ఒకటుంది. నేను వెతుక్కుంటూ వెళ్లి ఆ ఊరులో దెద్కో మరీయానీ, గొర్లాచ్ అన్నానీ కలుసుకున్నాను. వాళ్లిద్దరూ సమష్టి వ్యవ సాయ క్షేత్రంలో పనిచేశారు. వాళ్లిప్పుడు రిటైరై, పెన్షనుమీద జీవిస్తూ మనుమ రాండ్రని చూసుకుంటున్నారు. ఎవరో దూరంనుంచి తమని చూడడానికి వచ్చి ఇంటర్వ్యూ చెయ్యడానికి తగినంత కృషిని తమ జీవితాల్లో సాధించనందుకు క్షమా పణ కోరుకుంటున్నారా అన్నట్లు, వాళ్లిద్దరూ క్లుప్తంగా మాట్లాడారు. వాళ్లు నన్ను పోయి ప్రసిద్ధుడైన ఒక స్థానిక యుద్ధ వెటరన్‌ని కలుసుకొమ్మనీ, ''ఆయ నకి సంచి నిండేటన్ని మెడల్సు, రెండు ఆర్డర్స్ ఆఫ్ గ్లోరీ వున్నాయి, జర్నలిస్టులు ఆయన యింటికి తరచుగా వస్తూవుంటారు'' అని కూడా చెప్పారు. అయితే, వాళ్ల వాదనలన్నింట్లోకీ మిక్కిలి బలమైనది మీన్‌స్క్‌నుంచి సైతం ఒక జర్నలిస్టు రావడం కాదు, సమష్టి వ్యవసాయ క్షేత్ర అధ్యక్షుడు ఆ యుద్ధ వెటరన్‌కి విజయ దినోత్సవం నాడు స్వయంగా వెళ్లి అభినందనలు చెప్పడం.

నేనొక పెరటితోటలో, వసంతకాలపు మెత్తటి గడ్డిమీద, విరగబూసిన చెర్రీ చెట్ల మధ్య కూర్చొని రక్తం గురించీ, చావు గురించీ, యుద్ధ బీభత్సం గురించీ

వినడం, మాట్లాడడం నాకు చిత్రమనిపించింది. ఆ స్త్రీలు చాలా తక్కువ మాట్లాడారు, కాని ఎంతో ఏడ్చారు.

"...నేను కేవలం సైనికుల బట్టలు ఉతికానంతే. విపరీతంగా మాసి, రక్తపు మరకలతో, లుకలుకలాడే పేలతో నిండిన బట్టలు తీసుకొచ్చి పడేస్తూండే వాళ్లు. ఆ తెల్లటి ఓవరాల్సు... శీతకాలపు కేమఫ్లేజ్, మీకు తెలుసు కదా. కాని అవి తెల్లగా వుండేవి కావు, రక్తంతో ఎర్రగా వుండేవి. లేకపోతే ఒక యూనిఫార్మ్ షర్టు వచ్చేది — ఒక చెయ్యి లేనిదో, లేక రొమ్ము సైజు కన్నం వున్నదో, లేకపోతే ఒక కాలు లేని పాంటో వచ్చేది. మేము వాటిని కన్నీళ్లతో ఉతికి, కన్నీళ్లతో జాడించే వాళ్లం. ఆ బట్టల గుట్టలు కొండలంతేసి ఎత్తుండేవి, కొండలంత! అదంతా గుర్తుచేసుకుంటేనే యీనాటికీ నా చేతులు నొప్పెడతాయి. నాకు అవి యిప్పటికీ తరచు కలల్లోకి వస్తూంటాయి. అదంతా మాటల్లో చెప్పడం కష్టం..." (దెద్కో మరీయా, అప్పట్లో ప్రైవేట్, చాకలి).

"సైనికుల బట్టలు ఉతికి, యిస్త్రీ చేసేవాళ్లం — మేము చేసిందల్లా యింతే. దీంట్లో ప్రత్యేకత యేమీ లేదు. మేము గుర్రబ్బళ్లమీద వెళ్లేవాళ్లం. చాలా అరుదుగా తప్ప రైల్లో వెళ్లేవాళ్లం కాము — దాదాపు బెర్లిన్‌దాకా నడిచే వెళ్లామని చెప్పాలి. అంతా గుర్తుచేసుకుని చెప్పాలంటే — ఔను, మేము చెయ్యవలసిందంతా చేశాం. మేము గాయపడ్డవాళ్లని మోసుకెళ్లాం, రోడ్లు లేవు గనుక, ద్నీపరు నదిమీద వున్న ఫిరంగులకి మేము గుళ్లు మోసుకెళ్లాం. గుళ్లను మైళ్ల దూరం మూపుల మీద మోసుకెళ్లాల్సివచ్చేది..." (గొర్లాచ్ అన్నా, అప్పట్లో ప్రైవేట్, చాకలి).

నేను వెళ్లిపోబోయే ముందు మాత్రమే అన్నా "నేను మీకు చాలా తక్కువ చెప్పినట్లున్నాను. మేము అనుభవించినది బోలెడు వుండగా, మీకు నేను చాలా కొంచెం చెప్పాను..." అంది.

నేను ప్రతి ఒక్కర్నీ ఏదైనా విశిష్టమైన విషయం చెప్పమనే ఎప్పుడూ అడుగుతూ వుంటాను. అయినా ప్రతి ఒక్కరూ మొదట్నుంచీ మొదలుపెడుతూ వుంటారు.

"'నీ వయస్సెంత అమ్మాయ్?' సార్జెంట్ మేజర్ అడిగాడు. 'పద్దెనిమిది, అయితే యేమిటి?' 'మాకిక్కడ చిన్నమ్మాయిలు అవసరం లేదు.' 'మీరేది చెయ్యమంటే అది చేస్తాను, చివరకి బ్రెడ్డు కాల్చడమైనా సరే.' అందుకని వాళ్లు నన్ను సిబ్బందిలోకి తీసుకున్నారు" (ఎన్. ముహమెత్‌దీనొవా, అప్పట్లో ప్రైవేట్, బేకర్).

వొల్గొగ్రాడ్ ప్రాంతంలో మిహాయ్‌లొవ్క పట్టణంనుంచి కులకోవా మరీయా ఒక జాబు రాసింది: "నేను టీచర్ ట్రెయినింగ్ కాలేజి కోర్సు పూర్తిచేశాను.

కాని యుద్ధం మూలంగా మాకు టీచరు ఉద్యోగాలు యివ్వలేదు. మమ్మల్ని యిళ్లకి పంపేశారు. నేను యింటికి వచ్చేశాను. కాని కొద్ది రోజులకే సైనిక రిజిస్ట్రేషన్, రిక్రూట్‌మెంటు కార్యాలయంనుంచి నాకు సమను వచ్చింది. అమ్మకి సహజంగానే నేను యుద్ధంలోకి వెళ్లడం యిష్టం లేకపోయింది. నాకు యింతా చేసి పద్ధెనిమిది ఏళ్లే. 'నిన్ను మామయ్యగారింటికి పంపి, నువ్వు యింటి దగ్గర లేవని వాళ్లతో చెప్తాను' అంది అమ్మ. 'కాని నేను కమ్సొమోల్ సభ్యురాలిని' అన్నాను. మమ్మల్నందర్నీ సైనిక రిజిస్ట్రేషన్ కార్యాలయంలో సమావేశపరచి యుద్ధపు అగ్రశ్రేణిలోని బేకరీల్లో పనిచేసేందుకు ఆడాళ్ళు కావాలని చెప్పారు.

"...అది చాలా భారమైన పని. మేము ధ్వంసంచెయ్యబడిన ఒక గ్రామానికో, పట్టణానికో వెళ్లి బేకరీలు నెలకొల్పేవాళ్లం. అప్పుడింక కట్టెలు, ముప్ఫయ్ నలభై బకెట్ల నీళ్లు, ఐదారు బస్తాల గోధుమ పిండి తేవలసివచ్చేది. మా వయస్సు పద్ధెనిమిదేళ్లు. కాని మేము యిద్దరిద్దరం కలిసి 70 కిలోల పిండి బస్తాలు మొయ్యాల్సి వచ్చేది. ఓ స్ట్రెచ్చరుమీద 40 బ్రెడ్డు లోవ్సు పేర్చి మొయ్యాల్సివచ్చేది. నా మటుకు నేను దాన్ని ఎత్తలేకపోయేదాన్ని. మేము పొయ్యిల దగ్గర రాత్రింబగళ్లు నిలబడేవాళ్లం. ఒక సెట్టు టబ్బుల్లో పిండి మర్దించడం పూర్తి కాగానే, మరో సెట్టు తయారుచేసుకోవలసివచ్చేది. విమాన దాడులు జరిగినా, బాంబులు పడినా కూడా బ్రెడ్డు తయారుచెయ్యడం మేము మానలేదు..."

తాము యేమి సాధించారో అన్న అవగాహన యీ స్త్రీలకి లేదు. తాము చేసిన దాంట్లో "వీరోచితమైనది" యేమీ లేదన్న దృఢమైన నమ్మకంతో వున్నారు. స్త్రీలు సృష్ట్యాదినుంచీ యేమి చేస్తూవచ్చారో అదే, అంటే మగాళ్లకి బట్టలు ఉతకడం, కుట్టడం, వంటచేసి పెట్టడమే తామూ చేశామనీ, దానిలో ప్రత్యేకత ఏముందనీ అంటూవుంటారు. కాని యీ స్త్రీలు – యుద్ధ కాలంలో మహత్తర శ్రమజీవులు – లేనిదే విజయ సాధన సంభవమై వుండేది కాదు.

నెపోలియన్ మాటల్నే పునరుచ్చరిస్తూ, హిట్లర్ తన జనరల్సు దగ్గర "రష్యా యుద్ధ నియమాలకి వ్యతిరేకంగా పోరాడుతోంది" అంటూ మొత్తుకున్నాడు. "యుద్ధ నియమాలకి వ్యతిరేకంగా" అంటే దాడిదారులు జర్మనీకి తరలించాలని సంకల్పించిన ఆహార ధాన్యాలు తగులబెట్టబడ్డాయన్నమాట, సోవియట్ సమాచార శాఖ ప్రచురించిన కరపత్రాలు ఆక్రమిత నగర కేంద్రంలో ప్రత్యక్షమయ్యాయన్న మాట. సునజ్జితమైన దుర్గరక్షక సైనిక దళాలమీద సాహసికమైన గెరిల్లా దాడులు జరిగాయన్నమాట. యుద్ధ రంగానికి తరలివెళ్తున్న శత్రు రైళ్లు రాత్రిపూట

పేల్చివెయ్యబడ్డాయన్నమాట. మనకి తెలిసిన, తెలియని రహస్య, గెరిల్లా వీరుల వందలాది భారీ, చిన్నతరహా సాహసోపేతమైన దాడులన్నమాట.

''ప్రజా యుద్ధపు దుడ్డుకర్ర'' అని లియో టాల్‌స్టాయ్ పిలిచింది సరిగ్గా దీన్నే. మనం ఆ గెరిల్లా యుద్ధపు వాస్తవానుభవాన్ని, ఉదాహరణకి, రహస్య ప్రతిఘటనోద్యమ సభ్యుడుగా వుండి, పోరాటాగ్ని మధ్య కాక, ఏళ్ల తరబడి అనుక్షణ ప్రమాదం, వ్యక్తిగత భద్రతా రాహిత్యాలతో కూడిన మానసిక ఒత్తిడి కింద ఉండటాన్ని ఊహించుకుందాం.

''...మా పట్టణం విముక్తమైన కొత్తలో నేను వీధిలో నడిచినప్పుడల్లా వెనక్కి వెనక్కి చూస్తూండేదాన్ని. నేను బెదురు వదిలించుకోలేకపోయాను... వీధుల్లో కార్లనూ, రైల్వే స్టేషన్లలో రైళ్లనూ లెక్కపెట్టకుండా నేను ప్రశాంతంగా నడవలేకపోయేదాన్ని...'' (వి. జి. సెదోవా, ఒక ఆక్రమిత ప్రాంతంలో రహస్య దళంలో ఆమె పనిచేసింది).

ఒక గ్రామంలోని ఒక పురుషుడు లేక స్త్రీ తను చుట్టూ వున్న ప్రతి ఒక్కరికీ తెలిసివుండి, తన తల్లిదండ్రుల్నీ, తమ్ముళ్లనీ, చెల్లెళ్లనీ బందీలుగా వదిలి గెరిల్లా యోధుల్లో చేరడమంటే అర్థం యేమిటి? యుద్ధ రంగంలోని సైనికుడు ఒంటరిగా వుండేందుకు బదులు, అతని చుట్టూ అతని కుటుంబ సభ్యులు — తన భార్య, చిన్న పిల్లలు, వృద్ధురాలైన తల్లి — ఉన్నారనీ, ఏ క్షణంలోనైనా నాజీ టాంకులు రావచ్చుననీ లేక దిబ్బ వెనుకనుంచి టామీ గన్నుల బారు ఒకటి బయటకి రావచ్చుననీ ఎదురుచూస్తున్నారని ఊహించుకోండి... గెరిల్లా స్థితి అలా వుంటుంది... యుద్ధ రంగంలో సైనికులు తమ సొంత ప్రాణాలను కోల్పోయే ప్రమాదాన్ని మాత్రమే ఎదుర్కోగా, గెరిల్లా దళంలో లేక ఒక రహస్య బృందంలో తన ప్రాణాన్ని ప్రమాదంలో పెట్టుకోవడమంటే తన కుటుంబ సభ్యులందరి ప్రాణాలనూ ప్రమాదంలో పెట్టుకోవడమే. అది అత్యంత భయానకమైన ప్రమాదానికి లేక అత్యంత భయంకరమైన అగ్ని పరీక్షకి సిద్ధపడటం కాక, నిత్య వీరత్వానికి నాంది పలకడమే... ఇదిగో ఆ విషయంలో స్త్రీలు ఏమంటున్నారో చూడండి.

బ్ర్యాన్స్క్ ప్రాంతంలోని ద్యద్కోవ్ జిల్లా ప్రజా అజమాయిషీ కమిటీ అధ్యక్షురాలైన కొంద్రషోవా అంతొనీనాని ఆమె కార్యాలయంలో కలుసుకున్నాను. అప్పటికి ఆఫీసు బైమైపోయింది. భవనంలో స్వరాలూ, హడావిడిగా అటూ యిటూ తిరిగేవాళ్ల అడుగుల చప్పుళ్లూ ఆగిపోయాయి. కారిడార్లో తుడిచి శుభ్రంచేస్తున్న పనికత్తె చేస్తున్న బకెట్ చప్పుళ్లూ, ఇనుప బీరువామీద వున్న చిన్న రేడియోనుంచి అనౌన్సరు స్వరం మాత్రమే వినవస్తున్నాయి.

నేనామెను చూసీ చూడగానే అధికారిక లాంఛనాలతో పనిలేని కలుపుగోలు మనిషిగా వెంటనే గ్రహించాను. నాకామె 35 ఏళ్ల పని రికార్డు వున్న పార్టీ కార్యకర్తలాగ కంటె, తన విద్యార్థుల ఆరాధనని చూరగొన్న ఒక పల్లెటూరి బడిపంతులమ్మలా కనిపించింది.

ఆమె తన మూడు — తెల్ల, ఎర్ర, పసుపుపచ్చ — టెలిఫోన్లకేసి చూసి, "అమ్మయ్య, యిప్పటికివి బబ్బున్నాయి" అంది. సరిగ్గా అదే క్షణంలో టెలిఫోను ట్రింగ్ ట్రింగ్‌మంటూ మోగడం మొదలెట్టింది.

"ఇది మా అమ్మాయి... భోజనానికి నాకోసం ఎదురుచూస్తోంది. సరే, మనం కొంచెం సేపు యిక్కడే ఆగుదాం. నాకు బైలోరష్యానుంచి అతిథులు రావడం అరుదు. అత్యంత ఆనందదాయకమైన అతిథులు: మీ బైలోరష్యాలోని అడవుల్లో గెరిల్లాలతో కలిసి నేను పనిచేశాను..."

కొంద్రషోవా అంతొనీనా బితోవ్, అప్పట్లో గెరిల్లా దళంలో స్కౌటుగా పనిచేసింది. ఆమె యిలా చెప్పింది:

"ఒక వేగు చర్య అనంతరం నేను మా పట్టణంలో ఉండటం యింక ఎంత మాత్రం సాధ్యం కాక, గెరిల్లా దళంలో చేరిన తర్వాత మా అమ్మని గెస్టాపోకి* పట్టుకు తీసుకెళ్లారు. మా తమ్ముడు తప్పించుకుపోయాడు గాని, మా అమ్మని అరెస్టుచేశారు. ఆవిడ కూతురు జాడలు తెలుసుకునే ప్రయత్నంలో వాళ్లు ఆవిణ్ణి హింసలు పెట్టారు. ఆమె అక్కడ రెండేళ్లు గడిపింది. ఆ రెండేళ్ల కాలంలో నాజీలు తదితర స్త్రీలతోబాటు ఆమెని, తాము దాడికో, పర్యవేక్షణకో వెళ్లినప్పుడల్లా తమ ముందు నడిపించుకొని తీసుకెళ్తూండేవాళ్లు. గెరిల్లాలు పాతి పెట్టిన మందుపాతరలంటే వాళ్లు హడిలి చస్తూండేవాళ్లు. అందుకే వాళ్లు తమ ముందెప్పుడూ స్థానికుల బృందమొకదాన్ని తోలుతూండేవాళ్లు. ఏదైనా ఒక ప్రాంతంలో మందు పాతరలు వుంటే, అవి పేలి, స్థానికులు పోతారు, నాజీలు సురక్షితంగా వుంటారు. రెండేళ్లపాటు మా అమ్మని వాళ్లు యిలా వాడుకున్నారు...

"మేము మాటున పొంచివుండి, నాజీల బృందం తమ ముందొక స్త్రీల గుంపును తోలుకెళ్లడం అనేక సార్లు చూశాం. ఆ స్త్రీలు దగ్గర కొచ్చేసరికి వాళ్ల మధ్య వున్న తమ తల్లుల్ని మాలో కొందరు గుర్తుపట్టేవాళ్లు. అన్నింట్లోకీ అత్యంత దారుణమైన విషయం కాల్పులు కాల్చమని కమాండరు యివ్వబోయే ఆజ్ఞకోసం వేచివుండటం. గెరిల్లాలలో ఒకరు 'అదిగో మా అమ్మ అలా వెళ్తోంది' అని గుసగుసగా చెప్తూంటే, మరొకరు 'అదిగో నా చెల్లి వెళ్తోంది' అని చెప్పేవారు. ఇంకొ

---

* గెస్టాపో — నాజీల రహస్య పోలీసు సంస్థ. — సం.

కరు తమ పిల్లల్ని గుర్తుపట్టేవారు... మా. అమ్మ యెప్పుడూ తెల్ల తల రుమాలు కట్టుకొంటుంది. ఆవిడ పొడగరి. అందుకని మొదట ఆమెనే అందరూ గుర్తు పట్టేవాళ్లు. నా మటుకు నేనింకా చూడకపోయినా, 'అదిగో అక్కడుంది, మీ అమ్మ...' అన్న మాట నాకు చేరవెయ్యబడేది. లోగొంతులో యిలా మాట్లాడుకొంటూ, మాలో ప్రతి ఒక్కరం కమాండరు ఆజ్ఞకోసం దిగ్భ్రాంతిలో వేచివుండేవాళ్లం.

''ఆజ్ఞ వినబడగానే మేము కాల్చేవాళ్లం. నేను ఎక్కడ కాలుస్తున్నానో నాకు స్పృహ వుండేది కాదు – ఎంత సేపూ తెల్ల తల రుమాలు నా దృష్టిలోంచి తప్పకోకుండా చూసుకోవడమే సరిపోయేది – అమ్మ యింకా బతికే వుందా, యింకా నిలబడే వుందా? వాళ్లందరూ చెల్లాచెదురయ్యేవాళ్లు, కిందపడిపోయేవాళ్లు, అమ్మ బతికివున్నదీ, లేనిదీ తెలిసేది కాదు. కొన్ని రోజులపాటు పట్నంనుంచి వార్తాహరులు వచ్చి ఆవిడ బతికేవుందని చెప్పేదాకా, నా మనస్సు మనస్సులో వుండేది కాదు. తర్వాత మరో సారి అలాంటి ఘట్టం తటస్థపడేదాకా సాఫీగా గడిచిపోయేది. ఇప్పుడైతే అలాంటి మానసిక ఒత్తిడిని తట్టుకోగలనని నేను అనుకోను, కాని ఆ సంవత్సరాల్లో... బహుశా అప్పుడు నేను వయస్సు రీత్యా చిన్నదాన్ని కనుక తట్టుకోగలిగానేమో, లేకపోతే అప్పటి పరిస్థితుల మూలంగా నేను తట్టుకున్నానో. అది పరిస్థితుల ప్రభావమే అనుకుంటాను...

''1943లో తమ తిరోగమనానికి సరిగ్గా ముందు నాజీలు మా అమ్మని తుపాకితో కాల్చి చంపేశారు... ఆవిడ అసాధారణమైన స్త్రీ. ఆవిడ స్వయంగా 'వెళ్లండి పిల్లలూ, మీరు వట్టినే చచ్చిపోయేందుకు బదులు బతకాలి. మీరు వట్టినే చచ్చిపోవడం నాకు యిష్టం లేదు...' అని నన్ను దీవించింది.

''శత్రువుల్ని చంపాలని ఆవిడ నాకెన్నడూ చెప్పలేదు. ఆవిడకి వేరే మాటలు, ఆమె సొంత మాటలు, ఒక తల్లి మాటలు వున్నాయి. మనం శాంతిగా బతికేందుకూ, చదువుకునేందుకూ – ముఖ్యంగా చదువుకునేందుకు – నాజీలు వెళ్లిపోవాలని అమ్మ చెప్పింది.

''ఆమెతోబాటు జైలుఖానాలో వున్న స్త్రీలు నాకొక విషయం చెప్పారు. ఆమెను బయటకి తీసుకెళ్లిన ప్రతి సారీ 'నన్నొక విషయం బాధిస్తోంది – నేను చచ్చిపోతే, నా పిల్లలకి సాయంచెయ్యండి!' అనేదట వాళ్లతో.

''నేను వెనక్కి తిరిగివచ్చాక, ఆ స్త్రీలలో ఒకామె, తనకి ఇద్దరు చిన్న పిల్లలు వున్నా కూడా, నన్ను చేరదీసింది. నాజీలు మా ఇంటిని తగులబెట్టారు, నా తమ్ముడు కూడా గెరిల్లాలతో చేరి పోరాడాడు. వాడు పోరాటంలో నేలకొరిగాడు. అమ్మని కాల్చేశారు, నాన్న యుద్ధ రంగంలో వున్నాడు. నాన్న యుద్ధ రంగంలో

గాయపడి, అనారోగ్యంతో తిరిగివచ్చాడు. ఆయన బెర్లిన్‌దాకా పోరాడుతూ వెళ్లాడు. కాని దురదృష్టవశాత్తూ ఎక్కువ కాలం బతకలేదు. త్వరలోనే చనిపోయాడు... దానితో నేను ఒంటరిగా మిగిలాను. ఆ స్త్రీ పాపం పేదది, పైగా ఆవిడకి ఇద్దరు పిల్లలు. నేను మరో చోటుకి ఎక్కడికైనా వెళ్లిపోవాలని నిర్ణయించుకున్నాను. ఆవిడ ఏడ్చింది, నన్ను వెళ్లనివ్వలేదు.

''ఇంకో విషయం మీకు చెప్పాలి. అమ్మని కాల్చేశారన్న సంగతి తెలిశాక ఆవిణ్ణి కనుక్కునేదాకా నాకు మనశ్శాంతి ఉండదని గ్రహించాను... వాళ్లని కాల్చేసి, ఓ పెద్ద టాంకు నిరోధక గుంటలో వేసి పూడ్చేశారు. ఆ దిబ్బని మోటారు శకటాలతో చదును చేసేశారు. అందాజుగా ఆవిడ ఎక్కడ నిలబడిందో నాకు చూపించారు. నేనక్కడకి పరుగెత్తుకు వెళ్లి తవ్వడం, శవాలను తిరగెయ్యడం మొదలుపెట్టాను. ఉంగరాన్నిబట్టి అమ్మని నేను గుర్తుపట్టాను... నేనామెను చూసి, గావుకేక పెట్టాను, అంతే, స్పృహ కోల్పోయాను. కొందరు స్త్రీలు ఆమెను పైకి లాగారు, ఓ టిన్నుతో నీళ్లు తెచ్చి ఆమెను శుద్ధిచేశారు. తర్వాత మేము ఆమెని సక్రమంగా పూడ్చి పెట్టాం... నేను ఆ టిన్నుని యిప్పటికీ భద్రంగా దాచివుంచుకున్నాను...

''ఒక్కొక్క సారి రాత్రి పూట నాకు నిద్ర పట్టదు. పక్కమీద పడుకొని నా మూలాన అమ్మ చచ్చిపోయిందని ఆలోచించుకుంటూ వుంటాను. కాదు, నా మూలంగా కాదు... నేను నా బంధువులకోసం భయపడి యుద్ధానికి వెళ్లకపోతే, అలాగే మరొకరూ, మరొకరూ వెళ్లకపోతే, మనం విజయం సాధించివుండేవాళ్లం కాము. అయినా కూడా నా మనస్సులో అలాంటి ఆలోచనలు ముసరనే లేదనీ, నేనా బీభత్సమంతా చూడనే లేదనీ నేను బుకాయించలేను. నాజీలు మా అమ్మని తమ ముందు తోలడాన్ని నేను చూడలేదని గాని, ఆవిడ వస్తున్న దిశగా నేను కాల్పులు జరపలేదని గాని నేను చెప్పలేను. ఇవన్నీ బుర్రలో పెట్టుకుని బతకడం ఎంత దుర్భరమో మీరు ఊహించుకోలేరు. నేను ఎంత ఎక్కువ కాలం బతికితే యిది అంత ఎక్కువ దుర్భరమవుతుంది...''

రహస్య ప్రతిఘటనా, గెరిల్లా పోరాటమూ ప్రత్యేక పోరాట రూపాలు. వాటికి ప్రత్యేక లక్షణాలు అవసరం. ''మనిషి ఏక కాలంలో యిద్దరు వ్యక్తులుగా వుండటం అలవాటు చేసుకోవాలి – ప్రతి ఒకరికీ తెలిసిన వ్యక్తి, కొద్దిమందికి మాత్రమే తెలిసిన వ్యక్తి. ఎంత తక్కువమందికి వీలైతే అంత తక్కువమందికి తెలిసివుండా లన్నది రహస్య పోరాట సూత్రాల్లోకెల్లా మొట్టమొదటిది...'' (ఎ. పి. దెరెవ్యాంకినా, అప్పట్లో ఒక రహస్య దళ సభ్యురాలు). ఆ పోరాటానికి ప్రత్యేకమైన, ఊహాతీతమైన త్యాగాలు అవసరం. ఈ పోరాట సూత్రాల క్రౌర్యం సన్నిహితులకీ, ప్రేమ పాత్రులకీ మధ్య గాఢమైన ముద్రవేసింది. స్త్రీలు గెరిల్లా దళాల్లో సభ్యులు మాత్రమే

కాక తలు లు, భార్యలు, కూతుళ్లు కూడా కనుక, వాళ్లు అత్యంత దారుణమైన అగ్ని పరీక్షలకి గురయ్యారు. వాళ్లు అనుభవించిన మానసిక బాధతో పోల్చుకుంటే, చచ్చిపోవడం ఎంతో తేలిక...

మీన్స్క్‌కి చెందిన ఒక రహస్య సంఘ సభ్యురాలైన సవీత్స్కయా యద్వీగా తన స్మృతులను యిలా పేర్కొంది: ''మేము ప్రతిఘటనోద్యమంలో చేరినప్పుడు, అది ప్రమాదకరమైనదనీ, మేం చంపబడవచ్చుననీ మమ్మల్ని హెచ్చరించారు. నిజానికి మేము బతికివుండే అవకాశం చాలా తక్కువ. కాని మమ్మల్ని గురించి మేమెన్నడూ ఆలోచించలేదు. శత్రువుపట్ల మా మనస్సులే కాక యావత్తు అస్తిత్వం ద్వేషంతో, కోపంతో రగులుతూ వుండేది. మొట్టమొదటి సారిగా ఒక నాజీ నా కంటపడ్డప్పుడు నాకు ఎలెక్ట్రిక్ షాక్ తగిలినట్లు అయింది. నా యావత్తు శరీరమూ బాధతో మెలికలు తిరిగింది. నా శరీరంలో ప్రతి రోమ కూపమూ వాళ్లిక్కడ వుండటం ఎలా తటస్థించింది అని ప్రశ్నించినట్లనిపించింది. మీ మటుకు మీరు అనుభూతిచెందితే గాని – యిదంతా ఎంత విచిత్రమైనదో, నమ్మశక్యం కానిదో మీకు బోధపడదు. కేవలం రెండు రోజుల్లో యుద్ధ పూర్వపు నా వ్యక్తిత్వావశేష మేదీ మిగల్లేదు. నేనొక భిన్న వ్యక్తి నయ్యాను. మాలో ద్వేషం ప్రజ్వలించింది. ఆ ద్వేషం మా ఆత్మీయుల ప్రాణాల విషయంలో భయంకన్న, మా మరణంపట్ల భయంకన్న బలవత్తరమైనది. మేము మా బంధువుల్ని గురించి ఆలోచించకపోలేదు. కాని మాకు మరో ప్రత్యామ్నాయం లేదు. నాజీలు మన గడ్డమీద ఉండటాన్ని మేము ఊహలో కూడా సహించలేకపోయాం...

''గెస్టాపోవాళ్లు నన్ను అరెస్టుచెయ్యబోతున్నారన్న హెచ్చరిక అందగానే, నా 75 ఏళ్ల తల్లిని ఒంటరిగా వదిలి, నేను గెరిల్లా దళంలో చేరేందుకు పారిపోయాను. ఆవిడ గుడ్డిదానిలా, చెవిటిదానిలా నటించాలని నిర్ణయించుకున్నాం. అలా చేస్తే వాళ్లు ఆమె జోలికి పోకపోవచ్చునని మేము ఆశించాం. కనీసం నన్ను నేను అలా ఊరడించుకున్నాను. గెస్టాపోవాళ్లు ఆవిణ్ణి పట్టుకెళ్లవచ్చునని నాకు తెలుసు. కాని పోరాడుతూనే వుండాలన్న, కొన ఊపిరి ఉన్నంతదాకా శత్రువుమీద పగ తీర్చుకోవాలన్న వాంఛ మిక్కిలి ప్రగాఢమైనది...

''నేను పారిపోయిన మరుసటి రోజు గెస్టాపోవాళ్లు మా యింట్లో చొరబడ్డారు. మేము అనుకున్నట్లు అమ్మ చూపూ, వినికిడీ తగ్గినదానిలా నటించింది. వాళ్లామెని నీ కూతురు ఎక్కడుందో చెప్పమంటూ, పాశవికంగా బాదారు. దాని తర్వాత అమ్మ చాలా కాలం జబ్బుపడింది...''

ప్రోమొవా అలెక్సాంద్రా (యుద్ధ కాలంలో అంతోపాల్ అండర్‌గ్రౌండ్ పార్టీ కమిటీ కార్యదర్శి) కథనం యిది:

''నా స్నేహితురాలు సిమకోవా కాత్యాకి యిద్దరు కూతుళ్ళు. ఇద్దరూ చిన్న పిల్లలు. వాళ్లకి ఆరేడేళ్లు వుంటాయనుకుంటాను. వాళ్లని ఆవిడ పట్నంలో నడకలకి తీసుకెళ్తూండేది. ఆ నడకల క్రమంలో శత్రు సైనికుల దళాలు ఎక్కడెక్కడ వున్నాయో కనిపెడుతూండేది. ఏ నాజీ అయినా తనని ఉద్దేశించి అరిస్తే మతిమాలినదానిలా నోరు తెరిచి వెర్రిచూపు చూసేది. అవిడ తన కూతుళ్ల ప్రాణాలకి కూడా తెగించింది...''

''నా తోటి పోరాటకుల్లో మరొకామె జర్ఝూర్స్కయా. ఆమెకి కూడా ఎనిమిదేళ్ల కూతురు వుంది. ఆమె పేరు వలేరియా. ఒక కాంటీన్‌ని పేల్చాలి. మేము స్టౌలో ఒక డైనమైట్ పెట్టాలని నిర్ణయించుకున్నాం. కాని డైనమైట్‌ని ఎవళ్లైనా అక్కడకి తేవాలి. తల్లి తన కూతురు ఆ పని చేస్తుందని చెప్పింది. ఆమె డైనమైట్‌ని ఒక బుట్టలో పెట్టి, దానిమీద అమ్మాయిల దుస్తులు, ఓ యిరవై గుడ్లు, కొంచెం వెన్న సర్దింది. ఆ అమ్మాయి డైనమైట్‌ని ఆవిధంగా లోపలకి తీసుకెళ్లింది. మాతృ ప్రవృత్తి తదితర సహజ ప్రవృత్తులన్నింటికన్న బలవత్తరమైనదని అంటారు. కాని మేమప్పుడు మరోలా చెయ్యలేకపోయాం, చెయ్యలేకపోయామంతే...''

పి. ఎ. కస్పెరోవిచ్, అప్పటి గెరిల్లా వార్తాహరి, యిలా చెప్పింది: ''మా గెరిల్లా బృందంలో చిమూక్ సోదరులు వుండేవారు. వాళ్లొక షెడ్డులో శత్రువు చేతికి చిక్కారు. ఆ షెడ్డుకి శత్రువులు నిప్పు ముట్టించారు. వాళ్ల దగ్గర చిట్టచివరి తూటాదాకా వాళ్లు కాలుస్తూనే వున్నారు. తర్వాత వాళ్లు తీవ్రమైన కాల్పు పుళ్లతో బయటకి వచ్చారు. నాజీలు వాళ్లని ఓ బండిలో వేసుకుని స్థానిక ప్రజల నుంచి వాళ్లెవరో తెలుసుకునేందుకు చుట్టూ తిప్పారు. గ్రామస్థులందరూ ఏకతాటిన నిలబడ్డారు. వాళ్ల తల్లితండ్రులు చూస్తూ నిలబడ్డారు, ఏ ఒక్కరూ ఒక్క మాట కూడా మాట్లాడలేదు. ఆ తల్లి ఏడవకుండా ఉండగలగాలంటే ఆమె హృదయం అయఃపిండమై వుండాలి! ఆమె తన వేదనని బయటపెట్టలేదు. లేకపోతే గ్రామం మొత్తం తగులపెట్టబడివుండేది. అన్నింటికీ పతకాలున్నాయి కాని, ఆ తల్లికి అత్యున్నతమైన వీర బిరుదం యిచ్చినా సరిపోదు...''

అప్పట్లో గెరిల్లా దళంలో సభ్యురాలైన ఇళ్కేవిచ్ వలెంతీనా యిలా చెప్పింది: ''మా గెరిల్లా దళానికి అమ్మ దుస్తులు ఉతికేది, వంటచేసేది. అవసరమైనప్పుడు ఆమె కావలి కాసేది. గెరిల్లా పోరాటంలో పాల్గొన్నట్లు ఆవిడకి పత్రాలు లేవు. తనకి పత్రాలు కావాలని కూడా ఆమె పట్టుపట్టలేదు. ప్రతి యితర సోవియట్ పౌరుడి మాదిరిగానే ఆమె సాయంచేసింది, అంతే. ఒకసారి నేనొక రహస్య కార్య నిర్వహణకు వెళ్లాను. నన్ను శత్రువులు ఉరితీశారని అమ్మకి చెప్పారు. కొన్ని రోజుల

తర్వాత నేను తిరిగివచ్చాను. అమ్మ నన్ను చూసి కొన్ని గంటలపాటు నోట మాట లేకుండా ఉండిపోయింది. ఆమె ఆ మానసిక వేదన అంతా సహించాల్సివచ్చేది... మీకు తెలుసో లేదో, అలా బాధపడాల్సివచ్చింది మా అమ్మ ఒకత్తే కాదు.''

నాజీ సైన్యానికి సుశిక్షితులైన సైనికులున్నారు, చాలా మంచి ఆయుధాలున్నాయి. తాము నెలకొల్పే నిర్బంధ చట్టాలు మిక్కిలి కఠినంగా వుంటే, ఆక్రమిత ప్రాంతం లోని జనంలో ప్రాణాలు నిలుపుకోవాలన్న ప్రేరణ తప్ప మిగిలినవన్నీ అణగి పోతాయని శత్రువులు ఆశపడ్డారు. నాజీ వ్యూహకర్తలూ, సైద్ధాంతికులూ ఒక తల్లి తన కూతురు దుస్తుల కింద డైనమైటు కప్పివుంచగలదనీ, లేక ఒక తండ్రి తన ప్రాణాన్ని తాను త్యాగంచేయలేని స్థితిలో తన కూతురు జీవితాన్ని త్యాగం చేస్తాడనీ, తన తల్లి ప్రాణాన్ని కాపాడగలిగిన ఒక కూతురు ప్రతి ఒకరి ప్రాణాన్నీ, తను పుట్టిన గడ్డనీ కాపాడుతుందనీ, అందుకు బదులుగా తనకి అత్యంత ప్రేమ పాత్రమైన తల్లి ప్రాణాన్ని బలి యివ్వగలదనీ మాత్రమే గ్రహించలేకపోయారు. ఆ మొరటు, నిర్దాక్షిణ్య యుద్ధ ప్రపంచంలో మానవుడి మనోబలం సహించరాని దాన్ని సహించగలదన్న విషయాన్ని గ్రహించడంలో శత్రువు విఫలమయ్యాడు.

ఈ కథలన్నింటిలోనూ కొట్టవచ్చినట్లు కనిపించే విషయం ఏమిటంటే, ఎవరి రాత వాళ్లదే అయినప్పటికీ, యుద్ధపు భిన్నభిన్న కాలాల్లో ఎవరికి వాళ్లు దారుణ మైన మూల్యం చెల్లించినప్పటికీ, జనం ఉమ్మడి దుఃఖానుభూతి పొందారు. మొదట్లో కొన్ని కుటుంబాలు తప్పుకొని వుండవచ్చునేమో గాని, యుద్ధం మూలంగా ప్రాణ నష్టం లేని కుటుంబం దాదాపు లేదని చెప్పవచ్చు. అయితే అలా సభ్యుల్ని కోల్పోని కుటుంబాలు, కోల్పోయిన కుటుంబాలు కూడా ఏదో ఒక పరిపూర్ణమైనదానిలో, ఒక అవిభాజ్యమైనదానిలో తమని తాము ఒక అంతర్భాగంగా భావించుకున్నాయి. విభ్రాంతి జనకమైన ఆ మానవ సమభావం ప్రతిదాన్నీ తట్టుకొని, విజయవంతంగా బయట పడగలదని నిరూపించుకొంది.

అప్పటి గెరిల్లా యోధురాలు దవీదొవా వేరా యిలా చెప్పింది:

''మేమొకసారి ఒక యింటికి వెళ్లాం. ఆ యింట్లో రెండు బెంచీలు, ఒక టేబిలు తప్ప అంతా ఖాళీగా వుంది. మేము మంచినీళ్లు తాగుదామనుకుంటే అక్క డొక్క కప్పు కూడా లేదు. ఆ యింట్లో ఒక వృద్ధుడూ, అతని భార్యా జీవిస్తున్నారు. వాళ్ల దగ్గర్నుంచి అన్నీ తీసుకుపోయారు. ఇంట్లో ఒక మూల సంప్రదాయం ప్రకారం ఒక రుమాలుతో అలంకరింపబడిన దేవుడి పూజాపటం ఒక్కటి మాత్రమే వుంది. మా గెరిల్లా కామ్రేడ్సులో ఒకడు తన బూట్లు విప్పదీశాడు. అతను కాళ్లకి చుట్టుకున్న పట్టీలు కూడా బాగా చీకి, చిరిగిపోయి, దాదాపు పనికిరాని స్థితిలో

వున్నాయి. బయట వర్షం కురుస్తోంది, బాగా బురదగా వుంది. అతని బూట్లు కూడా బాగా అరిగిపోయాయి. ఆ వృద్ధురాలు పూజాపటంమీది రుమాలు తీసి, అతని కిచ్చి, 'బాబూ, యిది చుట్టుకో, లేకపోతే నువ్వెలా నడుస్తావ్?' అంది. ఆ యింట్లో అది తప్ప మరేదీ లేదు...''

అప్పటి గెరిల్లా యోధురాలు ప్రస్కొవ్యా ఫ్యోక్లా యిలా చెప్పింది:

''నా కాళ్లు గాయపడి, నేను స్పృహ కోల్పోయాను. ఇది తీవ్రమైన శీతా కాలంలో జరిగింది. నాకు స్పృహ వచ్చేసరికి నా చేతులు చలి దెబ్బకి కొరడుబారి పోయాయి. ఇప్పుడవి బాగానే ఉన్నాయనుకోండి, కానైతే అప్పుడు నేను మంచుమీద పాకుతూ వుండి, నానిన మూలంగా నల్లబడ్డాయి. నా కాళ్లు కూడా అదే స్థితిలో వున్నాయనుకోండి. చలి దెబ్బ తగిలివుండకపోతే అవి బాగానే వుండేవి. కాని అవి రక్తంలో నానివుండి, నేను చాలా సేపు స్పృహ తప్పి వున్న మూలంగా వాటిని కాపాడటం సాధ్యం కాకపోయింది. మిగిలిన క్షతగాత్రుల్నీ, నన్నూ ఒక చోటుకి తీసుకెళ్లారు. అక్కడ మేము చాలామందిమి వున్నాం. కాని యింతలో జర్మన్లు ముందుకొచ్చి, మమ్మల్ని చుట్టుముట్టసాగారు. అందుకని మమ్మల్ని కట్టె మొద్దుల్ని పడేసినట్లు ఒక స్లెడ్జి బండిమీద పేర్చారు. మేము ఏ స్థితిలో వున్నామో చూసేందుకు మా కామ్రేడ్సుకి వ్యవధి లేక, మమ్మల్ని అడవి మధ్యకి తోలుకుపోయారు. కామ్రేడ్సు తిరోగమనం సాగిస్తూ సాగిస్తూ, నేను గాయపడిన సంగతిని రేడియో ప్రసారం ద్వారా మాస్కోకి తెలియజేశారు. మీకు తెలుసా, నేను సుప్రీం సోవియట్ సభ్యురాలిని.''

''మీకు రెండు కాళ్లూ దెబ్బతిన్నాయి కదూ?''

''ఔను, రెండూను. నాకిప్పుడు కృత్రిమమైన కాళ్లు వున్నాయి. అప్పుడు అడవిలో నా కాళ్లను ఖండించారు. ఆ ఆపరేషను చాలా మోటు పద్ధతిలో జరి గింది. కామ్రేడ్సు నన్ను టేబిలుమీద పడుకోబెట్టారు. కనీసం అయొడిన్ కూడా లేదు. వాళ్లు నా కాళ్లని మామూలు రంపంతో కోశారు... రెండు కాళ్లనీ... ఒక కామ్రేడు ఆరు కిలోమీటర్ల దూరంలో వున్న మరో గెరిల్లా దళం దగ్గర అయొడిన్ ఏమైనా వుంటే తెచ్చేందుకు వెళ్లాడు. నేను అంతసేపూ టేబిలుమీద పడుకొని వున్నాను. ఓ మత్తు మందూ, గ్రటా యేమీ లేవు.

''నన్ను తీసుకెళ్లేందుకు విమానం పంపమని మాస్కోకి కామ్రేడ్స్ సందేశం పంపారు. ఒక విమానం మూడు సార్లు వచ్చి, పైన చక్కర్లు కొట్టి దిగేందుకు ప్రయత్నించి విఫలమైంది. కాని అది నాలుగో సారి దిగగలిగింది. కాని అప్పటికే నా కాళ్లు రెండూ ఖండింపబడ్డాయి. తర్వాత ఇవానొవొలోనూ, దరిమిలా తాష్కెంట్ లోనూ నా కాళ్లకి మరో నాలుగు సార్లు ఆపరేషన్ చేశారు. నా కాళ్లకి నాలుగు సార్లు గాంగ్రీన్ వచ్చింది. డాక్టర్లు ప్రతి సారీ అంతకంతకు పైకి ఒక్కొక్క ముక్క

కోసుకుంటూపోయారు. మా సర్జన్ కూడా కాళ్లు లేనివాడే. ఆయన అన్న యీ మాటల్ని యితర డాక్టర్లు నాకు తర్వాత చెప్పారు: 'ఆవిణ్ణి నేను మెచ్చుకుంటాను. నేనెంతోమంది మగాళ్లకి ఆపరేషన్లు చేశాను కాని, ఆవిడకి సాటివచ్చేవాడు ఒక్కడు కూడా లేడు...'

''తర్వాత నేను దీన్నకి తిరిగివచ్చాను. మీరు నమ్ముతారో నమ్మరో గాని, నేను ఒక్క నెల కూడా విశ్రాంతి తీసుకోలేదు. నేను అప్పటికప్పుడు అక్కడికక్కడ పనిలోకి దూకాను.''

''మరి మీ కాళ్లు?''

''నేను తిరిగివచ్చినప్పుడు నాకు కృత్రిమమైన కాళ్లున్నాయి. నేనిప్పుడు ముసలి దాన్నయాను కనుక నడవడం కష్టంగా వుంది కాని ఆ రోజుల్లో నేను పట్టణంలో యెప్పుడూ హడావిడిగా తిరుగుతూండేదాన్ని. ఏక బిగిన మూడు కిలోమీటర్లు నడిచేదాన్ని. నేను వ్యవసాయ క్షేత్రాలకి వెళ్తూండేదాన్ని. జిల్లా కమిటీ కార్యవర్గపు ఉపాధ్యక్షురాలిగా పనిచేసేదాన్ని. నేనెప్పుడూ ఆఫీసులోనే కూర్చోవలసివస్తే నాకా ఉద్యోగం యిచ్చివుండేవాళ్లు కారనుకుంటాను.''

''మరైతే మీరా పని ఎలా చెయ్యగలిగారు?''

''వాళ్లు నన్ను నడకతో కూడిన పనులనుంచి తప్పించాలని ప్రయత్నించినప్పుడు నా మనస్సుకి కష్టం కూడా తోచేది. ఆ రోజుల్లో సమష్టి వ్యవసాయ క్షేత్రాల అధ్యక్షులందరూ యీనాడంత బాగా శిక్షణ పొందినవాళ్లు కారు. ప్రత్యేకించి ఏదైనా ఒక డ్రైవ్ యివ్వాల్సివచ్చినప్పుడు జిల్లా కేంద్రంనుంచి కార్మికుల్ని పంపుతూండేవారు. అందుకని ప్రతి సోమవారం మమ్మల్ని జిల్లా పార్టీ కమిటీ కార్యాలయానికి పిలవనంపేవారు. మాలో ప్రతి ఒక్కరినీ ఎక్కడికో ఒక చోటుకి పంపుతూండేవాళ్లు. నేను ఉదయం పూట కిటికీ దగ్గర కూర్చుని, జిల్లా పార్టీ కమిటీ కార్యాలయానికి ఒకరి తర్వాత ఒకరు వెళ్లడం చూస్తూండేదాన్ని. కాని నన్ను మాత్రం పిలిచేవాళ్లు కారు. నాకు అది బాధగా వుండేది. నన్ను కూడా మిగిలిన వాళ్ల మాదిరిగానే చూడాలని తపించేదాన్ని.

''తర్వాత కొంత కాలానికి ప్రధాన కార్యదర్శి ఫోన్‌చేసి, 'ఫ్యోక్లా ఫ్యోదొరొవ్నా, మీరొకసారి యిటువచ్చి నన్ను కలుసుకుంటారా?' అన్నాడు. గ్రామాల వెంట తిరగడం నాకు చాలా కష్టమే అయినా, నాకెంత సంతోషం కలిగిందనుకున్నారు! నన్ను యిరవై ముప్పై కిలోమీటర్ల దూర ప్రాంతాలకి పంపేవారు. ఒక్కొక్కసారి ఏదైనా వాహనం దొరికేది, ఒక్కొక్కసారి కేవలం కాలినడకన పోయేదాన్ని. కొన్ని సందర్భాల్లో అడవి గుండా పోయేటప్పుడు కిందపడేదాన్ని, లేవడం కష్టమైపోయేది. నా సంచి కింద పెట్టి, దానికి ఆనుకునో, లేక పక్కనున్న

చెట్టును పట్టుకునో లేచి నిలబడి, మళ్లీ నడిచేదాన్ని. నాకు పెన్షన్ వుంది. నా సంగతేదో చూసుకుంటూ కడుపులో చల్ల కదలకుండా యింట్లో కూర్చోవచ్చు. కాని నేను యింటి దగ్గర కూర్చోలేకపోయాను. ఉపయోగకరమైన పని యేదో ఒకటి చెయ్యాలనుకున్నాను. నేను మిగతా అందరిలా వుండాలనుకున్నాను. నేను నా చెల్లెలితో కలిసివుంటున్నాను... మాకో యిల్లు కట్టిపెట్టారు...''

''చక్కటి యిల్లు, బాగా విశాలంగా వుంది, పైకప్పు ఎత్తుగా వుంది. ఇలాంటి ఎత్తైన పైకప్పులున్న యిళ్లు నేనింతకి ముందు చూడలేదు...'' అన్నాను.

ఫ్యోక్లా ఫ్యోదొరొవ్నా నా చెయ్యి పట్టుకుని అంది: ''అబ్బే, అదేం లేదు. ఇంట్లో పిల్లలు లేరు కదూ, అందుకని మీకది అలా కనిపిస్తుందంతే...''

నేనా ఎత్తు పైకప్పు యింటినుంచి తప్పు చేసిన భావంతో తిరిగివచ్చాను. దానిలో పుస్తకాల్లోనూ, పాటల్లోనూ చిరంజీవిత్వం కలిగించవలసిన ఒక స్త్రీ నివసిస్తోంది. కాని మనం ఆమెని గురించి ఏమీ వినలేదు. మరి అలాంటివాళ్లు కోకొల్లలుగా వున్నారు. మన యిరుగుపొరుగున యింతవరకు మనం గమనించని, చరిత్రగా గుర్తించని చరిత్ర ఎంతో వుంది.

# అమ్మలు

నేను విన్నదానికీ, రికార్డుచేసినదానికీ ''కథ'' అన్నమాట బహుశా పూర్తిగా పొసగకపోయినప్పటికీ అమ్మలది ఓ ప్రత్యేక కథ. అవి కేవలం కథలూ, స్మృతులూ కావు. అవి బాధాకరమైన భావోద్వేగాలు, తీవ్ర వేదన, మనస్సులను కలిచివేసే స్మృతులు – ప్రత్యేకించి అమ్మలు యీ విషయం మాట్లాడినప్పుడు లేక మరొకరు అమ్మ గురించి మాట్లాడినప్పుడు – మరీని.

మీన్స్క్ గెరిల్లా బ్రిగేడ్‌కి చెందిన యోధురాలు రుద్కోవ్‌స్కయా ల్యుబోవ్ చిన్న ఫ్లాట్‌లో నేను విన్నది ఆజీవితాంత గాయానికి తక్కువేమీ కాదు.

''నేను పరుగెత్తుతున్నాను. మరి కొంతమంది పరుగెత్తుతున్నారు. మా అమ్మ కేసి అప్పటికే సబ్‌మెషీన్ గన్ గురిచెయ్యబడివుంది. మేము పరుగెత్తుకు పోవడం ఆవిడ చూసింది... నేనామె స్వరం, ఆమె అరుపులు విన్నాను. ఆవిడ 'నువ్వు తెల్ల దుస్తులు, తెల్ల షూస్ వేసుకోవడం మంచిదైంది. లేకపోతే అప్పుడు నీకు తెల్ల దుస్తులు వేసేవాళ్లు ఎవరూ వుండరు...' అని అరిచిందని జనం నాకు తర్వాత చెప్పారు. నన్ను చంపేస్తారని ఆవిడ అనుకుంది. అందుకే నేను పూర్తి తెల్ల దుస్తుల్లో దీర్ఘ నిద్రపోతానని ఆవిడ సంతోషించింది... ఎందుకో తెలియదు, కాళ్ళు లేవు,

ఎంతో నిశ్శబ్దంగా వుంది. మా అమ్మ అరుపులు మాత్రమే వినిపిస్తున్నాయి. లేక బహుశా వాళ్ళు కాలుస్తున్నారా? నాకు జ్ఞాపకం లేదు... మా అమ్మ స్వరం మాత్రమే నాకు జ్ఞాపకం వుంది...

''యుద్ధ కాలంలో మా కుటుంబ సభ్యులందరూ నేలకొరిగారు. యుద్ధం ముగిశాక నేను నిరీక్షించేందుకు ఎవరూ లేరు.''

హసెనేవిచ్ రయీసా తన యుద్ధ కాలపు స్మృతులు చెప్పేందుకు నా కార్యాలయానికి వచ్చింది. ఆవిడ ప్రశాంతంగా నవ్వుతూ, పొట్టి క్రాపుతో, యౌవనం తొణికిసలాడుతూ వుంది. ఆమె కథ ఎంతో ఉద్రిక్తతతో, ఉద్విగ్నతతో కూడి వుంటుందని అనుకోని కారణంగా నేను అప్పటికప్పుడు అక్కడిక్కడ ఆమెను ప్రశ్నించబోతున్నాను.

కాని ఆమె ''కాస్త ఏకాంత స్థలానికి వెళ్ళేందుకు వీలుంటుందా?'' అని అడిగింది.

మేమొక పార్కుకి వెళ్ళాం.

''నేను రాయని ఒక విషయం మీకు చెప్పాలనుకుంటున్నాను.''

''మీరు దేన్ని గురించి రాశారు?''

''మా గెరిల్లా దళపు కొన్ని సైనిక దాడులను గురించి రాశాను.''

''మరి మీరేం చెప్పాలనుకుంటున్నారు?''

''యుద్ధంలో నేను ఇద్దరు పిల్లలతో ఎలా జీవించానో దాన్ని గురించి...''

గెరిల్లా యోధురాలు హసెనేవిచ్ రయీసా నాకు చెప్పిన కథని యీకింద యిస్తున్నాను.

''నాజీలు మీన్స్క్‌మీద బాంబులు వెయ్యడం మొదలెట్టారు. నేను నా కొడుకుని తీసుకొచ్చేందుకు నర్సరీ స్కూలుకి పరుగెత్తాను. మా అమ్మాయి ఊళ్ళో లేదు. దానికి అప్పుడే రెండేళ్ళు వచ్చాయి. అది క్రెషీలో వుంది. క్రెషీని వేసవిలో గ్రామీణ ప్రాంతానికి తరలించారు. నేను నా కొడుకుని తీసుకెళ్ళి యింటి దగ్గర దింపి, నా కూతుర్ని తెచ్చుకునేందుకు వెళ్ళామని నిర్ణయించుకున్నాను. సాధ్యమైనంత త్వరగా మేమందరం ఒక చోట కలిసివుండాలని కోరుకున్నాను.

''నేను నర్సరీ స్కూలును సమీపించేసరికి నగరంమీద విమానాలు తిరుగుతూ, బాంబులు వేస్తున్నాయి. ఇంకా నాలుగేళ్ళు రాని నా కొడుకు 'భయపడకండి, వాళ్ళని తరిమేస్తారని అమ్మ చెప్పింది...' అంటూ తోటి పిల్లలకి ధైర్యం చెప్పడం నాకు వినిపించింది.

''నేను గేటు గుండా చూశాను. అక్కడ ఐదుగురు చిన్న పిల్లలు వున్నారు, నా కొడుకు వాళ్ళని ఓదారుస్తున్నాడు. కాని వాడు నన్ను చూసీ చూడగానే వణికి

పోతూ ఏడవడం మొదలెట్టాడు. నిజానికి వాడు విపరీతంగా భయపడిపోయాడు.

"నేను వాణ్ణి యింటికి తీసుకెళ్లి, చూస్తూవుండమని పొరుగామెకి అప్పగించి, నా కూతుర్ని తీసుకొచ్చేందుకు వెళ్లాను. క్రెషీ వుండవలసిన చోటుకి వెళ్లాను. కాని అక్కడ ఎవ్వరూ లేరు. ఆ గ్రామానికి చెందిన ఒకరు పిల్లల్ని తీసుకుపోయారని చెప్పారు. ఎక్కడికి తీసుకెళ్లారు? ఎవరు తీసుకెళ్లారు? బహుశా వాళ్లని నగరానికి తీసుకెళ్లారేమో అని చెప్పారు అక్కడివాళ్లు. వాళ్లతో క్రెషీ నర్సుల్లు యిద్దరు వున్నారు. కాని కారు లేదు, అందుకని వాళ్లు కాలినడకన వెళ్లారు. ఆ గ్రామం నగరానికి ఎక్కువ దూరంలో లేదు — పదిహేను కిలోమీటర్లో ఏమో వుంటుంది దూరం. కాని వాళ్లు బాగా చిన్న పిల్లలు. ఒకటినుంచి రెండేళ్ల వయస్సువాళ్లు... నేను వాళ్లకోసం రెండు వారాలు వెతికాను... నేనొక యింట్లో ప్రవేశించినప్పుడు ఆ క్రెషీ, నేను వెతుకుతున్న పిల్లలూ అక్కడే వున్నారని చెప్పినప్పుడు నేను నమ్మలేకపోయాను. పిల్లలు తమతమ మలమూత్రాల్లో, జ్వరంతో ఒళ్లు పేలిపోతూండగా పడుకొని వున్నారు. వాళ్లు సజీవుల్లాకంటె నిర్జీవుల్లా కనిపిస్తున్నారు. క్రెషీ హెడ్ మిస్ట్రెస్ పడుచామె, కాని ఆమె జుట్టు నెరిసిపోయింది. వాళ్లు ఆ స్థలం నుంచి నగరానికి నడిచివెళ్లారనీ, దోవలో కొందరు పిల్లలు తప్పిపోయారనీ, కొందరు చనిపోయారనీ తేలింది... నేను ఆ పిల్లల మధ్య నా కూతుర్ని వెతుక్కుంటూ తిరిగాను. కాని నా కూతుర్ని గుర్తించలేకపోయాను. హెడ్ మిస్ట్రెస్ నన్ను ఓదార్చి, 'నిరాశపడకండి, ఆమెకోసం వెతకండి. ఆమె యిక్కడే వుంటుంది. నాకామె గుర్తుంది...' అని చెప్పింది.

"నేను నా కూతురు ఏల్లాని దాని చిన్నారి బూటునుబట్టి గుర్తుపట్టాను... లేకపోతే నేను దాన్ని ఎన్నటికీ గుర్తుపట్టలేకపోయేదాన్ని...

"తర్వాత మా ఇల్లు తగలపెట్టబడింది. మాకు తలదాచుకునేందుకు నీడ లేకపోయింది. మేము కట్టుబట్టలతో మిగిలాము. అప్పుడు జర్మన్ సైనికులు నగరంలో ప్రవేశించారు. మాకు ఎక్కడకి వెళ్లేందుకూ లేకపోయింది. పిల్లలతోబాటు నేను వీధుల్లో తిరిగాను. యుద్ధానికి ముందు కొద్దిగా పరిచయం వున్న సినీత్సా తమారా ఎదురుపడింది. ఆమె నా కథ విని 'మా యింటికి రా' అని పిలిచింది.

"'మా పిల్లలకి కోరింత దగ్గు వుంది. నేను రాలేను' అని చెప్పాను.

"ఆవిడకి కూడా చిన్న పిల్లలు వున్నారు, వాళ్లకి కోరింత దగ్గు సోకవచ్చు. డాక్టర్లు లేరు, మందులు లేవు, ఏమీ లేదు...

"'కాదనకు. రా!' అందావిడ.

"అలాంటివాటిని ఎలా మరచిపోగలం? వాళ్లు వున్న బంగాళదుంప పెచ్చుల్లో

మాకూ పాలుపంచి యిచ్చారు. నేను ఓ పాత స్కర్టు చింపి నా కొడుక్కి పుట్టిన రోజు బహుమతిగా ఓ పాంటు కుట్టి యిచ్చాను...''

ఆక్రమిత నగరంలో తన నాలుగేళ్ల కొడుకు ల్యోన్యనీ, రెండేళ్ల కూతురు ఏల్లానీ కాపాడుకోవడంమీదనే ఆమె తన దృష్టినంతా కేంద్రీకరించింది. ఆమె తన జీవితకాలమంతటినీ అందుకే వినియోగించినా ఎవరూ ఆమెని తప్పుపట్టి వుండేవాళ్లు కారు. కాని ఆమెకి అవకాశం చిక్కగానే, ఆమె సంబంధాలు నెలకొల్పుకుని, రహస్య కార్యకలాపాల్లో నిమగ్నమైంది. ఆమె తన పెద్ద బిడ్డ అయిన, చూసుకోవడం తేలికైన తన కొడుకుని తన అత్తగారి దగ్గరకి తీసుకెళ్లింది. ఆవిడ వాణ్ణి చూసేందుకు ఒప్పుకొంది. కాని తన కోడలు ఎన్నడూ తమని చూసేందుకు రాకూడదన్న షరతు పెట్టింది. లేకపోతే ''నీ మూలంగా మమ్మల్నందర్నీ చంపేస్తారు...'' అంది. మరి పూర్తిగా మూడేళ్లు ఆ తల్లి తన కొడుకుని చూడలేదు. గెస్టాపోవాళ్లు ఆమెకోసం వెదకనారంభించినప్పుడు, ఆమె గెరిల్లాలతో చేరేందుకుగాను తన కూతురుతోబాటు అడవికి వెళ్లింది. ''నేను దాన్ని నా చేతుల్లో ఎత్తుకొని యాభై కిలోమీటర్లు తీసుకెళ్లాను...''

''మీరు గెరిల్లాలతో ఉన్నంత కాలం మీ కూతురు మీ దగ్గరే వుందా?''

''అది నా దగ్గర ఒక యేడాదికి పైగా వుంది. మేమా పరీక్షలన్నీ ఎలా గడిచి గట్టెక్కగలిగామా అని నాకు తరుచు ఆశ్చర్యం కలుగుతూ వుంటుంది. 'గెరిల్లా దిగ్బంధం' అన్న మాట వింటే చాలు యిప్పటికీ నా పళ్లు కటకట కొట్టుకోనారంభిస్తాయి. 1943 మే మాసంలో నేను ఎలా బతికి వుండగలిగానో నాకెప్పటికీ అర్థం కాదు... నాకు ఒక టైప్ రైటరు యిచ్చి బొరీసొవ్ ప్రాంతానికి పంపారు. వాళ్లకి అక్కడొక రష్యన్ అక్షరాల టైప్ రైటరు వుంది, వాళ్లకి జర్మన్ అక్షరాల టైప్ రైటరు అవసరమైంది. అలాంటిది మా దగ్గర మాత్రమే వుంది. అండర్‌గ్రౌండ్ కమిటీ ఆజ్ఞ మేరకు ఆక్రమిత మీన్స్కనుంచి నేను దాన్ని తీసుకొచ్చాను. నేను అక్కడ పలిక్ సరస్సు దగ్గరకి చేరుకున్న కొద్ది రోజుల తర్వాత శత్రువుచేత ఆ ప్రాంతం దిగ్బంధం చెయ్యబడింది. అదిగో అలాంటి పరిస్థితిలో నేను యిరుక్కున్నాను...

''మీకు తెలుసా, నేనక్కడకి నా కూతురుతోబాటు వెళ్లాను. ఒకటి రెండు రోజులపాటు ఏదైనా పనిమీద వెళ్లినప్పుడు నేను దాన్ని ఎవరి దగ్గరైనా వదిలేదాన్ని. కాని ఎక్కువ కాలమైతే దాన్ని ఎవరి దగ్గర వుంచేందుకూ వీలుండేది కాదు. అంచేత మరి, దాన్ని నాతోపాటే తీసుకెళ్లాను. దానితో మేమిద్దరం దిగ్బంధంలో చిక్కుకున్నాం... మరి మగాళ్లు తమ రైఫిళ్లు మాత్రమే మోస్తూండగా నేను ఒక రైఫిల్నీ, ఒక టైపు రైటర్నీ, నా కూతుర్నీ మొయ్యాల్సివచ్చింది. నేను తడ

బడ్డానా, అది నా తలమీదుగా ఎగిరి వెళ్లి చిత్తడి నేలలో పడేది. నేను దాన్ని ఎత్తుకొని మళ్లీ కొంచెం దూరం నడిచేసరికి మళ్లీ యిదే తంతు... వరుసగా ఇలా పూర్తిగా రెండు నెలలు సాగింది. నేను బతికి బయటపడితే చిత్తడి నేలలకి వేల మైళ్ల దూరంలో ఉంటాననీ, చిత్తడి నేలని జన్మలో మళ్లీ చూడననీ ఒట్టు పెట్టుకున్నాను.

'''వాళ్లు కాలుస్తోంటే నువ్వు నేలబారుగా ఎందుకు పడుకోవో నాకు తెలుసు, వాళ్లు ముందు నా తలని కాల్చిపారేస్తారు. తర్వాత నీ తలని కాల్చిపారేస్తారు, అంతే కదూ?' అంది నా మూడేళ్ల కూతురు. కాని వాస్తవం యేమిటంటే, నాకు నేల మీద పడుకునే శక్తి లేదు. నేను పడుకున్నానా మరి లేవలేకపోయేదాన్ని. ఒక్కొక్క సారి గెరిల్లాలు నామీద జాలి తలిచేవారు. 'ఉండు. నీ కూతుర్నిలా ఇయ్యి, మేము తీసుకొస్తాం...' అనేవాళ్లు. కాని నేను దాన్ని వాళ్లకెవరికీ యిచ్చేదాన్ని కాను. మామీద కాల్పులు జరిగి, దాన్ని నాకు తెలియకుండానే చంపేస్తే ఎలా? అది మారిపోతే ఎలా?..

''బ్రిగేడ్ కమాండరు లొపాతిన్ నన్ను చూసి, ఎంతో మెచ్చికోలుగా అన్నారు: 'ఓహ్, ఎలాంటి స్త్రీ! ఓ బిడ్డనీ, టైప్ రైటర్నీ మొయ్యడం మజాకా కాదు! చాలా కొద్దిమంది మగాళ్లు యీ పని చెయ్యగలరు.'

''ఆయన ఏల్లాని తన **చేతు**ల్లోకి తీసుకొని ముద్దుపెట్టుకున్నాడు. తర్వాత ఆయన తన జేబులన్నీ తడిమి, ఉన్న బ్రెడ్డు తుంపులన్నీ దానికిచ్చారు. అది వాటిని తినిచిత్తడి గుంటలోని నీళ్లు తాగింది. మిగిలిన గెరిల్లాలు కూడా ఆయనలాగే తమతమ జేబులు తడిమి, వాటిలో వున్న తుంపులన్నీ పోగుచేసి దానికిచ్చారు.

''మేము దిగ్బంధాన్ని చీల్చుకొని బయటపడేసరికి నాకు చాలా జబ్బుచేసింది. నా చర్మం నిండా కురుపులు ఏర్పడి, చర్మం పెచ్చులు రేగింది. దానికి తోడు నా చేతుల్లో పిల్ల... మేము విమానంకోసం నిరీక్షిస్తున్నాం. విమానం వస్తే బాగా ప్రమాదకరమైన గాయాలతో వున్నవాళ్లనీ, నా కూతురు ఏల్లానీ పంపుతామని చెప్పారు. మా వీడ్కోలు క్షణం నాకు యిప్పటికీ గుర్తుంది. క్షతగాత్రులు — తమ చేతులు వున్నవాళ్లు — దానివైపు జాపారు: 'ఏల్లా, నా దగ్గరకి రా... నా దగ్గరకి రా... ఇదిగో యిక్కడ జాగా వుంది...' అది వాళ్లందరికీ తెలుసు. అది ఆస్పత్రిలో పాటలు పాడటం వాళ్లు విన్నారు...

'''నీతో యిక్కడ ఎవరున్నారు అమ్మాయ్?' అని అడిగాడు పైలట్.

'''మా అమ్మ. మా అమ్మ బయట వుంది...'

'''మీ అమ్మని కూడా నీతో రమ్మను.'

'''ఉహుఁ. అమ్మ రాదు. అమ్మ నాజీలని ఓడించాలి.'

''మా పిల్లలు అలా వుండేవాళ్లు. నేను డగ్గుత్తికతో దాని ముఖంకేసి చూశాను: దీన్నీ మళ్లీ ఎప్పుడైనా అసలు చూస్తానా?..

''ఇప్పుడింక నా కొడుకుతో నా కలయికని గురించి చెప్తాను. ఇది విముక్తి తర్వాత జరిగింది. నా కాళ్లు కంపిస్తూండగా నేను మా అత్తారింటికి నడిచి వెళ్లాను... మా దళంలో వయస్సు రీత్యా నాకంటె పెద్దవాళ్లైన స్త్రీలు 'నీ కొడుకును కలిస్తే, వెంటనే నేను నీ తల్లినని చెప్పబోకు. అక్కడ వాడి జీవితాను భవం ఎలా వుండివుంటుందో జ్ఞాపకంచేసుకో' అని నన్ను హెచ్చరించారు.

''పక్కింటి అమ్మాయి పరుగున వచ్చింది: 'ఓయ్, ల్యోన్య అమ్మా, ల్యోన్య బతికి వున్నాడు...'

''నా కాళ్లు ముందుకి సాగేందుకు నిరాకరించాయి — నా కొడుకు బతికి వున్నాడు! నా అత్త, మామలు టైఫాయిడ్ జ్వరం వచ్చి చనిపోయారనీ, ల్యోన్యని పక్కింటావిడ చేరదీసిందనీ ఆ అమ్మాయి చెప్పింది.

''నేను పొరుగింటామె ఆవరణలో అడుగుపెట్టాను. నా దుస్తులేమిటో తెలుసాండి? జర్మన్ యూనిఫార్మ్ ట్యూనిక్, అతుకులు వేసిన స్కర్టు, పాత బూట్లు. పక్కింటామె నన్ను వెంటనే గుర్తుపట్టింది కాని ఏమీ అనలేదు. నా కొడుకు దిస పాదాలతో వున్నాడు. వాడి దుస్తులు చీలికలు వాలికలై వున్నాయి.

'''నీ పేరేమిటి?' అని అడిగాను.

'''ల్యోన్య...'

'''నువ్వు ఎవరితో వుంటున్నావు?'

'''నేను ముందు మా బామ్మతో, తాతయ్యతో వున్నాను. వాళ్లు చచ్చిపోయాక నేను రోజూ వాళ్ల సమాధుల దగ్గరకి వెళ్లి, నన్ను కూడా కిందకి తీసుకుపొమ్మని వాళ్లని అడిగాను. ఇంట్లో చాలా చలిగా వుండేది. తింటానికి ఏమీ వుండేది కాదు. ఒంటరిగా పడుకునేందుకు నాకు భయం వేసేది...'

'''మరి మీ అమ్మా, నాన్నా ఎక్కడున్నారు?'

'''మా నాన్న బతికి వున్నాడు. యుద్ధ రంగంలో వున్నాడు. మా అమ్మని నాజీలు చంపేశారు. నాకు మా బామ్మ చెప్పింది...'

''వాతోబాటు నాతోటి గెరిల్లాలు యిద్దరు వచ్చారు. వాళ్లు తమ స్నేహితుల్ని సైతం కంట తడి పెట్టుకోకుండా పూడ్చిపెట్టారు. కాని నా కొడుకు జవాబులు విన్నప్పుడు వాళ్లు ఏడ్చేశారు. నేనింక భరించలేకపోయాను.

'''నువ్వు మీ అమ్మనే గుర్తుపట్టలేదేమిట్రా?'

'''అమ్మా!!!' అంటూ వాడు చెవులు బద్దలయ్యేలా అరిచాడు. వాడు అమితావేశపడిపోయాడు... ఒక నెల రోజులపాటు వాడు నన్ను విడిచిపెట్టలేదు — చివరకి పనికి కూడా వెళ్లనిచ్చేవాడు కాదు. నేను వాణ్ణి నాతోబాటు తీసుకెళ్తూండేదాన్ని. వాడికి నన్ను చూస్తే, నేను దగ్గరున్నానని తెలుసుకుంటే సరిపోయేది కాదు —

నన్ను పట్టుకుంటే గాని వాడికి తృప్తిగా వుండేది కాదు. మేము భోజనంచేసేటప్పుడు వాడొక చేత్తో నన్ను పట్టుకొని, రెండో చేత్తో తిండి తినేవాడు.

''నేను నా భర్తని తిరిగి కలుసుకున్నప్పుడు అన్ని విషయాలూ చెప్పేందుకు నాకు పూర్తిగా ఒక వారం పట్టింది. నేను రాత్రింబగళ్లు మాట్లాడుతూనే వున్నాను...''

మాతృ మహా హృదయం! మాతృ హృదయపు సాహసం, ప్రేమ, ఓర్పు, సున్నితత్వం, విషాదం, విశ్వాసం, కన్నీళ్లు, సంతోషాలు మనకి తెలుసునని అనుకుంటూ వుంటాం. కాని నిజానికి మాతృ హృదయం గురించి మనకు తెలిసింది దాదాపు పూజ్యం — అది యిముడ్చుకోగలది అంత ఎక్కువ.

చాలా యిళ్లలో ఒకే సారి రెండు కథనాలు రికార్డు చేసేదాన్ని — ఒకటి తల్లిది, రెండోది యుద్ధం నాటికి చిన్న పిల్లగా వుండి యిప్పటికి పెరిగి పెద్ద దైన ఆమె కూతురుది. ఒక బిడ్డ స్మృతి తరచు ఏదైనా ఒక ఘటనకి గల అనూహ్య పార్శ్వాన్ని వెలుగులోకి తెస్తుంది. కాషిచ్‌కినా ల్యుద్మీలా మీన్స్క్‌లోని అండర్‌గ్రౌండ్ సంఘ సభ్యురాలు, దరిమిలా ఫ్రెంచి ప్రతిఘటనోద్యమ యోధురాలు. కాషిచ్‌కినా, ఆమె కూతురు నతాషా చెప్పిన అలాంటి ఒక కథనాన్ని యీకింద యిస్తున్నాను.

కాషిచ్‌కినా యిలా చెప్పనారంభించింది: ''యుద్ధానికి ముందు నేనొక చిన్న పిల్లల డాక్టర్ని. నా చుట్టూరా ఎప్పుడూ పిల్లలు వుండేవాళ్లు... అంతలో అకస్మాత్తుగా యుద్ధం, అండర్‌గ్రౌండు కార్యకలాపాలు. నా వయస్సు పట్టుమని పాతికేళ్లే.

''మా సహపోరాటకుల్లో ఎవరైనా ఒకరు పట్టుబడినప్పుడు మేము కొన్ని ఉద్రిక్త దినాలు గడపాల్సివచ్చేది. ఎవరి రహస్యాలైనా బయటపడ్డాయేమోనని పస్తాయించి చూడవలసివచ్చేది. వీధమ్మట నడుస్తూ ఉరితాడు సిద్ధంచెయ్యబడుతూ వుండటం మేము చూసేవాళ్లం... కాని మేము ఏడవటానికి గాని, క్షణకాలం తచ్చాడేందుకు గాని — చుట్టూ వేగులున్న మూలంగా — వీలుండేది కాదు. ఉరి తియ్యబడబోయేవాళ్లలో స్నేహితులుండవచ్చు, తోటి కార్యకర్తలు ఉండవచ్చు. ఏ క్షణాన అయినా అదే గతి మాకూ పట్టవచ్చునని మాకు తెలుసు.

''ఏం జరగవచ్చునో నాకు తెలుసు, కాని నన్ను గెస్టాపోవాళ్లు పట్టుకు తీసు కెళ్లాక గాని యిదంతా యేమిటో నాకు అర్థం కాలేదు, నా అనుభవంలోకి రాలేదు. నన్ను కొరడాతో కొట్టారు, తన్నారు. నాజీ 'మానిక్యూర్' అంటే యేమిటో నేను అప్పుడే తెలుసుకున్నాను. నా చేతుల్ని టేబిలుమీద పెట్టించారు. తర్వాత ఒక మెషీను నా గోళ్లకింద సూదులు పొడిచింది... అన్నింటినీ ఒక్కుమ్మడిగా. యమ బాధ పెట్టింది. మనుషులు వెంటనే స్పృహ కోల్పోతారు. ఆ దారుణమైన

బాధ నాకు అనుభూతమైంది, కాని తర్వాత ఏమి జరిగిందీ నాకు గుర్తు లేదు... నన్ను ఎన్నెన్నో చిత్రహింసలకి గురిచేశారు... నాకు ఉరిశిక్ష విధించి, ఉరితియ్య బడవలసినవాళ్ల కొట్టులో ఉంచారు. అక్కడ మరో యిద్దరు స్త్రీలు వున్నారు. మేము ఏడవనూ లేదు, బెంబేలెత్తిపోనూ లేదు. ఏమైనా, అండర్‌గ్రౌండ్ ఉద్య మంలో చేరినప్పుడే పర్యవసానాలు ఎలా ఉంటాయో మేము ఊహించుకున్నదే కదా. అంచేత మేము నిబ్బరంగా వున్నాం. మేము కవిత్వం గురించి మాట్లాడుకున్నాం, మాకు యిష్టమైన సంగీత రూపకాలు జ్ఞాపకంచేసుకున్నాం. టాల్‌స్టాయ్ నవల 'అన్నా కరేనినా' గురించి బోలెడు చర్చించుకున్నాం... మేము మా పిల్లల్ని గురించి ఆలోచించనైనా ఆలోచించలేదు. ఆలోచించేందుకు భయపడ్డాం. మేము సన్నగా నవ్వుకొని ఒకళ్లనొకళ్లం ప్రోత్సహించేందుకు ప్రయత్నించాం. అలా రెండున్నర రోజులు గడిచాయి...

''మూడవ రోజు ఉదయం నన్ను పిలిచారు. నేను కంట తడి పెట్టుకో కుండా యితర స్త్రీలను ముద్దుపెట్టుకొని, వాళ్ల దగ్గర వీడ్కోలు తీసుకున్నాను. నేనేమీ భయపడలేదు. ఎందుకంటే, ఏ క్షణాన అయినా మరణించేందుకు సిద్ధంగా వుండేందుకు నేను అలవాటుపడ్డాను. నా మనస్సులో ఓ మాదిరి శూన్యత ఏర్ప డింది, నేనిక ఎవరిని గురించీ ఎంతమాత్రం ఆలోచించే స్థితిలో లేను...

''మేము చాలా సేపుగా మోటారు శకటంలో వెళ్తున్నాం, అలా ఎంత సేపు వెళ్లామో కూడా నాకు గుర్తులేదు. ఏముంది, నేను చచ్చిపోబోతున్నాను. కాని తర్వాత ట్రక్కు ఆగింది. మేము — మేము సుమారు యిరవైమందిమి వున్నాం — కొద్ది సేపట్లో ఒక నాజీ శిబిరం దగ్గర వున్నాం. మేము బాగా అలసిపోయివున్నా మేమో మోటారు ట్రక్కులోంచి దిగలేకపోయాం. చచ్చిన కుక్కల్ని మాదిరిగా మమ్మల్ని కిందకి విసిరేశారు. మమ్మల్ని శిబిరందాకా పాకుంటూ వెళ్లమని కమాం డెంటు ఆజ్ఞాపించాడు. వాడి కొరడా దెబ్బలు తింటూ మేము పాకి వెళ్లాం. మేమలా పాకిన దోవలో రక్తపు చారికలు పడ్డాయి. మేము దిగిన చోటుకీ శిబిరానికీ మధ్య 300 మీటర్ల దూరం వుంది. మేము చెయ్యగలిగింది ఏమీ లేకపోయింది.

''...నాజీలు ఒక రోజున మమ్మల్ని పనికి తీసుకువెళ్తున్నారు. మేము ట్రక్కు నుంచి దిగుతున్నాం. ఇంతలో అకస్మాత్తుగా 'అమ్మా, అమ్మా!' అన్న స్వరం విన వచ్చింది. దాషా అత్త పేవ్‌మెంటుమీద నిలబడి వుండటం, నా కూతురు నాకేసి పరుగున రావడం చూశాను. యాదృచ్ఛికంగా వాళ్లు వీధమ్మట నడుస్తూ వుండటం, నేను వాళ్ల కంట పడటం తటస్థించింది. నా కూతురు రివ్వున పరుగెత్తుకుంటూ వచ్చి నా చేతుల్లో వాలింది. అక్కడ ప్రత్యేకించి మనుషులమీద దాడిచేసేందుకు శిక్షణ పొందిన కుక్కలు వున్నాయి. మీరు నమ్మండి నమ్మకపోండి, వాటిలో ఒక్కటి

కూడా కదల్లేదు. మనిషి ఒక్క అడుగు వేసినా కూడా అవి అతనిమీదకి దూకి ఏ కండకి ఆ కండ పీకేస్తాయి. అదీ అవి పొందిన శిక్షణ. కాని వాటిలో ఒక్క కుక్క కూడా కదల్లేదు. నా కూతురు నా చేతుల్లోకి ఉరికింది. నేను కన్నీళ్లు నిలవరించుకొని 'నా బంగారు తల్లీ! ఏడవకమ్మా, నేను తొందర్లోనే వచ్చేస్తాగా, నేను రేపే యింటికి వచ్చేస్తాను...' అని బుజ్జగించాను. కాపలావాళ్లూ, కుక్కలూ యింకా కదలకుండానే నిలబడివున్నారు, ఎవ్వరూ దాన్ని ముట్టుకోలేదు...

''ఆ ఘటన తర్వాత మమ్మల్ని పనిలోకి తీసుకెళ్లేందుకు బదులు శిబిరానికి తీసుకుపోయారు. ఆ రోజున పనిచేసే చోటునుంచి నేను తప్పించుకోవడానికి ఏర్పాట్లు చేశారు. కాని ఆ ఘటన మూలంగా నా ప్లాన్లు భగ్నమయాయి.''

నతాషా మధ్యలో అడ్డు వచ్చి యిలా చెప్పింది: ''నాకు ఐదేళ్లప్పుడు నాకు నర్సరీ పాటలేవీ వచ్చేవి కావు. దాషా ఆంటీ నాకు ప్రార్థనలు నేర్పింది. నేను నాన్న కోసం, అమ్మకోసం, వాళ్లని సజీవంగా చూసేందుకోసం ప్రార్థనలు చేస్తూండే దాన్ని. అమ్మని ఎక్కడ పోగొట్టుకుంటానో అని నాకు యీ రోజుకీ భయమే. నేను ప్రతి ఉదయం అమ్మకి ఫోనుచేసి, 'అమ్మా, ఎలా వున్నావ్? కులాసానా? సరేలే...' అని ఫోను పెట్టేస్తాను... అలా మొదలవుతుంది నా రోజు.

''ఏమిటి మీరనేది, ప్రతి రోజూనా?''

''నేను ఫోనుచెయ్యకపోయినా, లేక అమ్మ బయటకి వెళ్లినా, రోజంతా నాకు ఆందోళనగా, ఆదుర్దాగా, గాభరాగా వుంటుంది. రాత్రి, నిద్రపోయేందుకు ముందు, అమ్మకి నేను మళ్లీ ఫోనుచేస్తాను — నాకు నలభై యేళ్లు దాటినా. అమ్మ నోట ఒక్క మాటైనా నేను వినాలి.''

''మీరు మీ అమ్మగారి దగ్గరకి తరుచు వస్తూ వుంటారా?''

''నేను ఆస్పత్రిలో నైట్ డ్యూటీలో లేకపోతే ప్రతి రోజూ వస్తాను. నేను శిశు మానసిక వ్యాధుల నిపుణురాల్ని — నేను కూడా మా అమ్మలాగే డాక్టర్నయ్యాను. నా ఆదుర్దాని నా భర్త అర్థంచేసుకోలేకపోయేవాడు. వెనకటి రోజుల్లో ఆయన మనస్సు కష్ట పెట్టుకొని, అసూయచెందేవాడు. అదేదో నా చాపల్యం కాదనీ, అలా చెయ్యకుండా నేను ఉండలేననీ గ్రహించిన నా భర్త యిప్పుడు సరిపెట్టుకున్నాడు.

''నేను చిన్న పిల్లగా వున్నప్పుడే డాక్టర్నవాలని కలలుగంటూ వుండేదాన్ని. కాని నేను సర్జన్‌ని కాలేకపోయాను. నాకు రక్తమంటే భయం లేదు. కాని ప్రాణంతో వున్న మనుషుల్ని కొయ్యాలంటే యుద్ధంలో నేను చూసినదంతా — గాయాలు, కుక్కలు ఏ కండకి ఆ కండ పీకేసిన మనుషులు — నాకు కళ్లకి కట్టి

నట్లు జ్ఞాపకం వస్తారు... నా కాలేజిలో ప్రాక్టికల్సుకి హాజరవాల్సివచ్చేది. కాని అందుకు నేను బ్రహ్మ ప్రయత్నం చెయ్యాల్సివచ్చేది..."

1944, ఫిబ్రవరి 13న కాషిచ్‌కినా ల్యుద్మీలాని ఒక రైలు నిండుగా వున్న యితర ఖైదీలతోబాటు ఫ్రాన్సులో, లా మాంష్ తీరంలో ఏర్పాటుచెయ్యబడిన క్రోయ్‌సెట్ నాజీ కాన్సెన్ట్రేషన్ కాంపుకి తీసుకెళ్లారు. పారిస్ కమ్యూన్ వార్షికోత్సవ దినమైన మార్చి 18న ఫ్రెంచివాళ్లు ఆమె తప్పించుకుపోయేందుకు ఏర్పాటుచేశారు. ఆమె ఫ్రెంచి ప్రతిఘటన ఉద్యమంలో చేరింది.

కాషిచ్‌కినా ల్యుద్మీలా యింకా యిలా జోడించింది: "నా వెన్నెముకకి తగిలిన గాయమూ, ఫ్రెంచివాళ్లు నాకు బహూకరించిన మిలిటరీ క్రాస్ పతకమే నాకు ఆ రోజులకి సంబంధించి మిగిలిన జ్ఞాపికలు. యుద్ధ కాలంలో నాకు కలిగిన దారుణమైన అనుభవాల మూలంగా యుద్ధానంతరం యుద్ధానికి సంబంధించి యికనేమీ జ్ఞాపకం వుంచుకోకూడదని అనుకున్నాను. ఆ కారణంగానే అనేక వివరాలు నా బుర్రలోంచి జారిపోయాయి. ఏళ్ల తరబడి నేను అన్నీ మరచిపోవాలని ప్రయత్నించాను.

"కానైతే ఒక్క విషయం మటుకు నేను మరచిపోరాదని అనుకున్నాను – అది ఫ్రాన్సునుంచి యింటికి నా తిరుగు ప్రయాణం, మన గడ్డమీద మా మొదటి మజిలీ... మేమందరం రైలు పెట్టెలోంచి కిందకి ఉరికాం, నేల తల్లిని ముద్దుపెట్టుకున్నాం, కొంచెం మట్టి తీసి మా రొమ్ముల దగ్గర వేసుకున్నాం..."

# "పిల్లలు యుద్ధం ఆట ఆడటం నేను చూడలేను..."

ఎన్. వి. ఇల్యీన్స్కయా, మెడికల్ ఆర్డర్లీ, కథనం యిది:

"...ఒక పోరాటంలో చాలామంది జర్మన్లను మేము ఖైదీలుగా పట్టుకున్నాం. వాళ్లలో కొందరు క్షతగాత్రులు. మేము ఖైదీల గాయాలకి కట్లు కట్టాం. ఎండ మండిపోతోంది. ఓ కెటిలు వెతికి, వాళ్లకి తాగేందుకు నీళ్లు పోశాం. మేము బయలు ప్రదేశంలో వున్నాం. శత్రువులు విరంతరాయంగా కాలుస్తున్నారు. అప్పుడు మాకు వెంటనే గుంటలు తవ్వి, ఏదైనా మాటుపెట్టుకొని మమ్మల్ని మేము మరుగుపరచుకోవాలని ఆజ్ఞలు వచ్చాయి.

"మేము గుంటలు తవ్వడం ప్రారంభించాం. జర్మన్ ఖైదీలు మాకేసి చూస్తున్నారు. ఆ గుంటలు తవ్వేందుకు సహాయపడమని అడుగుతున్నట్లు వాళ్లకి వివరించి చెప్పాం. మేము అడుగుతున్నదేమిటో అర్థంచేసుకోగానే వాళ్లు మా వేపు భయోత్పా

తంతో చూశారు. గుంటలు తయారుకాగానే వాళ్లందర్నీ గుంట వార నిలబెట్టి కాల్చేస్తామని వాళ్లు అనుకున్నారు. వాళ్లు మన ఖైదీలపట్ల ప్రవర్తించినట్లే మేము వాళ్లపట్ల ప్రవర్తిస్తామని వాళ్లు అనుకున్నారు. ఆ గుంటలు తవ్వేటప్పుడు వాళ్లెంతగా భయభీతులైనట్లు కనిపించారో మీరు చూసివుండాల్సింది.

''మేము వాళ్లకి కట్లు కట్టి, తాగేందుకు మంచినీళ్లు యిచ్చి, వాళ్లు తవ్విన గుంటల్లో వాళ్లని రక్షణ పొందమని చెప్పినప్పుడు వాళ్లు పూర్తిగా దిగ్భ్రాంతుల య్యారు...''

తను యుద్ధ కాలంలో రచించిన వ్యాసాల్లో ఒకదాంట్లో ఐ. ఎరెన్‌బూర్గ్* ద్వేషంలేని యుద్ధం నీతి విరుద్ధమూ, సిగ్గుచేటూ అయినదనీ, దాన్ని సహేతుక మైనదిగా సమర్థించలేమనీ రాశాడు. మన సైనికులు తమ కష్టాలు, బాధల ద్వారా ఆ పవిత్ర ద్వేషాన్ని అలవరచుకున్నారు. అయినా, పైన వర్ణింపబడిన మాదిరి కథనాలు ఎంతమాత్రం అరుదు కావు. కాని చుట్టూ జనం హత్యచెయ్యబడుతు న్నప్పుడు, గాయపరచబడుతున్నప్పుడు, చిత్రహింసలకు గురిచెయ్యబడుతున్నప్పుడు అంతు లేని క్షమాగుణం, అనిర్దిష్టమైన మానవత్వం ప్రదర్శించడం సాధ్యం కాదు.

అది మరో విషయం. మనిషి తను మానవుడినన్న విషయం మరచిపోవాలని కోరుకోడు. నాజీ యూనిఫార్మ్ ధరించినవాళ్లపట్ల ద్వేషం తప్ప తదితర అన్ని భావాలనూ చంపివేసినట్లు కనిపించిన ఆ భయంకర యుద్ధంలో మనం సాధించిన విజయాల్లోకెల్ల మిక్కిలి గొప్ప విజయం మన నైతిక విజయమే.

స్త్రీల స్మృతులు కనికరానికి ఉదాహరణలతో నిండివున్నాయి.

నికొలాయెవా ఎమీలియా ఒక మెడికల్ ఆర్డర్లీగా యుద్ధంలో చేరింది, ఖైదీగా పట్టుబడింది, యుద్ధ ఖైదీల శిబిరంనుంచి పారిపోయి గెరిల్లా దళంలో చేరింది.

ఆమె యిలా చెప్పింది: ''మేము జర్మన్ సైనికులను యుద్ధ ఖైదీలుగా పట్టుకోనారంభించినప్పుడు, నేను అనుభవించిన వాటన్నింటి తర్వాత — కాన్సెంట్రేషన్ కాంపు, చిత్రహింస, అవమానాలు — నేనిక వాళ్లమీద జాలి చూపలేనని అను కున్నాను. ఓ రోజున కొందరు జర్మన్ ఖైదీలని పట్టుకొచ్చారు... కొన్ని నాజీ కాన్సెం ట్రేషన్ కాంపుల్లో వుండి, తన చెయ్యి ఒకటి కోల్పోయిన నా స్నేహితురాలు కూడా నాలాగే భావించింది. 'ఇప్పుడిక వాళ్లకి సరికి సరి చెల్లిద్దాం. వాళ్లు మనల్ని

* ఐ. ఎరెన్‌బూర్గ్ (1891–1967) — సోవియట్ రచయిత. యుద్ధ కాలంలో ఉత్తేజకరమైన వ్యాసాలు రాశాడు. — సం.

చూసినట్లే మనం వాళ్లని చూద్దాం!' అనుకున్నాం. కాని ఆచరణలోకి వచ్చేసరికి మేము అలా చెయ్యలేకపోయాం. మన జనం పెంపకం భిన్నమైనదని తేలింది. మనవాళ్లకి ఖైదీని, ముఖ్యంగా అతను వయస్సులో పెద్దవాడైనప్పుడు, కొట్టడం మాట అటుంచి, కనీసం అతన్ని దూషించడం కూడా సాధ్యం కాలేదు...''

మీన్‌స్క్ ఆస్పత్రిలో డాక్టరూ, యుద్ధ కాలపు సర్జనూ అయిన హోరెవా వేరా తన స్మృతులను యిలా పేర్కొంది:

''మా రాజకీయ నాయకుడు నాకు కబురంపి యిలా అన్నాడు: 'వేరా, మీరు కొందరు జర్మన్ క్షతగాత్రులకి వైద్య సహాయం చేయాలి.' అప్పటికే జర్మన్ల చేతుల్లో నా సోదరులిద్దరు మరణించారు. 'నేను చెయ్యను!' అని కచ్చితంగా జవాబిచ్చాను. 'కాని మీరు చేసితీరాలి, అర్థమైందా?' 'నేను చెయ్యలేనంతే. వాళ్లు నా అన్నదమ్ముల్ని చంపారు. నాకు జర్మన్లంటే పరమ ద్వేషం. నేను వాళ్లకి వైద్యం చెయ్యడం కాదు కదా, వాళ్లని ముక్కముక్కలుగా కోస్తాను. నన్ను కాస్త అర్థం చేసుకోండి...' 'ఇది ఆజ్ఞ.'

''చివరకి నేను గాయపడ్డ జర్మన్లకి వైద్యం చేసేదాన్ని. చెయ్యవలసిందంతా చేసేదాన్ని. కాని అది నా హృదయాన్ని కలగుండుపరచింది. అదిగో అప్పుడు మొదటి సారిగా నా వెంట్రుకలు నెరిశాయి. నేను చెయ్యవలసింది ప్రతీదీ నేను చేసేదాన్ని — వాళ్లకి ఆపరేషన్లు చేసేదాన్ని, వాళ్లచేత తిండి తినిపించేదాన్ని, వాళ్లకి మత్తు మందు ఇచ్చేదాన్ని. సాయంత్రం రౌండ్లకి మాత్రం వెళ్లలేకపోయేదాన్ని. ఉదయం పూట డాక్టరు మామూలుగా గాయాలకి కట్లు కడతాడు, నాడి చూస్తాడు, మరోలా చెప్పాలంటే యేదో ఒకటి చేస్తాడు. కాని సాయంత్రం పూట డాక్టరు రోగులతో మాట్లాడాలి, ఎలా వుందని అడగాలి. ఈ పని మాత్రం నేను చచ్చినా చెయ్యలేకపోయేదాన్ని. నేను వాళ్ల గాయాలకి కట్లు కట్టేదాన్ని, ఆపరేషన్లు చేసేదాన్ని, కాని ఎన్నడూ వాళ్లతో మాట్లాడేదాన్ని కాను. రాజకీయ నాయకుడితో 'సాయంత్రం రౌండ్లకి మాత్రం చస్తే వెళ్లనని నేను ఆదిలోనే హెచ్చరించాను...' ''

చెర్కాస్సి ప్రాంతంలోని జొలొతొనోష పట్టణానికి చెందిన షలీగినా ఎకతెరీనా నాకు యీకింది లేఖ పంపింది:

''నేను యుద్ధ రంగంలో నర్సుగా పనిచేశాను. మొట్టమొదటి జర్మన్ క్షతగాత్రుడు నా వార్డుకి రావడం నాకు జ్ఞాపకం వుంది. అతనికి గాంగ్రీన్ మొదలైంది. అతని కాలు తీసెయ్యాల్సివుంది.

''సాయంత్రం నాకు 'కాత్యా, వెళ్లి నీ జర్మన్‌ని ఓ సారి చూసుకో' అని చెప్పారు. బహుశా అతని గాయాలనుంచి రక్తం కారుతోందేమో అనుకుంటూ వెళ్లాను.

అతను మెలుకువగా పడుకొని వున్నాడు. అతని టెంపరేచరు నార్మల్‌గా వుంది. అతను నా వేపు తేరిపార జూసి, ఓ చిన్న పిస్తోలు బయటకి తీశాడు. 'ఇదిగో తీసుకో...' అతను జర్మన్ భాషలో మాట్లాడాడు, కాని అతని హస్త భంగిమలనుబట్టి అతను చెప్పదలచుకున్నదేమిటో స్పష్టమైంది: 'ఇదిగో తీసుకో, నేను మిమ్మల్ని చంపాలనుకున్నాను. ఇప్పుడిక మమ్మల్ని చంపడం మీ వంతు...'

"యుద్ధం ముగిసేనాటికి మాకొక జర్మన్ ఆస్పత్రి తయారైంది. అందులో బోలెడంతమంది జర్మన్ క్షతగాత్రులు జమ అయ్యారు. స్వల్ప గాయాలతో వున్న జర్మన్లు ఐదవ అంతస్తునుంచి శవాలను ఎలా తీసుకెళ్లేవారో నేనెప్పటికీ మరచిపోలేను. వాళ్లు శవాలను కాళ్లు పట్టుకొని బరబర లాక్కువెళ్లి మెట్లమీంచి కిందకి నెట్టేసేవాళ్లు. వాళ్లు అప్పటిదాకా ఒకరి సరసన ఒకళ్లు పడుకున్నవాళ్లు. ఎంతైనా అందరూ జర్మన్లు. మేమా దృశ్యం చూసి దిగ్భ్రాంతులమయ్యాం..."

యుద్ధ భూమినుంచి జర్మన్ సైనికుల్ని మన స్ట్రెచ్చర్ వాహకులు మోసుకు రావడాన్నీ, మన ఆస్పత్రుల్లో మన డాక్టర్లు, ఒకవైపున యింకా పోరాటాలు చెలరేగుతూ వుండగా, వాళ్లకి వైద్య చికిత్స చెయ్యడాన్నీ గురించి ఎవరైనా సమాచారం నమోదుచేశారా? 1945లో మన సైనికుల యుద్ధ రంగ వంటశాలలో జర్మన్ పిల్లలకి తిండి పెట్టడం గురించి ఎవరైనా రాశారా? వాళ్లకి ఏమి గుర్తుంది? ఆ పిల్లల తండ్రులూ, అన్నలూ ఏ సోవియట్ సైనికుని యింటిని తగులబెట్టారో, ఎవరి బిడ్డల్ని చంపారో, ఎవరి భార్యని చెరిచారో ఆ సోవియట్ సైనికుడు వాళ్లకిచ్చిన పంచదార గడ్డ సంగతి వాళ్లకి గుర్తుందా? వాళ్లకి జ్ఞాపకంచేసుకోవాలని లేదా?..

కున్‌త్సేవిచ్ సోఫ్యా అనే నర్సు తన స్మృతులను యిలా పేర్కొంది:

"మేము సరిహద్దు దాటాం – మన మాతృదేశం స్వతంత్రమైంది! నేను సైనికుల్ని గుర్తుపట్టలేకపోయాను. వాళ్లు వేరే మనుషుల్లా కనిపించారు. ప్రతి ఒకడూ నవ్వుతున్నాడు. వాళ్లు శుభ్రమైన చొక్కాలు వేసుకున్నారు. ఎక్కణ్ణుంచి వచ్చాయో గాని పువ్వులు కనిపించాయి. అంతకంటె ఎక్కువ సంతోషంగా వున్న మనుషుల్ని నేను మరెన్నడూ చూడలేదు. మేము జర్మనీలో ప్రవేశించినప్పుడు నాలో జాలి యింకా వుంటుందని నేను అనుకోలేదు. నా మనస్సు ద్వేషంతో నిండివుంది! వాళ్లు నా పిల్లల్ని చంపేశాక, వాళ్లెవరి పిల్లలమీదనో నేనెందుకు జాలి చూపించాలి? నా తల్లి ఉరితియ్యబడ్డాక, ఎవరి తల్లినో ఉరితియ్యకుండా నేనెందుకు వదలాలి? నా యిల్లు తగులపెట్టబడినప్పుడు మరొకరి యింటికి హాని కలిగించకుండా

నేనెందుకు వదలాలి? ఎందుకంట? మేము వాళ్ల భార్యల్నీ, అలాంటి కొడుకుల్ని కన్న ఆ తల్లుల్నీ చూడాలనుకున్నాం. వాళ్లు మా ఎదుట ఎలా పడతారు?

''నేను జర్మనీలో మొట్టమొదట చూసింది 'ఇది నాజీ జర్మనీ!' అన్న ఒక పోస్టరు. జరిగినదంతా నా మనస్సులో గిర్రున తిరిగింది. నేనూ, మన సైనికులూ ఏమి చేస్తాం అనుకున్నాను. మాకు జరిగింది సమస్తం జ్ఞాపకం ఉంది. మేమొక ఊరికి వెళ్లాం. పిల్లలు ఆకలితో నకనకలాడుతూ, దీనంగా అటూయిటూ తిరుగుతున్నారు. వాళ్లందర్నీ ద్వేషిస్తానని శపథంచేసిన నేను, మా సైనికుల దగ్గరున్నవన్నీ, వాళ్ల రేషన్‌లో మిగిలినవాటన్నింటినీ ప్రతి చిన్న పంచదార తునకనీ పోగుచేసి, ఆ జర్మన్ పిల్లలకి యిచ్చాను. నేనేమీ మరచిపోలేదు, జరిగినవన్నీ నాకు చాలా బాగా జ్ఞాపకం వున్నాయనుకోండి. కాని ఆకలిగొన్న పిల్లల కళ్లలోకి నేను ప్రశాంతంగా చూడలేకపోయాను.

''తెల్లవారేసరికి జర్మన్ పిల్లలు మా వంటశాల దగ్గర, ఆహారం వడ్డించే చోట క్యూలో నిలబడ్డారు. వాళ్లలో ప్రతి ఒక్కరి భుజానా బ్రెడ్డుకోసం ఒక సంచి వేలాడుతోంది. సూపుకోసం ఒక డబ్బా, జావకోసమో లేక ఉడక బెట్టిన చిక్కుళ్లకోసమో మరో పాత్రా బెల్టుకి వేలాడుతున్నాయి. పౌరులపట్ల మాకు ద్వేషం లేదు. మేము ఆ పిల్లలకి తిండి పెట్టడమే కాకుండా, వాళ్ల తల నిమిరి బుజ్జగించాం కూడా...''

''తల నిమరడం'' అన్న మాత్ర సహజమైన మాటలో నాకు ప్రత్యేకత కన్పించింది. ఎందుకంటే, అది కేవలం తిండి పెట్టడం కాదు, వాళ్లపట్ల జాలి తలవడం. వాళ్లకి దయచూపేటంత మనోశక్తి వుంది.

బొరొదినా వేరా, టెలిగ్రాఫ్ ఆపరేటర్, జూనియర్ సార్జెంట్. ఆమె యిలా చెప్పింది:

''నాజీలు మనం మృగాలమని చెప్పి, స్వదేశీయుల్ని భయభీతుల్ని చేశారు. అందుకే చాలామంది జర్మన్లు నీళ్లలో దూకో, రక్త నాళాలు కోసుకునో ఆత్మ హత్యలు చేసుకున్నారు. అలా కుటుంబాలకి కుటుంబాలు తమని తాము హత మార్చుకున్నాయి... అయితే మన దేశంలో వాళ్ల సైనికులు ప్రవర్తించిన తీరుకి భిన్నంగా మేము వాళ్లకి తిండి పెట్టి, వాళ్లని పునరారోగ్యవంతుల్ని చేశాం... మేమొక సారి ఒక యింట్లో ప్రవేశించాం. అది ఖాళీగా వుంది. గృహ యజమానులు – తల్లి, కూతురు – అటకమీద వుండటం చూశాం. వాళ్లు ఉరివేసుకుని చచ్చిపోయారు. రష్యన్లు రాగానే మానభంగాలు, కొల్లలు, హత్యలు జరుగుతాయనీ, తాము సైబీరియాలోని నిర్బంధ శిబిరానికి తోలబడతామనీ వాళ్లు పూర్తిగా నమ్మడమే అందుకు కారణం... స్టాలిన్‌గ్రాడూ, మొత్తం రష్యా ఎలా మార్చబడ్డాయో వాళ్లకి తెలుసు.

వాళ్ళు యివన్నీ న్యూస్‌రీల్సులో చూశారు. అదే గతి జర్మనీకీ పడుతుందనే విషయంలో వాళ్లకి ఎంతమాత్రం అనుమానం లేకపోయింది. మేము పగతీర్చుకోకపోవడం వాళ్లని ఆశ్చర్యచకితుల్ని చేసింది.

''మేమొక సారి కొంచెం టీ తీసుకుందామని ఒక యింట్లోకి వెళ్లాం. ఇళ్లన్నీ ఖాళీగా వున్నాయి. గృహ యజమానులు ఇళ్ళు వదిలి వెళ్లిపోయారు. మేము కప్పుల కోసం వెతికాం. సుపరిచితమైన గోధుమ కంకుల మార్కు వున్న టీ సెట్టు కనిపించింది. దానిమీద 'ఒదేస్స, యు.ఎస్.ఎస్.ఆర్.' అన్న ట్రేడ్ మార్కు వుంది. ఇంతకీ మేము టీ తీసుకోనేలేదు...''

వొరొపాయెవా అనస్తసీయా, లాన్స్ కార్పొరల్, సెర్చ్‌లైట్ ఆపరేటర్, యిలా చెప్పింది: ''మన మాతృదేశానికి వాళ్లేం చేశారో మేము చూశాం. వాళ్ల తల్లులు, భార్యలు, బిడ్డలు ఎలా వుంటారో చూడాలని అనుకున్నాం. మన దేశంలో జరిగిన దానంతటి తర్వాత వాళ్లని మేము చూడాలనుకున్నాం...

''చివరకు మేము జర్మనీలో వున్నాం. నా స్నేహితురాలూ, నేనూ సైకిలు మీద వెళ్తున్నాం. దారిలో మాకు ముగ్గురు పిల్లల తల్లి కనిపించింది. వాళ్లలో యిద్దరు తోపుడు బండిలో వున్నారు. ఒకడు ఆమె గౌను చెంగు పట్టుకొని తప్పటడుగులు వేస్తూ నడుస్తున్నాడు. ఆమె ముఖంలో యెంతో అలసట కనిపిస్తోంది. మేము ఆమె దగ్గరకి రాగానే ఆమె మోకరించి, మాకు దణ్ణాలు పెట్టడం మొదలెట్టింది. ఆమె అంటున్నదేమిటో మాకు అర్థం కాలేదు. ఆమె తన హృదయంకేసీ, తర్వాత తన బిడ్డలకేసీ సంజ్ఞలు చేసింది. మాకు అర్థమైనంతవరకు ఆమె తన బిడ్డలు బతికి వున్నందుకు మాకు కృతజ్ఞతలు చెప్తోంది. అందుకని ఏడుస్తోంది, దణ్ణాలు పెడుతోంది... ఆమె ఒక భార్య, తల్లి...''

ఉమ్న్యాగినా తమారా, మీన్స్క్‌కి చెందిన ఒక ఆర్డర్లీ, జూనియర్ సార్జెంట్, కూడా వీటన్నింటినీ, యింకెన్నో విషయాలనీ తన స్మృతుల్లో పేర్కొంది. పిట్టలా చిన్నగా, సంసారపక్షంగా వుండే తమారా బాగా ఉద్రేకపరురాలు. మరీ సున్నిత స్వభావం కలిగిన తమారాకి యిది యితరులకికంటె మరింత కష్టం. బహుశా అందు కేనేమో ఆమె గతాన్ని గురించి మాట్లాడినప్పుడు అదేదో నిన్ననే జరిగినట్లు మాట్లాడుతుంది. ఈనాటికీ, అవన్నీ గుర్తుచేసుకుంటే, బుర్ర చెడిపోతుంది అంటో వుంటుంది...

''కాటన్ స్కర్ట్సూ, సాదా తెల్ల కాన్వాస్ షూసూ వేసుకుని సైనిక రిక్రూట్ మెంటు కార్యాలయానికి వెళ్లడం నాకు గుర్తుంది. నన్ను చేర్చుకుని, పదాతి సైనికుల డివిజన్‌కి పంపమని కోరాను. మీన్స్క్ వెలుపల మకాం చేసివున్న నా

దళాన్ని నేను చేరుకున్నప్పుడు, నాకు అక్కడి మగసైనికులు పదిహేడేళ్ల అమ్మాయిలు పోరాడవలసిరావడం తమ మగాళ్లకి సిగ్గుచేటు, వగైరా వగైరా మాటలు చెప్పి, యుద్ధం త్వరలోనే ముగిసిపోతుందనీ, నేను మా అమ్మ దగ్గరకి తిరిగిపోతే బాగుంటుందనీ నాకు చెప్పారు. ఇంటికి వెళ్లిపోయేందుకు బదులు ఆ దళపు ఛీఫ్ ఆఫ్ స్టాఫ్‌ని కలుసుకోవాలని నేను పట్టుపట్టాను. నేనక్కడకి వెళ్లేసరికి దళంలో నా పేరు నమోదుచేసుకునేందుకు నిరాకరించిన కల్నల్ అక్కడే వున్నాడు. అది చూసి నేను పై అధికారితో 'కామ్రేడ్ పై అధికారీ, యీ కల్నల్ చెప్పినది నేను చెయ్యకుండా ఉండేందుకు నన్ను అనుమతించండి. నేను ఇంటికి తిరిగి వెళ్లను. నేనూ మీతోబాటు తిరోగమిస్తాను. నాకు ఎక్కడకి వెళ్లేందుకూ అవకాశం లేదు. జర్మన్లు చాలా దగ్గర్లో వున్నారు' అన్నాను. దాని తర్వాత నాకు 'కామ్రేడ్ పై అధికారీ' అనే మారుపేరు పెట్టారు. యుద్ధం మొదలయ్యాక అది ఏడవ రోజు... తిరోగమించ నారంభించాం...

''త్వరలోనే మొదటి రక్తపాతం జరిగింది. చాలామంది క్షతగాత్రులయ్యారు. వాళ్లందరూ జీవించాలని ఎంతగానో అపేక్షిస్తూ ఎంతో ప్రశాంతంగా, ఓపిగ్గా వున్నారు. ప్రతి ఒక్కరూ యుద్ధం ఎక్కువ కాలం సాగదనీ, త్వరలో ముగిసిపోతుందనీ ఎదురుచూశారు. నేను నిలువునా రక్తంతో నానిపోవడం నాకు గుర్తుంది... నా కాన్వాస్ షూస్ ముక్కలుముక్కలుగా చిరిగిపోయాయి, నేను దిస పాదాలతో నడవనారంభించాను.

''తర్వాత మా దళం శత్రువులచేత చుట్టుముట్టబడింది. నా వద్దీలో బోలెడు మంది క్షతగాత్రులున్నారు. మమ్మల్ని తీసుకెళ్లేందుకు ఏ ట్రక్కూ ఆగలేదు. తర్వాత గాయపడిన ఒక లెఫ్టినెంటు నాకు తన పిస్తోలు యిచ్చి 'నువ్వు కాల్చగలవా?' అని అడిగాడు. నేను ఎలా కాల్చగలనో నాకే తెలియదు, ఇతరులు కాల్చడం మాత్రమే నేను చూశాను. కాని నేనా పిస్తోలు తీసుకుని ట్రక్కుల్ని ఆపేందుకు రోడ్డువారకి వెళ్లాను. అదిగో అక్కడ, నా జీవితంలో మొట్టమొదటి సారిగా నేను బూతులు తిట్టాను.

''కాని భయంకరమైన రోజులు ముందున్నాయి — మిక్కిలి గడ్డైనది స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం... యుద్ధ భూమి అంటే స్టాలిన్‌గ్రాడ్ నగర వీధులు, గృహాలు, నేలమాళిగలు... అలాంటి పరిస్థితిలో ఒక క్షతగాత్రుణ్ణి మోసుకురావడం ఎలా వుంటుందో ఊహించుకోండి. నా శరీరమంతా కముకు దెబ్బలు, నా దుస్తులన్నీ రక్తంలో నానిపోయాయి. 'అమ్మాయిలూ, యింక యూనిఫారాలు లేవు, అడిగి ప్రయోజనం లేదు' అనేవాడు సార్జెంట్ మేజరు. మాకు వున్న దుస్తులన్నీ రక్తంతో తడిసిపోయాయి. అవి ఎండిన తర్వాత ఎంతగా బిరబిగిసిపోయేవంటే,

వాటి అంచు గీసుకుంటే ఒళ్ళు తెగేది. దుస్తులకి గంజి పెట్టినప్పటికంటె అవి బిర్రుగా వుండేవి. వోల్గా నదిమీద నీటితో సహా ప్రతీదీ మండిపోతూ వుండేది. శీతాకాలంలో సైతం వోల్గా నది గడ్డకట్టలేదు, సరికదా మండుతూ వుండేది. ప్రతీదీ తగులబడుతూ వుండేది... స్టాలిన్‌గ్రాడ్‌లో మనుషుల రక్తంతో తడవని ఒక్క అంగుళం భూమి కూడా లేదు.

''నాకు అప్పట్లో వున్న కోరికల్లా పద్దెనిమిదవ పుట్టిన రోజుదాకా బతికివుండాలని మాత్రమే. అంతకుముందు చచ్చిపోకూడదని నేను కోరుకున్నాను. నాది దురాశ కాదనుకుంటాను, ఏమంటారు? — పద్దెనిమిదేళ్ళు వచ్చేదాకా బతకడం, అంత మాత్రమే... కొత్త బలగాలు వస్తూండేవి. తరుణ వయస్కులైన, అందమైన కుర్రాళ్ళు... అంతే, ఒకటి రెండు రోజుల్లో వాళ్ళందరూ మడిసిపోయేవాళ్ళు, ఒక్కడు కూడా మిగలకుండా. దానితో కొత్త కుర్రాళ్లని చూసేందుకూ, వాళ్ల ముఖాలూ, సంభాషణలూ గుర్తుపెట్టుకునేందుకూ నాకు భయంపట్టుకుంది. ఎందుకంటే, వాళ్ళిలా వచ్చేవారు, అలా అంతరించిపోయేవాళ్ళు. అది 1942. యుద్ధంలోకెల్ల మిక్కిలి గడ్డు సంవత్సరం. నా చుట్టూ మనుషులు చచ్చిపోవడం నేను చూశాను... నేను వాళ్లకి చెయ్యగల సహాయం ఏమీ లేదనీ, వాళ్ళు తమ అంతిమ శ్వాస విడుస్తున్నారనీ నాకు తెలుసు. నేను వాళ్లని ముద్దుపెట్టుకొనేదాన్ని, బుజ్జగించేదాన్ని, వాళ్లతో ఆపేక్షగా మాట్లాడేదాన్ని, వాళ్లకి వీడ్కోలు యిచ్చేదాన్ని, కాని అంతసేపూ నా నిస్సహాయతకి వేదనతో కుమిలిపోయేదాన్ని... వాళ్ల ముఖాలు — ఆ కుర్రాళ్లందరి ముఖాలు — యిప్పటికీ నా మనో నేత్రం ముందు కదులాడుతూ వుంటాయి. ఎన్నో ఏళ్లు గడిచాయి, కాని వాళ్ల ముఖాల్లో ఒక్కటి కూడా నేను మరిచిపోలేదు. ఊహుం, ఏ ఒక్కరినీ నేను మరచిపోలేదు, ఆ కుర్రాళ్లందరూ నాకు గుర్తున్నారు...'' ఆమె ఏడవ నారంభించింది. ''మేము వాళ్లకి స్వయంగా మా చేతుల్తో సమాధులు తవ్వుదామనుకున్నాం. కాని ఆఖరికి అది కూడా అన్ని సందర్భాల్లో సాధ్యమయ్యేది కాదు. మేము వాళ్లని వదిలేస్తే, వాళ్ళు ఎక్కడ పడివున్న వాళ్ళు అక్కడే వుండిపోయేవారు. నగరం శిధిలపు గుట్టలుగా మారింది. అది భయంకరమైన దృశ్యం. కాని యువ సైనికులు చచ్చిపడివుండటం అంతకన్న దారుణమైన దృశ్యం...

''స్టాలిన్‌గ్రాడ్ యుద్ధం ముగిశాక బాగా గాయపడ్డవాళ్లతోబాటు మమ్మల్ని స్టీమ్ బోట్లమీదా, సరుకుల పడవలమీదా కజాన్‌కీ, గోర్కీకీ తీసుకు వెళ్లమని ఆజ్ఞలు వచ్చాయి. అవి మార్చి, ఏప్రిల్ మాసాలు. కాని నేలమాళిగల్లో, కందకాల్లో, సొరంగాల్లో ఎంతోమంది క్షతగాత్రులు వున్నారు. అది భయంకరం. యుద్ధ భూమినుంచి క్షతగాత్రుల్ని తొలగించేటప్పుడు, స్టాలిన్‌గ్రాడ్‌లో యింకెవరూ

మిగినివుండరని మాకు అనిపించింది. వాళ్లందర్నీ తీసుకుపోయినట్లు అనిపించింది. కాని పోరాటం ముగిసేసరికి, వాళ్లింకా ఊహకి అందనంతమంది ఉన్నట్లు తేలింది... నేను ప్రయాణంచేసిన స్టీమ్ బోటులో కూడా చేతులు, కాళ్లు లేనివాళ్లు, వందల మంది క్షయ బారిన పడినవాళ్లూ వున్నారు. వాళ్లు శారీరకంగానే కాక మానసికంగా కూడా వైకల్యం పొంది, తీవ్రంగా దిగలుపడ్డారు. మేము వాళ్లని దయతో, ప్రేమతో చూసి వాళ్లని పునరుజ్జీవితుల్ని చేసేందుకు ప్రయత్నించాం.

''మమ్మల్ని వాళ్ల వెంట పంపేటప్పుడు, అది పోరాటంనుంచి కొంత విరామంగా వుంటుందని మానసిక ఒత్తిడినుంచి అదొక మాదిరి సడలుబాటు అన్నట్లు — మాకు చెప్పారు. మా ఆ ప్రయాణం స్టాలిన్‌గ్రాడ్ యుద్ధాలకంటె భారప్రాయంగా తయారైంది. అక్కడ మేము మనిషిని యుద్ధ భూమినుంచి మోసుకెళ్లి, అతనికి ప్రథమ చికిత్స చేసేవాళ్లం. తర్వాత అంతా బాగానే వుందనీ, అతన్ని గురించి తగు శ్రద్ధ తీసుకోబడుతుందనీ తెలుసుకొని, అతన్ని పంపేసేవాళ్లం. తర్వాత మిగిలినవాళ్లని తీసుకొచ్చేందుకు పాక్కుంటూ వెళ్లేవాళ్లం. కాని స్టీమర్లలో వాళ్లు అనుక్షణం మా ఎట్ట ఎదుట వుంటారు... స్టాలిన్‌గ్రాడ్‌లో వాళ్లు జీవితేచ్ఛతో 'తొందరగా కట్టుకట్టు సిస్టర్ డియర్! తొందరగా!' అంటూ మమ్మల్ని తొందర పెట్టేవారు. ఇక్కడ అందుకు భిన్నంగా వాళ్లు తిండి తినకుండా భీష్మించేవాళ్లు, చచ్చిపోవాలని కోరుకునేవారు. వాళ్లలో కొందరు స్టీమరునుంచి నదిలోకి దూకేసేవాళ్లు. మేము వాళ్లని కాపలా కాసేవాళ్లం... నేను రెండు చేతులూ లేని ఒక కెప్టెన్ దగ్గర రాత్రంతా కూర్చునేదాన్ని. ఆయన ఆత్మహత్యచేసుకోవాలనే ధోరణిలో వుండేవాడు. ఓ సారి నేను కొద్ది నిముషాలపాటు, మరో నర్సుని హెచ్చరించకుండా పక్కకి వెళ్లాను. అంతే నేను తిరిగివచ్చేలోగా ఆయన నదిలోకి దూకేశాడు...

''క్షతగాత్రుల్ని మేము పేర్మ్ బయట వున్న ఉసోల్యేకి తీసుకెళ్లాం. అక్కడ వాళ్లకోసం ప్రత్యేకించి శుభ్రమైన కొత్త యిళ్లు సిద్ధంచేశారు. అదొక యువ పయొనీర్ శిబిరంలా వుంది... మేము వాళ్లని మోసుకెళ్తూండగా వాళ్లు పళ్లు పటపట నూరుతూండేవాళ్లు. వాళ్లలో ఏ ఒక్కరినైనా సరే భర్తగా స్వీకరించి, అతని కోసం ఏమి చేసేందుకైనా సరే సిద్ధమన్నట్లు మాకందరికీ అనిపించింది. మేము స్టీమరుమీద ఒంటరిగా తిరిగివెళ్లాం. మేము కొంత విశ్రాంతి తీసుకోవచ్చు. కాని మాలో ఏ ఒక్కళ్లం నిద్రపోలేకపోయాం. మొదట అమ్మాయిలందరూ మౌనంగా పడుకున్నారు. కాని అకస్మాత్తుగా ఏడవ నారంభించారు. తర్వాత మేము ఎవరికి ఎవరు రాయాలో ముందు నిర్ణయించుకొని రోజూ వాళ్లకి ఉత్తరాలు రాయడం మొదలుపెట్టాం. మేము ఎదురుచూసేందుకు వాళ్లకి కనీసం ఏదో ఒక ఆశా రేఖ చూపాలని అనుకున్నాం.

''ఇది మీకు స్వల్ప విషయంగా కనిపించవచ్చు, కాని ఆ ప్రయాణం తర్వాత పోరాటంలో నా కాళ్లనీ, ముఖాన్నీ జాగ్రత్తగా కాపాడుకో నారంభించాను... నా కాళ్లు అందంగా వుంటాయి. అవెక్కడ వికారంగా తయారవుతాయో అని నేను భయపడేదాన్ని, అలాగే నా ముఖం విషయంలో కూడా... ఎంత స్వల్ప విషయమో...

''యుద్ధం ముగిశాక కొన్నేళ్లపాటు రక్తపు వాసన నన్ను దయ్యంలా పీడించేది. నేను బట్టలు ఉతికినప్పుడు లేక వంటచేసినప్పుడు నాకు అది గుర్తుకొస్తుంది... నాకొక సారి ఎవరో ఎర్రటి బ్లౌజును కానుకగా యిచ్చారు. దుస్తులకి ఎంతో కొరత వున్న ఆ రోజుల్లో అదొక అపురూపమైన కానుక. కాని అది ఎర్రగా వున్నందున నేను దాన్ని ధరించలేకపోయానంతే... ఆ ఒక్క రంగును మాత్రం నేను సహించ లేను. నేను మాంస విక్రయశాలల్లోకి అడుగుపెట్టలేను... నా భర్తే ఎప్పుడూ మాంసం తెస్తూవుంటాడు. వేసవికాలంలో నేను పట్నంలో ఉండలేక ఎక్కడికైనా వెళ్లిపోయేందుకు ప్రయత్నిస్తూవుంటాను. వేసవి మొదలైనప్పుడల్లా నాకు యుద్ధం ప్రారంభం కాబోతోంది అనిపించేది. సూర్యుడు సమస్తాన్నీ – చెట్లనీ, ఇళ్లనీ, యాస్ఫాల్టు రోడ్లనీ – వెచ్చపరచగానే అదేదో వాసన కొడుతుంది. కాని నాకు మాత్రం అదంతా రక్తం వాసన కొడుతుంది. నేనేమి తిన్నా, తాగినా, ఆ వాసన నన్ను వదలదు! పక్కమీద ఉతికిన దుప్పట్లు పరుస్తున్నా కూడా, అవి నాకు రక్తపు వాసనే కొడతాయి...''

ఉమ్నాృగినా తమారా తర్వాత 1945 మే గురించి చెప్పింది.

''1945 మేలో మేము బోలెడు ఫొటోలు తీయించడం గుర్తుకొస్తోంది... ప్రతి ఒక్కరూ మహా సంతోషంగా వున్నారు... 1945 మే 9న ప్రతి ఒక్కరూ 'విజయం! విజయం!' అంటూ అరిచారు. మా చెవుల్ని మేము నమ్మలేకపోయాం... యుద్ధం నిజంగానే అయిపోయిందా? మరి యిప్పుడిక మేమేం చెయ్యాలి?

''కాల్పులు వినవస్తున్నాయి... ఆయుధం వున్న ప్రతి ఒక్కరూ గాలిలోకి కాలుస్తున్నారు. 'కాల్పులు ఆపండి!' అని కమాండింగు ఆఫీసరు ఆజ్ఞాపించాడు.

'' 'మా దగ్గర కొన్ని తూటాలు మిగిలి వున్నాయి. వాటిని ఉంచుకొని ప్రయో జనమేమిటి?' అని మేము ఆశ్చర్యపోయాం.

''అనేక స్వరాల్లో విజయం అన్న ఒక్క మాట మాత్రమే నాకు వినిపిస్తోంది. ఒక్కమారుగా ప్రతి ఒక్కరిలో జీవితేచ్ఛ పెల్లుబికింది. మాకందరికీ యిప్పుడిక అందమైన జీవితం ఎదుట వుంది. నేను నా పతకాలన్నీ పెట్టుకొని ఫొటో తియ్యి మన్నాను. ఎందుకో తెలియదు గాని, నా చుట్టూ పువ్వులుంచాలని కోరుకు న్నాను. అలా వుంటే, ఫొటో నేను పూల పాన్పుమీద వున్నట్లు చూపుతుందని అనుకున్నాను...

“జూన్ 7న నేను చాలా సంతోషంగా వున్నాను. అది నా పెళ్లి రోజు. మా దళ సభ్యులు దాన్నొక సిసలైన ఉత్సవంగా చేసేందుకు తాము చెయ్యగలిగిందంతా చేశారు. నాకు కాబోయే భర్త నాకు చాలా కాలంగా తెలుసు. ఆయన ఒక కంపెనీ కెప్టెన్. బతికి వుంటే యుద్ధానంతరం పెళ్లిచేసుకోవాలని మేమిద్దరం ప్రమాణాలు చేసుకున్నాం. మాకొక నెల రోజులపాటు లీవు యిచ్చారు. అందుకని మేమిద్దరం ఇవానొవొ ప్రాంతంలోని కినేష్మలో వున్న ఆయన తల్లిదండ్రుల్ని చూసేందుకు వెళ్లాం...

“అప్పట్లో ఆహార పదార్థాలకి రేషనింగు వుండేది. నా భర్తా, నేనూ మా రేషన్ కార్డులు రెండూ తీసుకొని కొన్ని ఆహార పదార్థాలు కొనేందుకు ఒక ప్రత్యేక స్టోర్సుకి వెళ్లాం. అక్కడ మేము ఒక క్యూలో నిలబడ్డాం. నా వంతు వచ్చేసరికి కౌంటరు వెనక నిలబడ్డ ఒక వ్యక్తి చటుక్కున ముందుకి దూకి ‘మిత్రులారా! నేనావిణ్ణి కనుక్కున్నాను. నేనావిణ్ణి కలుసుకున్నాను. సోదరులారా, నా ప్రాణం కాపాడింది యీ అమ్మాయే!’ అని అరుస్తూ, నన్ను కౌగిలించుకొని, ముద్దు పెట్టుకో నారంభించాడు. అంతసేపూ నా భర్త అక్కడే నిలబడి వున్నాడు. కాల్పుల మధ్య నేను మోసుకొచ్చిన క్షతగాత్రుల్లో అతనొకడు. మరి అతను నన్ను గుర్తు పెట్టుకున్నాడు.

“...కినేష్మనుంచి మేము మా యూనిట్‌కి తిరిగివెళ్లాం. మా యూనిట్ రద్దుచెయ్యబడదనీ, మేము మందు పాతరలు తొలగించాల్సివుంటుందనీ చెప్పారు. సమష్టి వ్యవసాయ క్షేత్రాలకి భూమి అవసరం. యుద్ధం ప్రతి ఒకరికీ అయి పోయింది కాని శాపర్లకి మాత్రం అది యింకా సాగుతూనే వుంది. మా అమ్మలకి విజయం చేకూరిందన్న విషయం అప్పటికే తెలుసు... చుట్టూ ఎక్కడ చూసినా గడ్డి ఎత్తుగా పెరిగివుంది. యుద్ధ కాలంలో ప్రతీదీ పాడుపడిపోయింది, నేలలో మందు పాతరలు, బాంబులు నాటబడ్డాయి... కాని జనానికి దున్నుకొనేందుకు పొలం కావాలి. అందుకని మేము తొందరపడ్డాం. మా కామ్రేడ్సు మళ్లీ ప్రతి రోజూ చచ్చిపోవడం మొదలైంది. యుద్ధం అయిపోయినా, మేము ప్రతి రోజూ మనుషుల్ని సమాధిచేస్తూనే వున్నాం... పొలాల్లో మేము బోలెడుమంది మనుషుల్ని కోల్పోయాం...

కొన్ని సందర్భాల్లో మేమా భూఖండాన్ని శుభ్రంచేసి సమష్టి వ్యవసాయ క్షేత్రానికి అప్పగించాక, ట్రాక్టరు టాంకు విధ్వంసక మందు పాతర్లకి తగిలి డ్రైవర్లు చనిపోయిన సందర్భాలు వున్నాయి. అప్పట్లో ట్రాక్టర్లు బాగా అరుదుగా వుండేవి. యుద్ధం ముగిసిపోయాక దేశంలో మళ్లీ కన్నీళ్లను చూడటం నిజంగానే బాధాకరంగా వుండేది... మగాళ్లూ, ఆడాళ్లూ కలిసి ఏడ్చేవాళ్లు. నాకొక ఘటన జ్ఞాపకం వస్తోంది. మా దళంలో ఒక సైనికుడున్నాడు. స్త్రారయ రూస్స వెలుపల ఒక

గ్రామంలో ఒక సైనికుడు వుండేవాడు. నేను ఆ గ్రామం పేరు మరచిపోయాను... అతను తన సొంత సమష్టి వ్యవసాయ క్షేత్రానికి చెందిన పొలాల్లో మందు పాతరలు తొలగించేందుకు వెళ్లాడు. ఒక మందు పాతర పేలి, అతను అక్కడే చనిపోయాడు. గ్రామస్తులు అతన్ని అక్కడికక్కడ ఆ పొలంలోనే సమాధిచేశారు. అతను యుద్ధం పొడుగునా పోరాటంలో వున్నాడు. కాని అతను యుద్ధం ముగిసిపోయాక, తన సొంత ఊరి పొలాల్లో చచ్చిపోయేందుకే యుద్ధంలో బతికి వున్నాడా అనిపించే ఘటన యిది...

''ఈ విషయాలను గురించి మాట్లాడినా కూడా నా మనస్సు వికలమై పోతుంది. నేను దాన్ని గురించి చెప్తున్నప్పుడు నా శరీరం సమస్తం జలదరిస్తోంది. నా మనో నేత్రాల ముందు ఆ దృశ్యాలన్నీ గిర్రున తిరుగుతున్నాయి — చెల్లాచెదరుగా వెదజల్ల బడిన మృతులు, వాళ్ల తెరుచుకున్న నోళ్లు, తెగిన పేగులు — నేను యుద్ధ క్షేత్రాల్లో రాళ్లనుకంటె ఎక్కువగా శవాలను చూశాను...

''యువజనులు అప్పుడప్పుడు తమ మధ్యకి వచ్చి నా స్మృతులను పొలుపంచు కుంటామంటూ వుంటారు. కాని దాన్ని గురించి చెప్పడం నా వల్ల కాదు. నేనొక సారి ఒక మెడికల్ స్కూలుకి వెళ్లాను. నేనక్కడ తెల్లటి ఓవరాల్సు చూడగానే నాకు వికారం వచ్చేసింది.

''మరో సారి నాకోసం కారు పంపారు. మేము కొంత దూరం వెళ్లాక నేను 'దయచేసి నన్ను వెనక్కి యింటికి తీసుకెళ్లగలరా? నాకు ఒంట్లో అంత బాగా లేదు' అన్నాను. నిజానికి జరిగిందేమిటంటే, నేను మాట్లాడబోయే విషయా లను గురించి ఆలోచించడం మొదలెట్టి, ఆ ఘటనలన్నీ నెమరేసుకున్నాను. యుద్ధ కాలంలో తోటి సైనికులు 'మనం చచ్చిపోవలసివస్తే మనం తమారాతోబాటు చచ్చిపోతే మంచిది. మనకి పరలోకంలో కూడా ఆమెతో మంచి కాలక్షేపమవుతుంది!' అంటూండేవారు. ఈ విషయం నేనెందుకు చెప్తున్నానంటే, నేను అప్పట్లో మహా సాహసికురాలిగా, నిబ్బరంగా ఉండేదాన్ని. కాని ఎప్పుడైతే యుద్ధం ముగిసిపోయిందో, నేను మారిపోయినట్లనిపిస్తోంది. నా వల్ల కావడం లేదు... సినిమాలూ, పుస్త కాలూ మేము చూసినవాటన్నింటినీ యింకా పూర్తి వాస్తవికంగా చిత్రించలేక పోతున్నాయి. యుద్ధం, ముఖ్యంగా బాహాబాహీ పోరాటం ఎంత భయంకరంగా వుండేదీ పాఠకులకి కళ్లకి కట్టినట్లు చిత్రించే కథనం యేదీ నేనింతవరకు చదవలేదు.

అలాంటి అనుభవం కలిగిన మనిషి చాలా రోజులపాటు ప్రశాంతంగా మాట్లాడ లేక, నత్తులుకొట్ట నారంభిస్తాడు. అలాంటిది చూడనివాడెవడూ దాన్ని అర్థం చేసుకోలేడు. కొందరు దాన్ని గురించి మాట్లాడగలుగుతారు... మరి అది అవ

సరం. కాని అదొక గొప్ప సాధన. నా మటుకు నేను ఆ పని చెయ్యలేను. వెంటనే కలగుండుపడిపోతాను.

''పోతే విజయ దినోత్సవం... నేను దానికోసం ఎదురు చూస్తాను. అదే సమయంలో దాన్ని గురించి భయపడతాను. అందుకు ముందు కొన్ని వారాలబాటు మాసిన బట్టలు మేటపడనిస్తాను. అలా రోజంతా చేతినిండా పనివుండేలా చూసుకుంటాను. రోజంతా నాకు చేసేందుకు ఏదో ఒక పని వుండాలి. మా యుద్ధ వెటరన్ల సమావేశాలు జరిగినప్పుడు, మాకు జేబు రుమాళ్లు ఉన్నా సరిపోవు, అవి యిట్టే అయిపోతాయి. అలా వుంటాయి మా వెటరన్ల సమావేశాలు. నేను మీకు యింకో విశేషం చెప్తాను. చిన్న పిల్లలు 'యుద్ధం ఆట' ఆడడం నేను చూడలేను. అది చూస్తే నాకు మనస్సు వికలమైపోతుంది...''

''మీరు మీ కూతురుకీ, మనుమరాలికీ యుద్ధం గురించి చెప్తారా?''

''మేము మా పిల్లల్నుంచి యీ విషయాలు మరుగుపరచేందుకు ప్రయత్నిస్తాం. మేము అనుభవించిన భయంకర విషయాలను గురించి వాళ్లు చాలా తక్కువ తెలుసుకుంటారు.''

''మీ అభిప్రాయంలో అది సరైనదేనా?''

''అబ్బే, అది సరైనది కాదు. వాళ్లని అన్నింటినుంచీ కాపాడేందుకు వాళ్ల చుట్టూ ఒక కవచం ఏర్పాటుచెయ్యాలని మనం చూస్తాం. కాని అదెంతమాత్రం సరైనది కాదు. నేనొక సారి పెళ్లి దుస్తుల్లో వున్న వధూవరులు, తమ మిత్ర బృందంతో కలిసి, మీన్స్క్‌లోని విజయ స్మారక చిహ్నం దగ్గరకి వెళ్లడం చూశాను. వాళ్లంతా బిగ్గరగా నవ్వుతున్నారు... నాకు తెలియదు — బహుశా నాది తప్పేమో — కాని నేను వాళ్లతో 'మీరిక్కడ నవ్వకూడదు. మీరిక్కడ నవ్వితే మీరు సంతోషంగా ఉండబోరు' అని చెప్పాను. బహుశా నేనలా చెప్పడం క్రూరత్వమేమో, కాని వాళ్లు నన్ను క్షమిస్తారని ఆశిస్తాను...''

''పిల్లలు 'యుద్ధం ఆట' ఆడడం నేను చూడలేను'' అంటుంది ఉమ్మాయిగినా తమారా. జనం యుద్ధాన్ని మరచిపోగోరుతారు. దారుణ సంఘటనలను గురించిన స్మృతులు మనస్సు నిండా ఉన్నప్పుడు, మనిషి హృదయం అంతగా వేదనతో వికలమైనప్పుడు జీవించడం కష్టం. కాని వాళ్లు మరచిపోయి, తమ స్మృతులను మనకి అందజెయ్యకపోతే మన గతేం కావాలి? మనం వీటిలో దేన్ని మరచిపోయేందుకైనా ప్రపంచ పరిస్థితి మరీ ఆందోళనకరంగా వుంది.

''నేను జీవితాన్ని కాపాడుతున్నాను'' అంటుందామె. ''మానవ జీవితంకోసం మనం చాలా ఎక్కువ మూల్యం చెల్లించాం. నేను ప్రపంచాన్ని కాపాడుతూ వచ్చాను...

''అనేక వస్తువులు లేకపోయినా నేను గడుపుకోగలను. నాకు విలాస వస్తువులు

అక్కర్లేదు. నేను సమస్తం వదిలేసేందుకు సిద్ధంగా వున్నాను. అయితే శాంతిని మటుకు ఉండనివ్వండి! కేవలం ఒక్క శాంతి. మీరు నన్ను అర్థంచేసుకున్నారనుకుంటాను, ఔనా? ప్రపంచానికి శాంతిని యిచ్చేందుకే మేమానాడు పోరాడాం..."

సోవియట్ స్త్రీలు జీవితాన్నీ, శాంతినీ కాపాడేందుకు పోరాడుతూ వచ్చారు. వాళ్లు వీర మాతలు, వీర పుత్రికలు, వీర సతులు, వీర సోదరీమణులు, వీర సైనికులు.

వాళ్లకి నివాళులు అర్పిద్దాం.

పాఠకులకు మనవి

ఈ పుస్తకం గురించీ, దీని అనువాదం గురించీ, కూర్పును గురించీ మీ అభిప్రాయాలను ''ప్రగతి'' ప్రచురణాలయానికి తెలుపండి.

చిరునామా:

Progress Publishers
17, Zubovsky Boulevard
Moscow, USSR

మా ప్రచురణలు దొరికే చోట్లు:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్
4–1–435 బాంక్ స్ట్రీట్
హైదరాబాదు – 500001

విశాలాంధ్ర బుక్ హౌస్
4–2–237 సుల్తాన్ బజార్
హైదరాబాదు – 500195

విశాలాంధ్ర బుక్ హౌస్
కార్ల్ మార్క్స్ రోడ్డు
విజయవాడ – 520002

విశాలాంధ్ర బుక్ హౌస్
కాలేజి రోడ్డు
అనంతపురం – 515004

విశాలాంధ్ర బుక్ హౌస్
గాంధీ రోడ్డు
తిరుపతి – 517001

విశాలాంధ్ర బుక్ హౌస్
సూపర్ బజారు ఎదుట
విశాఖపట్నం – 530002

విశాలాంధ్ర బుక్ హౌస్
రష్యన్ షాపింగ్ కాంప్లెక్స్
స్టీల్ ప్లాంట్ టౌన్‌షిప్
విశాఖపట్నం – 530031

విశాలాంధ్ర బుక్ హౌస్
పాత మునిసిపల్ ఆఫీసు ఎదుట
మెయిన్ రోడ్డు
హనుమకొండ – 506001

విశాలాంధ్ర బుక్ హౌస్
అరండల్ పేట
మెయిన్ రోడ్డు
గుంటూరు – 522002

విశాలాంధ్ర బుక్ హౌస్
మెయిన్ రోడ్డు
కాకినాడ – 533001

విశాలాంధ్ర బుక్ హౌస్
మెయిన్ రోడ్డు
కాకినాడ – 533001

81

# యుద్ధం స్త్రీ ప్రకృతికి విరుద్ధం



బైలోరష్యాకి చెందిన అలెక్సీయెవిచ్ స్వెత్లానా 1948లో జన్మించింది. 1967లో బైలోరష్యన్ ప్రభుత్వ విశ్వవిద్యాలయంలో చేరింది. 1972లో జర్నలిస్టు విభాగంనుంచి పట్టభద్రురాలైంది. బైలోరష్యా రిపబ్లిక్ జిల్లా, తాలూకా పత్రికల్లో పనిచేసింది. ఈమె సోవియట్ యూనియన్ రచయితల సంఘ సభ్యురాలు. ఈమె రచించిన "యుద్ధం స్త్రీ ప్రకృతికి విరుద్ధం," "ఆఖరి సాక్షి" (యుద్ధం గురించి పిల్లల కథనాలు) అనే పుస్తకాలు విశేష ప్రాచుర్యం పొందాయి. "యుద్ధం స్త్రీ ప్రకృతికి విరుద్ధం"ను అనేక భాషల్లోకి అనువదించారు, డాక్యుమెంటరీ సినిమాలు తీశారు, నాటకాలుగా మలిచారు. "యుద్ధం స్త్రీ ప్రకృతికి విరుద్ధం" యుద్ధంలో పాల్గొన్న స్త్రీల కథనాలు. అవి కథలూ, గాథలూ కావు, బాధాకరమైన భావోద్వేగాలు.

1941లో వధువులు కావాలని బంగరు కలలు గన్న బాలికలు ఎలా సైనికుల య్యారో యిందులోని కథనాలు చెప్తాయి. 20వ శతాబ్దిలో సంభవించిన అత్యంత దారుణమైన రెండవ ప్రపంచ యుద్ధంలో 8 లక్షలమందికి పైగా సోవియట్ మహిళలు పురుషులతో సరిదీటుగా పాల్గొన్నారు. స్త్రీలు క్షతగాత్రులను రక్షించి, కట్లు కట్టడమే కాకుండా, కాల్పులు జరిపారు, వంతెనలు పేల్చారు, శత్రువుల అనుపానులు తెలుసుకొనేందుకు వేగు చర్యలు సాగించారు, తమ మాతృదేశంమీద, తమ ఇళ్లమీద, తమ బిడ్డలమీద కనీవినీ ఎరుగని క్రౌర్యంతో దాడిచేసిన శత్రువులను చంపారు.

రచయిత్రి యీ పుస్తక రచనకోసం నాలుగేళ్ళు అవిరామంగా శ్రమించింది. నూటికి పైగా నగరాలు, పట్టణాలు, పల్లెలు, జనావాసాలు పర్యటించి, యుద్ధంలో పాల్గొన్నవాళ్ల కథనాలు సేకరించింది. అయితే వాటిలో ముఖ్యమైనవి యుద్ధ రంగంలో జరిగిన ఘటనలు కావు, యుద్ధంలో స్త్రీల గుండెల్ని పిండివేసిన అనుభవాలు. ఈ ప్రత్యక్ష సాక్షుల కథనాల ద్వారా గతంనుంచి వర్తమానం నేర్చుకోవలసిన గుణపాఠాల పైకీ, నాటి, నేటి ఫాసిజం పైకీ, యుద్ధాన్ని నివారించవలసిన అవసరం పైకీ పాఠకుల దృష్టి ఆకర్షింపబడింది.



"ప్రగతి" ప్రచురణాలయం

ISBN 5-01-000881-5